# రామాయణ సుధాలహరి

వాల్మీకి రామాయణం, అధ్యాత్మరామాయణం, తమిళ మలయాళ రామాయణాలు, కన్నడరామాయణాలు, హిందీ రామాయణాలు, జానపద రామాయణాలు, తెలుగురామాయణాలు, శ్రీమద్రామాయణకల్పవృక్షంపై ప్రసిద్ధాంధ్రసాహిత్యాచార్యులు ఆచార్య దివాకర్ల వేంకటావధాని, డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తి, డా॥ చల్లా రాధాకృష్ణ శర్మ, డా॥ బాడాల రామయ్య, శ్రీ వారణాసి రామమూర్తి 'రేణు', ఆచార్య డా॥ బి. రామరాజు, 'కరుణశ్రీ' శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి, డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం గార్ల ఉపన్యాస మంజరి.

---

అంకితం:

**కీ॥ శే॥ కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారికి**

---

## ప్రచురణ





రిజిష్టరు నెం. 1/64

**యువభారతి**
**సాహితీ సాంస్కృతిక సంస్థ**
**5 కింగ్స్‌వే, సికింద్రాబాదు.**

RAMAYANA SUDHALAHARI

A COLLECTION OF LECTURES IN TELUGU ON "RAMAYANA" IN SANSKRIT, TAMIL. MALAYALAM KANNADA, HINDI AND TELUGU LANGUAGES

BY
Prof. Divakarla Venkatavadhani, Dr. Dhulipala Srirama murty, Dr. Challa Radhakrishna Sarma, Dr. Badala Ramayya, Sri Varanasi Ramamurty 'Renu', Prof. B. Rama Raju, 'Karuna-sri' Sri Jandhyala Papayya Sastry and Dr. G. V. Subrahmanyam.



యువభారతి

ప్రచురణ : 50

ప్రథమ ముద్రణ : ప్రతులు 4,200.

19 డిసెంబరు 1976.



ముఖచిత్ర రచన : అక్షరాలంకరణ
శ్రీ శీలా వీర్రాజు

ముద్రణ : 1. నాగార్జున ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాదు,
2. నాగలక్ష్మి ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాదు.

ముఖచిత్ర ముద్రణ : టెక్నో ప్రింటర్స్, హైదరాబాదు.

ప్రతులకు

యువభారతి

5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 500 003

వెల : రూ. 8-00

(ప్రచురణ పూర్వ విరాళం రూ. 5-00 ఇచ్చినవారికి అందజేయబడింది.)

Paper used for the Printing of these books was made available by the Government of India at concessional rate.
YUVABHARATHI IS GRATEFUL



# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమాణాలు పరివ్యాప్తం కాగల్గినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం కలుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్య భావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పదమూడేండ్లుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యం కంటె ఇతరమైన సాత్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువమందికి ఉత్తమసాహిత్యాన్ని అందిస్తే సాహిత్యం పట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇది యువభారతి 50 వ ప్రచురణ. ఇంత వరకు రెండులక్షల యాభై వేలకు పైగా ప్రతులను సాధ్యమైనంత తక్కువ వెలకు పాఠకులకు అందించడానికి పూనుకొంది.

యువభారతి సాహితీమిత్ర పథకంలో దాదాపు 4400 మందికి పైగా సాహితీమిత్రులు చేరారు. రానున్న ఉగాదినాటికి ఈ సంఖ్య 10 వేలకు చేరుకోవాలన్న మా లక్ష్యసాధనలో తోడ్పడండి. యువభారతి శాశ్వత జీవిత సభ్యత్వ పథకాలలో ఆరువందలమందికి పైగా భారతీ మిత్రులుగా, యాభై మంది భారతీ భూషణులుగా చేరారు. ఏ ఒక్క పథకంలో నైనా సభ్యులుగా చేరి మా "నందిని" మాసపత్రికను ఉచితంగా పొందే అవకాశం కల్పించుకోవలసిందిగా సహృదయులకు విజ్ఞప్తి. "నందిని'' లో యువభారతి కార్యకలాపాల వివరాలే కాకుండా సాహిత్యానికి సంబంధించిన అనేకాంశాలుంటాయి.

"నందిని" బహుమతి చందా పథకంలో ఇప్పటివరకు దాదాపు 800 మంది చేరారు. కేవలం ఒక్కరూపాయితో భారతదేశంలో మీ సన్నిహితులెక్కడున్నా సరే వారు మిమ్మల్ని సంవత్సరంపాటు గుర్తుంచుకునేలా, యువభారతి సంస్థతో పరిచయం కలిగించినందుకు మిమ్మల్ని అభినందించేలా చేయగలుగుతుంది "నందిని". అందుకే అర్థిస్తున్నాము మీనుండి కేవలం ఒక్కరూపాయి, మీ ఆత్మీయుల చిరునామా. వేలాదిమంది సహృదయులకు సన్నిహితం కావాలన్న లక్ష్యసాధనకు తోడ్పడండి.

మా తపస్సు ఫలించి తెలుగునేలంలో అధ్యయన శీలత, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు

19-12-76

# మా మాట

సమగ్రమైన వ్యక్తిత్వనిర్మాణానికి దోహదం చేసే అనేకాంశాలలో ఉత్తమ సాహిత్యాధ్యయనం కూడా ఒక్కటి. సమదర్శిత్వాన్ని సమన్వయదృక్పథాన్ని హృదయానికి ప్రసాదించేది సాహిత్యం ఒక్కటే. సాహిత్యం ప్రతిభావంతుని అనుభూతికి దర్పణం. మనిషి కల్పించుకున్న దేశకాలభాషా రాజకీయాల ఎల్లలను అధిగమించి మానవాత్మతో నిరంతరంగా సహయాత్ర సాగిస్తూ అతని సర్వతోముఖవికాసానికి తోడ్పడుతూ బ్రతుకులోని కమ్మదనంపట్ల ఆశలను పెంచుతూ అతని జీవితాన్ని రసమయం చేస్తూ ఉంటుంద ఉత్తమసాహిత్యం. బాహిరంగా విభిన్నంగా కనిపించే సాహిత్యాంతస్సు నిజానికి ఒక్కటే. ఈ యాథార్థ్యం మానవుడు తరతరాలుగా కంటున్న స్వప్నం. ఆ స్వప్నాన్ని సాక్షాత్కరించుకోవడానికే అతడు ఉద్యమాన్ని కొనసాగిస్తున్నాడు. ఆ ఉద్యమానికి అతణ్ణి ఉన్ముఖుణ్ణి చేస్తున్నది ప్రతిభ. అనేక రూపాల్లో ఆ ప్రతిభ అతణ్ణి ముందుకు నడుపుతున్నది. కళలు, విజ్ఞానం, వేదాంతం-అన్నీ దానికి మారురూపాలే. అయితే ఆ ప్రతిభ శక్తిమంతంగా ప్రభవిల్లడానికి ఒక్కొక్కసారి మానవుడే ప్రతిబంధాలను కల్పించుకుంటాడు. కట్టుబడిపోతాడు. బాధపడి ఆ కట్లను త్రెంచుకోవడానికి తిరిగి అతడే ప్రయత్నిస్తాడు.

ఉత్తమసాహిత్యాన్ని అధ్యయనం చేయడానికి అనువైన పరిస్థితులను కల్పించగలిగినపుడే సమాజంలో ప్రతిభకు సరియైన స్థానం లభిస్తుంది. పరస్పరావగాహన సమాజంలో పెంపొందుతుంది. ప్రతివ్యక్తిలోని సార్థక్యం దేశానికీ జాతికీ ఉపయోగపడుతుంది. ఈ లక్ష్యంతో యువభారతి గడచిన పన్నెండేళ్లుగా యువతరాన్ని దృష్టిలో ఉంచుకొని ఉపన్యాసాలద్వారా వ్యాససంకలనాలద్వారా ప్రాచీనార్వాచీన సాహిత్యాచార్యుల గ్రంథప్రచురణద్వారా తోచిన మేరకు చేయగలిగినంత మేరకు చేస్తూ ముందుకు సాగుతున్నది. ఈ పదమూడవ వార్షికోత్సవం సందర్భంగా "రామాయణసుధాలహరి" కార్యక్రమాన్ని రూపొందించింది. భారతీయాత్మను అవగాహన చేసుకోవడానికి రామాయణకావ్యాధ్యయనం అనివార్యం. ప్రపంచానికే ఇది ఆదికావ్యం. ఈ కావ్యం ప్రతిపాదిస్తున్న ఆదర్శాలను పరిణతమనస్కు లిప్పటికీ సమాదరిస్తున్నారు. భారతీయుల కుటుంబవ్యవస్థలో సాహిత్యంలో సాంఘిక జీవితంలో ఈ కావ్యం పరోక్షంగానో

ప్రత్యక్షంగానో తన ఉనికిని కనబరుస్తూనే ఉంటున్నది. భారతీయభాషల్లో నిన్న మొన్నటిదాకా వచ్చిన సాహిత్యాల కిది అంతస్సూత్రంగా భాసించింది. ఇప్పటికీ ఈ కావ్యానికి భారతీయులను సమైక్యపరచగలిగే శక్తి ఉన్నది. ఇందులోని సౌందర్యాన్ని అనుభూతులను ఉపదేశాలను ఎవ్వరూ నిరసించడం లేదు. అయితే దేశకాలోచితమైన పరిస్థితులకు అనుగుణంగా వ్యాఖ్యానించుకుంటున్నాడేగాని ఆకావ్యం ఆదరణీయమనే భావాన్ని తన రక్తంలోనుంచి తీసివేయలేక పోతున్నాడు. అచ్చమైన కావ్యానికి పాతకొత్తల రంగులు పూయడం సరియైన అధ్యయనం అనిపించుకోదు. కావ్యానికి అనుభూతి ప్రధానమనుకుంటున్నప్పుడు ఇప్పటి వ్యవస్థలకు ఇప్పటి ఆలోచనలకు అందులోని అంశాలు సరిపోలడం లేదనుకోవడం కూడా పొరపాటే. అందుకే రామాయణం భారతీయ సాహిత్య శాస్త్రలక్షణాలకు లక్ష్యప్రాయంగా ఉంటూ ఉన్నది. రామాయణ భారతభాగవతాలు సహృదయంతో చదువనిదే భారతీయ భాషలకు సంబంధించిన ఏ సాహిత్యాన్నైనా తలస్పర్శిగా అర్థం చేసికోలేరనే అభిప్రాయంతో ఈసారి యువభారతి ఈ కార్యక్రమం చేపట్టింది. భారతీయ భాషలలో కొన్నింటిని ఉపలక్షించి వాటిలో వెలువడిన రామాయణాల తీరుతెన్నులను గూర్చి ఉపన్యాసాలను ఏర్పాటు చేశాం. ఆయాభాషలలో వెలసిన రామాయణాలనుగూర్చి ఉపన్యసించడానికి సమర్థులైన పండితులను అర్థించాం. ఈ ఉపన్యాసకుల ప్రతిభా పాండిత్యాలను పఠితృలోకానికి పరిచయంచేయవలసిన సాహసం యువభారతికి లేదు. వారి సర్వతోముఖ ప్రజ్ఞాపాటవాలను తెలుగుదేశం దర్శించిన సందర్భాలనేకం.

వాల్మీకిరామాయణంలోని కవితాపారమ్యాన్ని రామాయణకావ్యప్రాశస్త్యాన్ని ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు ఉగ్గడించారు. డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తిగారు అధ్యాత్మ రామాయణపఠనం అనివార్యమని నిరూపించారు. డా॥ చల్లారాధాకృష్ణశర్మగారు తమిళ మలయాళ రామాయణాలను గూర్చి సరసంగా విజ్ఞానప్రదంగా ప్రసంగించారు. కన్నడ రామాయణాల లక్షణాలను గూర్చి డా. బాడాల రామయ్యగారు మహోదాత్తంగా వివరించారు. హిందీ భాషలో వెలసిన రామాయణాలను, ప్రత్యేకించి తులసీదాసు రామాయణాన్ని గూర్చి భక్తిరసప్రపూర్ణంగా ప్రసంగించినవారు శ్రీ వారణాసి రామమూర్తి "రేణు"గారు, విశ్వనాథవారి శ్రీమద్రామాయణ కల్పవృక్షాన్ని గూర్చి వివేచనాత్మకంగా డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు ఉపన్యసిస్తూ కల్పవృక్షం ఆధునిక కాలానికి ఆదర్శప్రాయ మని నిరూపించారు. జానపదుల జీవితాల్లో అల్లుకొని

పోయిన రామాయణాలనుగూర్చి మధురగంభీరంగా ప్రసంగించి ఆచార్య బి. రామరాజుగారు ఆ రంగంలో తాము జరిపిన విశిష్టమైన పరిశోధనానుభవాన్ని భంగ్యంతరంగా ప్రదర్శించారు. "కరుణశ్రీ" జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు తెలుగుదేశానికి కవులుగా వక్తలుగా దేశికులుగా చిరపరిచితులు. తెలుగులోని రామాయణాలను అపూర్వ పద్ధతిలో విశ్లేషించి తెలుగువాళ్ళ ఆరాధ్య దైవం రాముడు వాళ్ళ సాహిత్యంలో ప్రతిబింబించిన తీరును సాక్షాత్కరింపచేశారు. జనరంజకంగాయువభారతి వేదికపై ప్రసంగించడమేకాక ఈ ఉపన్యాసాలకు వ్యాసరూపాలను కల్పించి ప్రచురణార్థం మాకందజేసిన ఈ ధన్యాత్ములకు మాహార్దికములైన ధన్యవాదాలు.

"రామాయణసుధాలహరి" కార్యక్రమాలకు ముఖ్యఅతిథులుగా విచ్చేసిన వారు శ్రీ యడవల్లి శివరామశాస్త్రిగారు, న్యాయమూర్తులు శ్రీ బి. పి. జీవనరెడ్డి గారు, న్యాయమూర్తులు శ్రీ కొండామాధవరెడ్డిగారు, శ్రీ ఇ.వి. రాంరెడ్డి ఐ. ఎ. ఎస్. గారు. వీరిసాహిత్యాదరణకు, ఔదార్యానికి మాఅభివందనాలు

రామాయణ సుధాలహరి గ్రంథాన్ని ఆవిష్కరించిన శ్రీ గొల్లపూడి వేంకటరామ శాస్త్రిగారి సాహిత్య ప్రణయానికి మా అభివాదములు.

'రామాయణ సుధాలహరి' సమావేశాలకు అధ్యక్షత వహించి నిర్విఘ్నంగా నిర్వహించినవారు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు, ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారు, డా॥ వై. వేణుగోపాలరెడ్డిగారు, డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు గారు. యువభారతిపట్ల అత్యంతాభిమానాన్ని చూపిన ఈ ఉదారచరితులకు కవితాభిమానులకు మా కృతజ్ఞతాభివందనములు.

ఈ గ్రంథమునకు విజ్ఞానదాయకమైన పీఠిక సంతరించిన కవిపరిశోధక వతంసులు శ్రీ గడియారం రామకృష్ణశర్మగారికి మా కృతజ్ఞతాభివందనములు.

ఈ ప్రచురణకు రెండు వేల రూపాయలు ఆర్థిక సహాయాన్నిచ్చిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికి, ప్రకటన రూపంగా రెండు వేల రూపాయల ఆర్థిక సహాయాన్ని కల్పించిన ఆంధ్ర బాంక్ వారికి మా ధన్యవాదాలు.

ఈ గ్రంథాన్ని కొని చదివి ఇతోధిక ప్రాచుర్యాన్ని కలిగించి మాకు ప్రోత్సాహాన్ని అందిస్తారని సహజంగానే సాహిత్యాభిమానులైన తెలుగువారిని ప్రార్థిస్తున్నాం.

డిసెంబరు 19, 1976

హైదరాబాదు

ఇరివెంటి కృష్ణమూర్తి

అధ్యక్షుడు, యువభారతి.



# రామాయణ సుధాలహరి

## ఉపన్యాస మంజరి కార్యక్రమాల వివరణ

సభాస్థలి :- ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనాలు
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001

సమయం : సాయంకాలము గం॥ 5-30 ని॥లు

**మొదటి సమావేశం** 7-11-1976 **ఆదివారం**

*విషయం* : వాల్మీకిరామాయణం

*ఉపన్యాసకులు* : ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు

*విషయం* : అధ్యాత్మ రామాయణం

*ఉపన్యాసకులు* : డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తిగారు

*అధ్యక్షులు* : శ్రీ దేవులపల్లి రామానుజరావు గారు

*ముఖ్య అతిథులు* : శ్రీ యడవల్లి శివరామశాస్త్రిగారు, హైకోర్టు న్యాయవాదులు

రెండవ సమావేశం 21-11-1976 **ఆదివారం**

*విషయం* : తమిళ, మలయాళ రామాయణాలు

*ఉపన్యాసకులు* : డా॥ చల్లా రాధాకృష్ణశర్మగారు

*విషయం* : కన్నడ రామాయణాలు

*ఉపన్యాసకులు* : డా॥ బాడాల రామయ్యగారు

అధ్యక్షులు : ఆచార్య సి. నారాయణరెడ్డిగారు

ముఖ్య అతిథులు : "పగలే వెన్నెల", "శతక సౌరభం", "నన్నెచోడుని కవితావైభవం" ఆవిష్కర్తలు :
శ్రీ న్యాయమూర్తి బి. పి. జీవన్ రెడ్డి గారు, ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తులు

మూడవ సమావేశం 5-12-1976 ఆదివారం

విషయం : హిందీ రామాయణాలు

ఉపన్యాసకులు : శ్రీ వారణాసి రామమూర్తి 'రేణు' గారు

విషయం : రామాయణ కల్పవృక్షం

ఉపన్యాసకులు : డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు

అధ్యక్షులు : డా॥ వై. వేణుగోపాల రెడ్డిగారు, ఐ. ఏ. ఎస్.
హైదరాబాదు జిల్లా కలెక్టరు

ముఖ్య అతిథులు : శ్రీ న్యాయమూర్తి కొండా మాధవరెడ్డిగారు, ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తులు

నాలుగవ సమావేశం 19-12-1976 ఆదివారం

విషయం : జానపద రామాయణాలు

ఉపన్యాసకులు : ఆచార్య బి. రామరాజుగారు

విషయం : తెలుగు రామాయణాలు

ఉపన్యాసకులు : 'కరుణశ్రీ' శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు

అధ్యక్షులు : డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు, రీడరు, సంస్కృతశాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయము

ముఖ్య అతిథులు : "సూరదాసు కవితావైభవం" "కాళిదాస కవితావైభవం"
ఆవిష్కర్తలు: శ్రీ ఇ. వి. రాంరెడ్డిగారు, ఐ. ఏ. ఎస్.

'రామాయణ సుధాలహరి' ఆవిష్కర్తలు: శ్రీ గొల్లపూడి వేంకటరామశాస్త్రిగారు



# రామాయణ సుధాలహరి

## అనుక్రమణిక

# —: మున్నుడి :—

## రామాయణప్రాశస్త్యము

"వేదవేద్యే పరేపుంసి-జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసాదాసీత్-సాక్షాత్ రామాయణాత్మనా ॥

(వేదములచే తెలియబడు పరమపురుషుడు దాశరథియై అవతరింపగా వేదము వాల్మీకి మహర్షినుండి రామాయణరూపమున అవతరించినది) ఇది భారతీయుల పరమవిశ్వాసము. మనము రామాయణమును వేదసంహితవలె మన్నించి భక్తి శ్రద్ధలతో పారాయణముచేసి చరితార్థులమగుచున్నాము.

వేదములు పూర్వోత్తరలని రెండు భాగములు. పూర్వభాగములు సంహితా బ్రాహ్మణములు. ఉత్తరభాగములు ఆరణ్యక-ఉపనిషత్తులు. మొదటిదానిలో కర్మమార్గము, రెండవభాగమున జ్ఞానమార్గము బోధింపబడినది. కర్మమార్గము బ్రహ్మచారి-గృహస్థ-వానప్రస్థులకును, జ్ఞానమార్గము విరక్తులకును ఉపదేశింప బడును. భక్తిఉపాసనలు కర్మమార్గములోనివే. కావున రామాయణమునందు భక్తిసంవలితమైన కర్మమార్గము చెప్పబడినది. అందువలన దీనిని సంహిత అనుచున్నారు.

చతుర్విధ పురుషార్థములను బోధించునది ఇతిహాసము. కావున ఇది ఇతి హాస మగుచున్నది.

"ధర్మార్థకామమోక్షాణాం ఉపదేశసమన్వితం ।
పూర్వవృత్తం కథాయుక్తం ఇతిహాసం ప్రచక్షతే ॥

సరసములు, లోకోత్తరములు అయిన అర్థములను వర్ణించునది మహా కావ్యము. కావున రామాయణము భారతీయులకు వేదసంహిత - ఇతిహాసము- మహాకావ్యము అయిఉన్నది.

వాల్మీకిమహర్షి ఈ గ్రంథమును మూడు విధములుగా వ్యవహరింపవచ్చు నని చెప్పినాడు.

"కావ్యం రామాయణం కృత్స్నం-సీతాయాశ్చరితతం మహత్ ।
పౌలస్త్యవధ మిత్యేవ-చకార చరితవ్రతః ॥

లోకోత్తరుడైన శ్రీరాముని ఆదర్శచరిత్రను చెప్పుచున్నందున 'రామాయణము' సకల స్త్రీ లోకమునకు సౌశీల్యచారిత్రములచే ఆదర్శభూత అయిన సీతాదేవి పవిత్రచరిత్రను వర్ణించినందున 'సీతాచరితము' లోకకంటకుడై అధర్మవర్తను

డైన రావణునికథను చెప్పుటవలన 'పౌలస్త్యవధ' అనబడును. ఇట్టి రామాయణము భారతజాతికి శిరోధార్యము. ఇందు భారతీయుల ఔన్నత్యము, వారి జీవితాదర్శములు, వారి సభ్యతా సంస్కృతులు ఉదాత్తముగ వర్ణింపబడినవి.

## రామాయణ ప్రాచీనతా ప్రచారములు

రామాయణకథ ఋగ్వేదమునందే సూచింపబడినదని కొందరు విద్వాంసుల అభిప్రాయము. (X-3-3) ఇక్ష్వాకు-రామ-దశరథశబ్దములు ఋగ్వేదమున కానవచ్చుచున్నవి. (X-60-1) (X-93-41) మహాభారత వనపర్వము, బౌద్ధజాతక కథలు, జైనపురాణములు, రామతాపినీ ఉపనిషత్తు, బ్రహ్మాండపురాణమందలి అధ్యాత్మరామాయణము, పద్మపురాణము, శ్రీ భాగవతము, విశ్వామిత్రకృతరామాయణము, ఆనందరామాయణము, శతకంఠరామాయణము, జావాద్వీపములో ప్రచారమందున్న రామోపాఖ్యానము మొదలైన గ్రంథాలలో 'రామకథ' అనేకవిధాలుగా కానవచ్చుచున్నది. ఈ అన్నిటికిని వాల్మీకి రామాయణమే మూలమని, ఆదికావ్యమని ప్రసిద్ధినందినది.

పాణిని వ్యాకరణమున కోసల-కౌసల్యా-కేకయ-కైకేయి-వైశ్రవణ-రావణ-విభీషణ-వాల్మీకి శబ్దములకు వ్యుత్పత్తులు చెప్పబడినవి. బౌద్ధుల దశరథజాతకము, సామజాతకము, వెస్సంతరజాతకము, సంబులజాతకము, లంకావతారసూత్రములలో రామాయణకథ కానవచ్చుచున్నది. క్రీ.శ. ప్రథమశతాబ్దిలో జైనకవియగు విమలసూరి రామకథగల 'ప-ఉమ-చరి అ' (పద్మచరిత)ను వ్రాసెను. ఇంకను పలువురు జైనకవులు స్వయంభుదేవ, జినసేన, పుష్పదంతాదులును రామకథను వర్ణించినారు. భాసకాళిదాస భవభూతుల కాలమునకే ఈ కథ చాలప్రసిద్ధి ప్రచారములను పొందియుండెను.

బౌద్ధుల అవదానకథలోని రామకథను క్రీ.శ. 472 లో చీనాభాషలోనికి పరివర్తనము చేయబడినది. భారతారణ్యపర్వమందలి రామోపాఖ్యానము క్రీ.శ. 700లో టిబెటుభాషకు పరివర్తనమందినది. 6 శతాబ్దినాటి ఒక కాంబోడియా శాసనమున ఒకరాజు రామాయణ మహాభారతముల పారాయణములకై చక్కని ఏర్పాట్లు చేసినట్లు చెప్పబడినది. 7 శతాబ్దిలోని చంపదేశపురాజు ప్రకాశధర్ముడు వాల్మీకి విగ్రహమును ప్రతిష్ఠించెను. అంకోర్ వాట్-ప్రాంబణము దేవాలయప్రాకారములమీద రామాయణగాథాశిల్పము చెక్కబడినది.

ఈ విధముగ రామకథ, భారతీయవైదిక ధర్మానుయాయులకేకాక జైన బౌద్ధాదినాస్తికులకును, విదేశీయులకును ఆదరణీయమైనది. రామాయణప్రశస్తి క్రీస్తు శకారంభమునకుముందే జావా, సుమిత్రా, కాంబోడియా, లావోస్, వియత్నాం, మలేషియా మొదలైన సుదూరదేశములలో వ్యాపించెనని చరిత్రకారులు [illegible]

మూల రామాయణమున తరువాతి కాలములో అనేక ప్రక్షిప్తములు చేరి నట్లు తిలక, గోవిందరాజ, మహేశ్వర,వరదరాజాది వ్యాఖ్యాకారులు తెలిపినారు.

## రామాయణరచనోద్దేశము

ఈ మహాకావ్యమును వాల్మీకిమహర్షి నారద-చతుర్ముఖులచే ప్రోత్సహింపబడి రచించినట్లు కావ్యారంభమున చెప్పబడినది. ఈ భాగము ప్రక్షిప్తమని కొందరు విద్వాంసుల అభిప్రాయము. అయినను ఆగ్రంథమునందలి ఉపక్రమ-పరామర్శ-ఉపసంహారముల నాధారముచేసికొని కావ్యరచనోద్దేశమును తెలిపినారు.

"శ్రీరాముడు పరిపూర్ణమానవుడుగ ప్రవర్తించి ఎన్నికష్టములు వచ్చినను స్వధర్మమును వదలక, ధర్మపథము ననుసరించి లోకమునకు ధర్మమహత్త్వమును చాటినాడు." ఇదే రామాయణరచనోద్దేశమని వివరించినారు. ఇందు ప్రతిపాదింపబడిన ధర్మము వేదవిహితమైన కర్మాచరణరూపమైనదిది. మానవునిశ్రేయస్సుకొరకు వేదమున ప్రవృత్తి (కర్మ) మార్గము, నివృత్తి (జ్ఞాన) మార్గము చెప్పబడినది. శ్రీరాముడు కర్మయోగి కావున స్వయముగ తాను కర్మలనాచరించెను. ఆ కర్మల నాచరించు మహర్షులను రక్షించుటకై కర్మవిరోధులగు రాక్షసులను సంహరించెను పట్టాభిషిక్తుడై లోకకల్యాణకరములైన వివిధ యజ్ఞములు నాచరించెను. ఇందువలన రామాయణములో వేదోక్త కర్మాచరణరూపధర్మమే ప్రతిపాదింపబడినదని చెప్పవచ్చును. ముఖ్యముగ గృహస్థాశ్రమమున ఆచరింపవలసిన సంధ్యోపాసనాదులు, ఉత్తమగతులకై అనుష్ఠింపదగిన 'సత్య-ధర్మ-పరాక్రమ-భూతదయా-ప్రియభాషణ, ద్విజ-దేవ-అతిథి పూజలు' వివరింపబడినవి.

"సత్యంచ ధర్మంచ పరాక్రమంచ-భూతానుకంపాం ప్రియవాదితాంచ,
ద్విజాతిదేవాతిథిపూజనంచ-పంథానమాహుః త్రిదివస్యసంతః ॥

మానవులను ధర్మానుష్ఠానమువైపు మరల్చుటయే మహర్షి ముఖ్యోద్దేశము. ఈ కర్మమార్గము జయప్రదమగుటకు సత్యపాలనము చాల అవసరము. కావున శ్రీరాముడు తన జీవితమును సత్యధర్మములకు అంకితముచేసి లోకమునకు చాటినాడు. సత్యధర్మాభిరక్తులకు మృత్యుభయము ఉండదని రామాయణము ఘోషించుచున్నది.

"సత్యధర్మాభిరక్తానాం-నాస్తిమృత్యుకృతంభయం"

భారతభూమి కర్మభూమిగా, యజ్ఞభూమిగ పేరుగాంచినది. యజ్ఞభావన భారతీయ మహర్షుల ఉదారమానసిక స్థితికి, లోకకల్యాణకాంక్షకు ప్రతీకము. యజ్ఞశబ్దము దేవపూజ, హోమకర్మ, అనుఅర్థములలో ప్రయోగింప

బడుచున్నది. ఈ యజ్ఞమునుండియే సమస్తము ఉత్పన్నమైనట్లు వేదములలో చెప్పబడినది. భగవద్గీత అనేక యజ్ఞములను చెప్పినది. అన్ని యజ్ఞములకును త్యాగమే మూలము. త్యాగమువలననే సమాజము వికసించును.

యజ్ఞాది కర్మరహితులైన విదేశీయులు కొన్ని శతాబ్దులు భరతభూమిని పాలించినందువలన భారత జాతి యజ్ఞదూరమై పతనము చెందినది. ఇహపర సాధనమైన యజ్ఞభావనకే దూరమైనది. రామాయణమున యజ్ఞ, కర్మలు కల్యాణకారులని వర్ణింపబడినవి.

వాల్మీకి మహర్షి ఈ మహాగ్రంథమున భారతీయ జన సమాజమును, వారిమహోన్నత సామాజిక, ధార్మిక, రాజనైతిక ఆదర్శములను వివరించి ధర్మార్థకామ సంయుక్తమైన వారి జీవనవిధానమును, దాని వైశిష్ట్యమును తెలిపినాడు. అట్లే ధర్మరహితములైన అర్థకామములనే సేవించు రాక్షస సమాజము యొక్క కుత్సితస్వరూపమును, దాని అగ్రాహ్యత్వమును చిత్రించి మానవులను ధర్మబద్ధము, మంగళమయము అయిన జీవనవిధానము వైపు మరల్చుటకు ప్రయత్నించినాడు. ధర్మపాలనమున అర్థకామప్రాప్తి కలుగునని, కేవల అర్థ కామముల నాశ్రయించువారు సమూలమున నశింతురని చాటినాడు.

"ధర్మా దర్థః ప్రభవతి। ధర్మాత్ ప్రభవతే సుఖం।
ధర్మేణ లభతే సర్వం। ధర్మసార మిదం జగత్॥

మానవజీవిత మహత్వమును బోధించుటతో బాటు దాని క్షణభంగురత్వమును గూడ చాటినాడు. కావున ఇది భారత జాతిసర్వస్వ మనదగియున్నది.

## రామాయణ సందేశము

రామాయణ రచనా కాలము ఏదైనను ఆ గ్రంథ ప్రభావము జన జీవనమునందు ఇంకను కానవచ్చుచున్నది. ఇందలి వస్తువు అత్యంత ప్రాచీనములైన ఉపాఖ్యానములు- అందువలన ఈ కథలు భారతఖండమున వివిధ భాగములలో ప్రసరింపబడినట్లెల్ల నూతనాంశములు చేర్చబడినవి. అయినప్పటికిని మూల గ్రంథకర్తయగు వాల్మీకి మహర్షి ఉద్దేశమునకు విరుద్ధములు కావు. మొత్తము మీద భారతీయ సంస్కృతిని రక్షించినవాడు వాల్మీకి మహర్షి అనుట నిర్వివాదము.

ధర్మము మహత్తరమైనది. దానిని అనుష్ఠించి తమలోని సర్వశక్తులను వికసింప జేసికొని ఇహపర సుఖములను అందవలెనని మానవజాతికి రామాయణము దివ్యసందేశము నొసగుచున్నది. ''యతోభ్యుదయ నిశ్శ్రేయససిద్ధిః స ధర్మః'' ఇహలోకమున అభ్యుదయము, పరలోకమున నిశ్శ్రేయసము

రెండును దేనివలన ప్రాప్తమగునో అది ధర్మము అనబడును. మొత్తము మీద మానవులు సుఖముగ జీవించుటకు ఏర్పరచుకొన్న నియమములను ధర్మమనుట ఉచితము.

స్వామి వివేకానందులు ధర్మము అనగా జీవన విధానము అన్నారు. ప్రతి దేశమునకు, ప్రతిజాతికి ఒక జీవన విధానము ఉండును. దేవుడు లేడను దేశములు ఉండవచ్చును. కాని నియమ నిబంధనలు లేని దేశములుండవు. ప్రపంచమును నడిపించునది ధర్మమే. ఈ ధర్మవైభవమును లోకమునకు చాటుటకై రామాయణం అవతరించినది. అది సత్యధర్మములను అనుష్ఠించి మానవుడు దివ్యుడు కావలెనని ప్రబోధించినది.

## రామకథ పరిణామము

వాల్మీకి మహర్షి రామాయణమును రచించుటకు పూర్వమే రామకథ ప్రచారములో ఉండెను. దానిని లౌకిక చ్ఛందస్సులో ఆ మహర్షి వ్రాసెనని కొందరి అభిప్రాయము. ఏది ఏమైనను మహర్షి శ్రీరామచంద్రుని భగవదవతారముగ తన కావ్యమున నిరూపించుటకు యత్నింపలేదు. ఆయన లోకోత్తరుడైన ఉదాత్తనాయకుని చరిత్రను వ్రాసెను. ఆ మహర్షి రామునిలో పలుమార్లు దర్శించినది మూర్తీభవించిన ధర్మమునే."రామో విగ్రహవాన్ ధర్మః", లోకములోని ఉత్కృష్ట గుణములన్నియు రామునిలో ఉన్నందున అతడు ప్రజలకు దైవమై ఆరాధ్యుడైనాడు.

జైనులు-బౌద్ధులు దర్శించిన రాముడు భగవదవతారము కాడు. తమ సంప్రదాయముల ప్రకారము ఉన్నత స్థితిని చేరుకున్న పుణ్యపురుషుడు. వైదికులు శ్రీరాముని విష్ణునవతారముగ భావించిరి. అందువలన వారికి రాముడు, కృష్ణుడు, విష్ణువు ఒక్కరే. అందువలననే భరతభూమిలో రామునకు ఆలయములు, పూజలు వెలసినవి.

ఈ విధముగ ప్రజల విశ్వాసము పరిణమించిన తరువాతనే ప్రాంతీయ భాషలో రామాయణములు వెలువడినవి. మహాభక్తులైన తులసీదాసు హిందీభాషలోను, కంబరు తమిళ భాషలోను రామాయణములు రచించి శ్రీరాముని మహావిష్ణువుగా, పరబ్రహ్మ స్వరూపునిగా నిరూపించినారు. ఈ దృష్టితోనే ఇతర భాషారామాయణములు రచింపబడినవి. మానవమనః పీఠములలో భగవంతుడుగా అధిష్ఠించిన శ్రీరాముని కీర్తించినవి.

మానవులు, రామచంద్రుని భగవదవతారముగా నమ్మినను అతడు అట్టి భావము లేనివాడు. తాను అవతారమను విషయము తెలియనివాడు, అందువలననే శ్రీరాముడు సామాన్యమానవులవలెనే ఆయాసమయములందు సుఖమును దుఃఖ

మును, దైన్యమును, మనోదౌర్బల్యమును పొందినాడు. అట్టే తాను తెలిసికొన్న ధర్మమును తన జీవితములో అనుష్ఠించి లోకమునకు ఆదర్శమూర్తి అయి నాడు. ఈ సమ్యక్‌దృష్టి లేనిచో రామాయణము సరిగా బోధపడదు.

## పాశ్చాత్యవిద్వాంసుల సమ్యక్ దృష్టి

సంస్కృత వాఙ్మయ మహాసాగరమును మథించిన పాశ్చాత్యవిద్వాంసులు రామాయణమహాకావ్యమును కూలంకషముగ పరిశీలించి వేనోళ్ళ ప్రశంసించి నారు. వానిని గమనించుట అవసరము.

### (1) సర్ మోనియర్ విలియమ్స్

"గ్రీకుల ఇతిహాసకావ్యములైన 'ఇలియడ్-ఒడిస్సే' లకును, హిందువుల రామాయణ మహాభారతములకును పోలికలే లేవు. బ్రహ్మాండమైన హిమాలయములోపుట్టి అనంతవాహినులతో పెల్లుబ్బి విస్తరించిన గంగాసింధూమహాస్రవంతులను,ధెసిలీ కొండవాగులతో పోల్చిన ఎంత హాస్యాస్పదముగ ఉండునో, రామాయణమహాభారతములతో ఇలియడ్ ఓడిస్సేలను పోల్చుట అట్లే ఉండును. రామాయణమువంటి మనోజ్ఞకావ్యము ప్రపంచసాహిత్యమున కానరాదు. ప్రాచీన ప్రమాణగ్రంథములలోఉండు పరిశుద్ధ-స్పష్ట-సరళశైలి, గంభీర ప్రకృతిదృశ్యములవర్ణన, మానవహృదయములలోని పరస్పరఘర్షణ, ఆవేదనమును తెలుపు సుకుమారభావ ప్రకటనము మొదలైన సుగుణము లిందు పుష్కలముగా ఉన్నవి. ఈకావ్య మొక ఆనందవనమువంటిది. శ్రీరాముని శీలము ఘనముగా చిత్రింపబడినది. అతడు మొదటినుండి చివరివరకు ఒకేవిధముగా స్వార్థరహితుడుగా ఉన్నందున మానవమాత్రుడు కాడనిపించును. కాని ఆయన కేవలము ధీరుడు, ఉదారచిత్తుడు, సద్గుణుడు అయిన మానవమాత్రుడుగనే చిత్రింపబడినాడు.

ఆదర్శప్రాయలగు నారీమణులలో సీత ఉత్తమరాలు—ఆమె గృహిణీ ధర్మజ్ఞులకు వేలుబంతి. ఇందు వర్ణింపబడిన సిర్వ్యాజపతిభక్తి, పవిత్రప్రణయము, భార్యాభర్తలకు శాశ్వతమైన ఈశ్వరోద్దిష్టసంబంధమున్నట్లు భావించుట అను ఉదాత్త గంభీరాదర్శములవంటివి ఏ ఇతరభాషాసాహిత్యములలోను కానరావు. సంస్కృత సారస్వములోని మహానిక్షేపములలో రామాయణము ఒకటి అనుటలో సందేహములేదు." (Indian Epic Poetry)

### (2) ప్రొఫెసర్ గ్రిఫిత్ :

"ఏ యుగముగాని, ఏ దేశమునగాని, సీతారాములవంటి పరిపూర్ణ పాత్రలను పోషించిన పద్యకావ్యము రామాయణము తప్ప, మరొకటి పుట్టబోదని ఘంటాఘోషముగ చెప్పవచ్చును. పవిత్రకావ్యమైన ఈ కావ్యమునందు తప్ప

ఇంతెచ్చటను కవితయు నీతియు ఇట్లు మనోహరముగ సమ్మేళనమునొంది పరస్పరము ప్రకాశింపజేసికొనుట కాంచలేము" (Asiatic Researches)

(3) విలియమ్ జోన్సు :

"రామాయణములో చిత్రింపబడిన సాంకేతిక, సాంఘిక సౌఖ్యములకంటె సుందరములైనవి ఉండవు. ఇందు ముఖ్యముగ రెండు విషయములు గమనింపదగియున్నవి. కుటుంబజీవనములో పరస్పర ప్రేమానురాగములను వర్ణించుట, ఎల్లచోట్ల-ఎల్లవేళలు మానవప్రకృతికి సహజములైన ఆవేదనా సంవేదనములను ప్రకటించుట ఇంత మనోజ్ఞముగ మరెందును చిత్రింపబడలేదు."

(Asiatic Researches)

(4) వింటర్ నిట్జ్ :

"రామాయణము మహాభారతమువలె ప్రసిద్ధి నొందిన మహాకావ్యము. ఇది సకలభారత జాతి సర్వస్వము. శతాబ్దాలుగా జాతివిచారధారను, కావ్యప్రపంచమును ఇంతగా ప్రభావిత మొనర్చిన మరొకకావ్యము ప్రపంచ సాహిత్యములలో కానరాదు. రెండువేల సంవత్సరాలకు ఇంకను పూర్వమునుండియే ఈ కావ్యము భారతదేశమునందు సజీవముగ నున్నది."

(A History of Indian Literature)

(5) మిస్ మేరీ స్కాట్ :

"రామాయణమున కవితారసము నిండియున్నది. నేను చదివిన నారీమణుల చరిత్రలలో మిగుల ఉదాత్తమధురమైనట్టిది సీతాదేవిచరితము."

(Letter to P. C. Roy)

ఈ విధముగ రామాయణమహాకావ్యమును సంస్కృత సాహిత్యకోవిదులైన పాశ్చాత్యపండితులు ప్రశంసించిరి.

**మనవారి వక్రదృష్టి**

సంస్కృతభాషలో కించిత్ ప్రవేశము, భారతీయసంప్రదాయములలో కొద్దిపాటి పరిచయము, స్వాభిమానము లేని కొందరు చరిత్రపరిశోధకులు, కొందరు రచయితలు రచయిత్రులు రామాయణమహాకావ్యమునుగూర్చి ఇష్టము వచ్చినట్లు వ్యాసములను. పుస్తకాలను వ్రాసి ప్రకటించుచున్నారు. వీరు మన ప్రజల మనస్తత్వములను బాగుగా అవగతము చేసికొని బ్రతుకనేర్చినవారు.

ఒక భారతదేశమునతప్ప మరే దేశమునందును ప్రజలు మాన్యములుగ భావించు మతగ్రంథములను, మహాపురుషులను, ఆరాధ్యదేవతలను, పవిత్ర విశ్వాసములను ఎవరేని అవహేళన చేసినచో సహింపరు. తక్షణమే ప్రతీకారము చేసెదరు. కాని మనము కొన్ని శతాబ్దాలుగా విమతీయ, విదేశీయ పాలనచే నిర్వీర్యులమై, నిరభిమానులమై నికృష్టజీవనమునకు అలవాటు పడినాము. తమ

పవిత్రవిషయములను కించపరచుట విశాలదృక్పథముగ భావించి ఆత్మవంచన చేసుకొనుచున్నాము. ఇంతకంటె శోచనీయస్థితి ఉండదు. ఈ దుర్గతిని దూరము చేసికొనుటకు విశేషకృషి అవసరమైయున్నది.

**సముచిత చర్య**

భారతీయ సంస్కృతికి ఆకరము లనదగినవి రామాయణ మహాభారతాది మహాగ్రంథములే. పాశ్చాత్య భావదాస్యమున మ్రగ్గుచున్న ఆంగ్లమానసపుత్రు లగు సంస్కృతభాషానభిజ్ఞులు కొందరు వ్రాయుచున్నవ్రాతలచే పెడదారులు బట్టుచున్న యువతరమునకు మనమహోదాత్త సంస్కృతివైభవమును పరిచ యము చేయుటకై 'యువభారతి' అపూర్వ అసమానకృషి చేయుచున్నది. ఈ సంస్థ తన పదమూడవ వార్షికోత్సవ సందర్భమున 'రామాయణ సుధాలహరి' ఉపన్యాసమంజరీ కార్యక్రమాలను నిర్వహించినది. ఈ సంస్థకు రామాయణ ముపై ప్రగాఢాభిమానముకలదు. వారి దృష్టిలో "రామాయణము భారతీయులకు ఆదర్శకావ్యము. భారతీయ సంస్కృతికి ఆలవాలమైన కావ్యము. రామాయణ పరిచయము భారతీయాత్మతో పరిచయమే. ఎన్నిగాడ్పులు వీచినను, ఎంత విషమును చిలికినను, ఎన్ని ప్రహారము లొనర్చినను భారతీయుల హృదయ ములలో ఆ మహాకల్పతరువు నిశ్చలముగా, సజీవముగా, అక్షతముగా నిలిచి యుండును."

ఎవరు ఎన్నిరీతుల రామాయణమును వక్రముగా చిత్రించినను దానికి ప్రతిక్రియ ప్రతి విమర్శనము కాదు. ప్రతి దూషణము కాదు. అట్లని విజ్ఞులు మౌనము వహించుట గూడ మహాపచారము కాగలదు. సంయమముతో ఆ మహా గ్రంథ ప్రాశస్త్యమును బహువిధములుగా ప్రకటించుటయే దానికి సముచిత చికిత్స. అదృష్టితో ఈసారి 'యువభారతి' 'రామాయణ సుధాలహరి' పేరులో ఉద్దండపండితులచే 'వాల్మీకి రామాయణము, తమిళ కన్నడ రామాయణములు, తెలుగు రామాయణములు, హిందీ రామాయణములు, జానపదరామాయణములను గూర్చి విలువగల ఉపన్యాసములను ఇప్పించి ప్రకటించినది. ఇట్టిప్రశంసనీయ కార్యమును చేపట్టినందుకు యువభారతిని అభినందించుచున్నాను.

భారతీయ సంస్కృతి ప్రచారము ప్రభుత్వస్థాయిలో జరుపదగినట్టిది. దీనిని గుర్తించినమైసూరురాష్ట్ర మాజీముఖ్యమంత్రి శ్రీ కె. హనుమంతయ్యగారు తమ పరిపాలనాకాలమున సంస్కృతిప్రసార కార్యక్రమమును చేపట్టియుండిరి. ఆ మహోద్యమమును ప్రారంభించుచు వారుచేసిన ప్రసంగముగమనార్హమైనది.

"జనుల జీవనస్థాయిని పెంచుటకు అన్ని ప్రభుత్వములును సిద్ధమై తగు చర్యలు తీసికొనుచున్నవి. అయితే కేవలము జీవనసౌకర్యములు కల్పించువరకే ఆ కృషి ఉద్దేశింపబడుచున్నది. శరీరసుఖాభివృద్ధికి ప్రయత్నించుట మాత్రమే

చాలదు. జీవనమునందు జ్ఞానస్థాయిని, నైతికస్థాయిని పెంచుటకు యత్నించుట అంతకంటె ఉత్తమము. ప్రగతిసాధన కేవలం ఉదరపూరణకే పరిమితము కారాదు. అది సహజముకూడ కాదు. మానవుడు ఆత్మవికాసమునకు గమనము నొసగి సత్యముతో, ధర్మముతో నడచిననే మనుష్యజన్మకు సార్థకము. భారత భూమి ఆస్తికతకు, దైవభక్తికి నెలవు. సత్యధర్మముల అలంబనముతో జీవనము సాగిననే మానవునకు శ్రేయస్సు. ఉత్తమ గ్రంథములను చదువుట, చదివించి వినుట శ్రేయస్సునకు సాధకము. వాటి సందేశముల ననుసరించి నడచికొన్నచో జనజీవనమున నీతిధర్మములస్థాయి పెరిగి సుఖశాంతులు లభింపగలవు. రాష్ట్ర గౌరవము పెరుగగలదు. సంస్కృతి వృద్ధినందగలదు. సంస్కృతియే జీవన కుసుమమునకు సుగంధము.

అందువలన దేశములో నీతిస్థాయి, ధర్మశ్రద్ధ ఎక్కువగునట్లు చేయుటకు ఉదాత్తమైన ఉద్దేశముతో సంస్కృతి ప్రసారకార్యము చేపట్టవలె నని నాకు స్ఫురించినది. ఈ ప్రసారోద్దేశము పురాతనపద్ధతు లన్నిటిని పునరుజ్జీవింప చేయుటకాదు. ప్రాచీనపద్ధతులలో ఈ కాలమునను అన్వయింపనివి కొన్ని కలవు. చాలవిషయములు అనుసరణీయములు కలవు. ప్రాచీనపద్ధతులలోని ఉత్తమ విషయములను ఆధునిక కాలమునకు సమన్వయించుట, అన్నిమతములసారమును సమన్వయించి ప్రచారముచేసి సుమధుర వాతావరణమును కల్పించుట సంస్కృతి ప్రసార ప్రథానోద్దేశము.

రామాయణ మహాభారత భాగవతాది ప్రాచీనగ్రంథములు, శివశరణుల, హరిదాసుల కృతులు మొదలైనవి మన సంస్కృతికి ఆకారములుగ ఉన్నవి. మన ప్రజలకు వాటియందు ఆదరము కలిగినట్లెల్ల జనజీవనము ఉత్తమము కాగల దనుటలో సందేహములేదు. దీనికి అనుకూలముగ రామాయణ మహాభారతాది కావ్యపఠనములు, ప్రసంగములు, వానిని గూర్చిన ప్రచురణలు కొనసాగునట్లు ఏర్పరచుట మిగుల అవశ్యకము." అని శ్రీ కెంగల్ హనుమంతయ్య గారు 1954 లో చేసిన ప్రసంగము అన్ని ప్రభుత్వములును గమనింపదగియున్నది.

పరిమిత అవకాశములుగల 'యువభారతి' ఈ మహోన్నత సంస్కృతి ప్రసారోద్యమమును కొనసాగింప నడుముకట్టినది. మన ప్రభుత్వము ఈ సంస్థకు సంపూర్ణసహాయము చేసినచో ఇతోధికముగ కృషిజరుగగలదు. ఈ ఉపన్యాసలహరికి మున్నుడి వ్రాయ నవకాశము కలిగించిన మిత్రులకు ధన్య వాదములు తెలుపుకొనుచున్నాను.

అలంపూరు
1-12-76

గడియారం రామకృష్ణశర్మ

# వాల్మీకి రామాయణం
## — ఆచార్య దివాకర్ల వేంకటావధాని

భారతీయ సంస్కృతి వల్లరికి మూలకందములు వేదములు. వేదముల యందలి భాష అతి ప్రాచీనమైనదగుటచే సంస్కృత పండితులకు కూడ దానిని సమగ్రముగా నర్థము చేసికొనుట సాధ్యముకాని పని. ఈ విషయము తెలిసికొని మహర్షులు వేదనిక్షిప్తము లైన నీతి ధర్మ తత్త్వాదులను సర్వసుబోధములు కావించుటకై లౌకిక సంస్కృత భాషలో కథోపాఖ్యాన బహుళములైన గ్రంథము లను వ్రాయఁదొడఁగిరి. వేదార్థోపబృంహణమే వారి ప్రధానమైన ఉద్దేశము. అట్టి లౌకిక సంస్కృత భాషలో మొట్టమొదట కావ్యరచన సాగించిన వాఁడు వాల్మీకి మహర్షి. అందుచేతనే యతనికి నాదికవి యనియు, నతడు రచించిన శ్రీమద్రామా యణమున కాదికావ్య మనియు ప్రసిద్ధి కలిగినది.

వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షాద్రామాయణాత్మనా

పరమ పురుషుఁడైన శ్రీమన్నారాయణుఁడు దశరథాత్మజుఁడైన రాముఁడుగా నవతరింపగనే పరమాత్మ గుణవర్ణ నైక పరాయణమగు వేదము వాల్మీకి మహర్షినోట శ్రీమద్రామాయణము రూపముతో వెలువడెనని దీని యర్థము. నిజమునకు శ్రీరామావతారముతో మఱి రెండవతారములు గూడ లోకమును సంపన్న మొనరించినవని చెప్పవచ్చును. అం దొకటి వేదము రామాయణముగా నవతరించుట. రెండవ దంతకుముందు లేని లౌకికచ్ఛందో వివర్తముయొక్క యవతరణము. వాల్మీకి శ్రీరామచంద్రుని గుణగణములను వర్ణించినతీ రన న్యాదృశమైనది. అతని రామాయణమున నా మర్యాదా పురుషోత్తముని గుణ గణములు చదివి యాకర్షింపఁబడనివా రుండరు. అందుచేతనే మురారి యనర్ఘ రాఘవమున "యదిక్షుణ్ణం పూర్వై రితి జహతి రామస్య చరితమ్, గుణైరేతావద్భిః జగతిపున రన్యో జయతి కః" (రామునిచరిత మిదివఱకే పలువురిచే ప్రాచుర,

బడినదని దానిని విడుచుచో మఱి యట్టి గుణగణములతో శోభిల్లువారు లోకమున నింకెవ్వరున్నారు ?) అనియు, జయదేవుడు ప్రసన్న రాఘవ నాటకమున "స్వసూక్తీనాం పాత్రం రఘుతిలక మేకం కలయతాం కవీనాం కో దోషః సతు గుణగణానా మవగుణః" (శ్రీరామచంద్రు నొక్కనినే తమ కావ్య సూక్తులకు పాత్రునిగా నొనరింపఁదలఁచు కవులయం దెట్టి దోషమును లేదు ! అది శ్రీరామ చంద్రుని గుణగణముల దోషము) అనియు చెప్పియున్నారు. భోజుఁడు రామాయణ చంపువున వాల్మీకి వ్రాసిన శ్రీరాముని కథనే మఱల వ్రాయుదు నని తెలిపి "గంగను లోకమునకు తెచ్చినవాఁడు భగీరథుఁడు గదా ! అతని గంగా జలములతో మన పితృదేవతలకుకూడ తర్పణ మొసరించుటెట్లనిమానువారుందురా?' యని ప్రశ్నించినాఁడు. ఇట్లే సంస్కృతమునందు పలువు రితర కవులును ఆంధ్రాది దేశ భాషలయందలి కవులును శ్రీరామచంద్రుని గుణగణములను ప్రశంసించి తద్వైశిష్ట్యము నుగ్గడించి యున్నారు. కంకంటి పాపరా జుత్తర రామా యణమున "జానకీ జాని కథల్ వచింపక యసత్కథ లెన్ని రచించెనేనియున్ వాని వివేక మేమిటికి, వాని కవిత్వమహత్త్వ మేటికిన్" అనియు; కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు "మఱల నిదేల రామాయణం బన్నచో నీ ప్రపంచక మెల్ల నెల్లవేళ తినుచున్నయన్నమే తినుచున్న దెప్పుడు తన రుచి బ్రతుకులు తనవికాన" అనియు తాము మరల రామాయణమును చేపట్టుటకు కారణములు చెప్పియున్నారు.

వాల్మీకి రామాయణమునకు లోకమున ప్రశస్తి కల్గుట కది యవతార పురుషుఁ డగు శ్రీరాముని చరిత్ర మగుటయు, దాని నాదికవి రసభావ మనో హరముగా రచించుటయు మాత్రమే కాక మఱికొన్ని యితర కారణములుగూడ నున్నవి. పూర్వలాక్షణికులు కావ్యము యశోధనములు సమకూర్చు ననియు, వ్యవహారవేత్తృతను గల్గించు ననియు, నమంగళమును పరిహరించు ననియు, సద్యఃపరనిర్వృతి నాపాదించు ననియు, కాంతాసమ్మితత్వముచే సదుపదేశము నొసంగు ననియు తత్ప్రయోజనముల నుగ్గడించియున్నారు. ఇతర కావ్యములు వీనిలో కొన్ని ప్రయోజనములను మాత్రమే సమకూర్పఁజాలును. ఈ ప్రయోజన సామగ్ర్యమును సమకూర్పఁజాలునది శ్రీమద్రామాయణ మొక్కటే. యశోధన ముల మాట యట్లుండ నది యొదవించు వ్యవహారపరిజ్ఞాన మసాధారణమై యుండును. దానిని లెస్సగా పఠించి యవగాహనము చేసికొన్నవాఁడు సర్వ

వ్యవహారవేత్త యగు ననుటలో సందేహము లేదు. ఇప్పటికిని క్లేశామంగళ పరిహారమునకు భారతీయులు సామాన్యముగా శ్రీమద్రామాయణమును, విశేషముగా సుందరకాండమును, పారాయణము చేయుచుందు రనుట యెల్ల రెఱింగిన విషయమే. మహాకావ్యరత్నమైన యది విగళితవేద్యాంతరము, బహిఃప్రపంచ విస్మారకము నగు నానంద మొసఁగునని చెప్పుట చర్వితచర్వణ మగును. ఇంక నందలి ప్రతికాండమునందును, ఉపదేశరత్నముల సముజ్జ్వలకాంతులు వెల్లి విరియుచునే యుండును.

రామాయణము భారత జాతీయ కావ్యము. అందలి కథతోడను పాత్రల తోడను అంతో యింతో పరిచయములేని భారతీయు లెవ్వరు నుండరు. దాని కాంతు లొక్క భారతదేశముననే కాక ఖండాంతరములకుఁ గూడ వ్యాపించినవి. Winternitz అను పాశ్చాత్య పండితుఁడు "It is a true popular epic like the Mahabharatha and has become the wealth of the whole nation. Scarcely has any other poem in the range of whole literature influenced the poetry and the life of the people for centuries. It has been kept alive for more than twenty centuries and continues to live. People of all grades and classes, high and low, princes and peasants, merchants and artisans, princesses and shepherdesses-all are familiar with the characters and the story of the great epic" అని చెప్పియున్నాఁడు. అతఁడు చెప్పిన దానిలో నతిశయోక్తి యిసుమంతయు కానరాదు.

వాల్మీకి రామాయణమునందువలె భారతీయ గృహజీవిత మంత సమగ్ర సుందరముగా మఱియెక్కడను వర్ణింపఁబడియుండలేదు. తల్లి, తండ్రి, భర్త, భార్య, కుమారుడు, కూఁతురు, అన్న, తమ్ముఁడు, వదినె, మఱఁదలు, దాసి, యజమానుఁడు, సేవకుఁడు, మిత్రుఁడు, శత్రువు మున్నగువారు కుటుంబ జీవితమునకు సంబంధించినవారు. అందు భక్త భగవత్సంబంధము గూడ తఱచుగా కానవచ్చుచుండును. పైని పేర్కొనఁబడిన వారందఱును నొండొరులయెడ నెట్లు ప్రవర్తింపవలయునో రామాయణము చక్కఁగా విశదీకరించుచున్నది. భారతీయ సంస్కృతి కాధారమై, దానిని సర్వప్రశంసా పాత్రముగాఁ జేసిన కుటుంబ జీవిత

సౌష్ఠవమునకు రామాయణము దర్పణమువంటిది. రాముఁడు తండ్రియైన దశరథుని యెడను, తల్లుల యెడను-ముఖ్యముగా సవతితల్లియైన కైకయెడను, తమ్ములయెడను, భార్యయైన సీతయెడను, మిత్రుడైన సుగ్రీవుని యెడను, భక్తులైన గుహశబరీహనుమద్విభీషణాదుల యెడను, సహాయుఁడైన జటాయువు నెడను వర్తించిన విధ మాదర్శప్రాయమైన వగుటచే మన కెంతో యానందమును గల్గించును. అట్లే సీత భార్యగను, కోడలుగను, పతివ్రతగను, లక్ష్మణ భరతాదులు సోదరులుగను వర్తించిన విధము సర్వాదర్శప్రాయముగా నుండును.

మంత్రములలోని కెల్ల గాయత్రీమంత్రము శ్రేష్ఠమైన దనుటకు "న గాయత్ర్యాః పరంమంత్ర"మ్మనునది తార్కాణము. గాయత్రియనగా గాతను (జపించు వానిని) రక్షించునది యని యర్థము. ఈ మంత్రమున నిరువది నాలుగక్షరము లున్నవి. వాల్మీకిమహర్షి యిందలి యొక్కొక్క యక్షరమున కొక్కొక్క వేయి శ్లోకములుగా మొత్తము రామాయణమును 24 వేల శ్లోకములలో రచించె నని విజ్ఞులు చెప్పుదురు. పలువురు నిత్యపారాయణ మొనర్చు గాయత్రీ రామాయణమున నీయక్షరములు గల శ్లోకము లన్నియు నొక్కచో కూర్చఁబడినవి. "ఇదం రామాయణం కృత్స్నం గాయత్రీ బీజ సంయుతం, త్రిసంధ్యం యః పఠే న్నిత్యం సర్వపాపైః ప్రముచ్యతే'' అనునది అందలి తుది శ్లోకము. గాయత్రీ మంత్రమును మంత్రముగా జపించుసర్హత లేనివారు సైతము శ్రీమద్రామాయణమును చదివి తజ్జప ఫలితము నొందవచ్చును. ఇది కూడ శ్రీమద్రామాయణము యొక్క పవిత్రతా వైశిష్ట్యములకు కారణమైనది.

జితేంద్రియుఁడును, భక్తిమద్వరిష్ఠుఁడును, మహాబలసంపన్నుఁడు నైన హనుమంతునికి రామాయణమున చాల ప్రాధాన్యము గలదు. నిజమునకు సుందర కాండమంతయు నతని పరాక్రమమును వర్ణించునట్టిదే. శైవులు, వైష్ణవులు అను భేదము కాని, ద్వైతులు, విశిష్టాద్వైతులు అను భేదముకాని లేకుండ నెల్లరును హనుమంతుని పూజించుచుందురు. అందుచేతనే 'సుతరా మాద్రియతే ఇతి సుందరః' అని సుందర శబ్దమునకు వ్యుత్పత్తిని చెప్పి పండితులా సుందరుఁడు హనుమంతుఁడే యని వాకొనుచుందురు. హనుమత్ సహస్ర నామములలో "త్రిపాదూర్ధ్వగాయ నమః" అను నొకనామ మున్నది. ఈ నామము "త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః'' అను పురుషసూక్తమందలి వచనమునకు స్మారకమై హనుమంతుని పరమ పురుషత్వమును గూడ నిరూపించు

చున్నది. "సుందరే సుందరో రామః, సుందరే సుందరీకథా, సుందరే సుందరో మంత్రః, సుందరే సుందరః కపిః———సుందరే కిం న సుందర"మ్మను శ్లోకము సుందరకాండ యొక్క సర్వతోముఖ సౌందర్యమును వివరించుచున్నది. సర్వమతానుయాయులకు నత్యంతప్రియుఁడైన హనుమంతుని ప్రవేశము కూడ రామాయణమును సర్వజనాదరణీయ మొనర్చుచున్నది.

వైష్ణవ సంప్రదాయమున రామాయణమునకు దీర్ఘశరణాగతి యను ప్రశస్తియున్నది. దశరథుఁడు, కౌసల్య, లక్ష్మణుఁడు, భరతుఁడు, సీత, విశ్వామిత్రుఁడు, హనుమంతుఁడు, సుగ్రీవుఁడు, విభీషణుఁడు మున్నగు వారందఱును శ్రీరామునకు శరణాగతులైనట్టి వారే. ఈ విధముగా రామాయణము శరణాగత పరంపరా చరిత్రగా కన్పించును. శరణాగతులైన భక్తులు శ్రీమన్నారాయణావతారమైన శ్రీరాముని యనుగ్రహమున కెట్లు పాత్రులైరో యిందు వివరింపఁబడినది. ఈ విషయము నెఱింగిన పతితలు తాము కూడ ప్రపన్నులై పరమపురుషుని యనుగ్రహము నందుట కవకాశమున్నది. ఇదియు రామాయణ ప్రశస్తి ప్రచారములకు కొంతవఱకు కారణమైనది. అది రసప్రధాన మైన పట్టి కావ్యముగానే కాక మతగ్రంథముగా కూడ లోకమున వన్నెకెక్కినది.

రామాయణమునకు 'సీతాయాశ్చరితం, పౌలస్త్యవధమ్'అను మఱి రెండు పేర్లుకూడ గలవు. "కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్ పౌలస్త్యవధ మిత్యేవ చకార చరితవ్రతః" అనెడి శ్లోక మిందుకు తార్కాణము. ఏ కావ్యమునకైనను నాయికా నాయకుల నామములనుబట్టికాని, కథాగమనము నకు కేంద్రమని చెప్పదగిన సన్నివేశములు బట్టి కాని ఉపసంహృతియందు వర్ణితమైన యంశమునునట్టి కాని పేరు పెట్టవచ్చును. రామాయణము, సీతా చరిత మను పేరులు నాయికా నాయకులకు సంబంధించినవి. పౌలస్త్యవధ మ్మనునది రావణవధకు సంబంధించినది. పూర్వ రామాయణము రావణవధతో ముగియుచున్నది. అందుచే నాపే గుత్తర రామాయణమునఁగూడ రావణునిజీవిత విషయములు కొన్ని వర్ణింపఁబడియున్నను పూర్వ రామాయణమునకే యెక్కువగా నన్వయించును. రామాయణ సీతా చరితము లనునవి బూర్వోత్తర రామాయణము లకు రెండింటికి సంబంధించి యున్నవి.

వాల్మీకి రామాయణమున మొదట తాను రామాయణమును రచించిన పరి స్థితులు వివరించెను. అతడు తన్ను చూచుటకై తన యాశ్రమమున కరుదెంచిన

నారద మహామునిని "కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్" అని గుణవీర్యాది సర్వలక్షణ సంపన్నుఁడైన పురుషుఁ డెవ్వరైన నున్న తన కెఱిఁగింపు మని యడిగెను. నారదుఁ డట్టి గుణములు కలవాఁడు కౌసల్యా దశరథుల కుమారుఁడైన రాముఁడొక్కఁడేయని రామాయణకథ నెఱింగించి వెడలిపోయెను. తరువాత వాల్మీకి శిష్యుఁడైన భరద్వాజునితో గూడ స్నానార్థమై తమసానది కరిగెను. ఆ నదియందలి నీరు సత్పురుషుని హృదయమువలె ప్రసన్నమై యుండెను. స్నానము చేయుటకు పూర్వము వాల్మీకి పరిసరముల నున్న వన మంతయు పరికించుచుండ నతవి కొకచో మధురముగా కూయుచున్న క్రౌంచపక్షుల జంట కనిపించెను. ఆతఁ డట్లుచూచుచుండఁగనే పాపాత్ముఁడైన నిషాదుఁ డొకఁడా మిథునమునందలి మగపక్షిని బాణముతో కొట్టెను. వెంటనే ఆ పక్షి రక్తప్లుత శరీరమై నేలఁబడియెను. అది చూచి యాడుపిట్ట సకరుణముగా రోదించెను. ఆ రోదనము విని నంతనే ధర్మాత్ముఁడైన ముని కపరిమితమైన జాలి కలిగెను. వెంటనే యాతని నోట

మా నిషాద ! ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీస్సమాః
యత్క్రౌంచమిథునా దేక మవధీః కామమోహితమ్॥

అను మాటలు వెలువడెను. ఓ నిషాదుఁడా! క్రౌంచమిథునమునుండి కామ మోహితమైన మగపక్షిని వధించితివి కావున నీవు చిరకాలము ప్రతిష్ఠను పొంద కుందువు గాక! యని యా శ్లోకమున కర్థము. పైకీ యర్థ మొక్కటే గోచరించుచున్నను అం దింకను కొన్ని యంతరార్థము లున్నవి అవి రామాయణకథను దిఙ్మాత్రముగా సూచించును. మా నిషాద! లక్ష్మికి నివాసస్థానమైన ఓ విష్ణూ! నీవు మండోదరీ రావణు లను దంపతులనుండి కామమోహితుఁడైన రావణుని చంపితివి గాన నీవు పెక్కు సంవత్సరములు ప్రతిష్ఠ నొందగల వనునది యం దొక యర్థము. నిషాద శబ్దమునకు ప్రపంచస్థితికి భంగము కలిగించు నధర్మ మని యర్థము చెప్పుటకు వీలున్నది. ఓ యధర్మమా ! నీవు ఆదర్శప్రాయమైన జీవితమును బుచ్చు సీతారామ దంపతులలో నొకరిని హరించితివి కావున నీవు పెక్కు సంవత్సరములు స్థిరముగా నుండకుందువుగాక! అను నది మఱియొక యర్థము. ఈ రెండర్థములును కథాసంబద్ధములై కావ్యార్థమును చక్కగా సూచించుచున్నవి. రామాయణమునకు 'పాఠ్యే గేయేచ మధుర'మ్మను ప్రసిద్ధి యున్నది. ఇది గేయ మనుటకు కుశలవులు దీనిని రామునియెదుట గానము

చేయుటయే తార్కాణము. మా నిషాద శ్లోకమున సరిగమపదనిస యను స్వరములు గోచరించుచున్న వనియు, నందు మొదటి యక్షరములు క్రౌంచీనాదమునకు సంబంధించిన రాగమునందలి స్వరములను సూచించు ననియు సంగీత పండితులు చెప్పుదురు. వాల్మీకి వనమునందున్నవాఁడగుటచే ప్రతిదినమును వ్యాధ నిహతములగు పక్షి మృగాదులను చూచుచుండవచ్చును. కాని యీనాటి దృశ్యము కొంత విలక్షణమైనది. ఆ వ్యాధుఁడు పాపాత్ముఁడై కామమోహిత స్థితిలో నున్న మగ పక్షిని వధించెను. అది యధర్మము. ధర్మాత్ముఁడైన మునికది దుఃఖము కలిగించెను. "ఋషేర్ధర్మాత్మన స్తస్య కారుణ్యం సముపద్యత" అను శ్లోకమందలి ధర్మాత్మనః అను విశేషణ మీ యర్థమును సూచించుచున్నది. వాల్మీకి నిషాదుని శపించు నా వచనములు తన నోట నేల వెలువడిన వని చింతించుచు శిష్యుని చూచి పాదబద్ధము, అక్షరసమము, తంత్రీలయసమన్వితము నైన యీ వచనముల సముదాయము శ్లోక మగునే కాని వేఱు కాదని పలికెను. శిష్యుఁ డందుకు సమ్మతించెను. స్నానానంతర మాశ్రమమున కేగిన వాల్మీకికి బ్రహ్మ ప్రత్యక్షమయ్యెను. వాల్మీకి యతనికి నిషాదుడు క్రౌంచపక్షిని కొట్టుటయు, నది చూచి శోకార్తుఁడైన తన నోట నయత్నముగా నొకశ్లోక మరుదెంచుటయు నెఱింగించి యా శ్లోకము నతనికి వినిపించెను. బ్రహ్మ యది శ్లోకమే యని తెలిపి ధర్మాత్ముడైన రాముని చరిత్రమును నారదునివలన వినినట్లు కావ్యముగా రచింపు మని ప్రేరేచి తిరోహితుఁడయ్యెను. వాల్మీకి యట్టి శ్లోకములతో రామాయణకావ్యమును రచింప నారంభించెను.

రామాయణకథ సహజరమణీయము. దానిని కూర్చుటలో మహర్షి ప్రదర్శించిన కౌశలము నాన్యతోదర్శనీయమైనట్టిది. అది మొదటినుండి చివరివాఱకు ఉత్కంఠ రేకెత్తించు సన్నివేశములతోఁ గూడి పఠితల కవిచ్ఛిన్నమైన ఆనందమును చేకూర్చు చుండును. పుత్రకామేష్టి, పట్టాభిషేక భంగము, శ్రీరామ భరత సమాగమము, సీతాపహరణము, జటాయువు వధ, రామ సుగ్రీవుల మైత్రి, హనుమంతుని సముద్ర లంఘనము, అతడు సీతను దర్శించుట, సముద్ర బంధనము, రావణాది రాక్షస సంహారము మున్నగు సన్నివేశము లెన్నియో కార్యకారణ సంబంధముతో గూడి కథ కెంతో రామణీయకము నాపాదించు చున్నవి. రావణుని బాధలు పడలేక దేవతలు దీనులై విష్ణువు దర్శించుటతో నారంభించిన కథ రావణ వధతో ముగియుచుండుట ఆరంభోపసంహృతులకు గల నిబిడమైన

సంబంధమును చక్కగా సూచించుచున్నది. అరణ్యకాండమందలి సీతాపహరణ వృత్తాంతము కథకు కేంద్రమని చెప్పదగినట్టిది. అంతకుముందు జరిగిన సన్నివేశములన్నియు ఆ ప్రధానాంశమునకు దారితీయ అది తరువాత రావణవధ పర్యంతము జరిగిన ఇతివృత్తమునకు కారణమైనది ఈ విధముగా దీనిని కథలో గర్భసంధియని చెప్పవచ్చును. మహాభారతమున ద్రౌపదీ వస్త్రాపహరణమునకు వలె రామాయణమున సీతాపహరణమునకుఁ గల ప్రాధాన్య మింతింతనరానిది. ఆరెండు సన్నివేశములును ఆ రెండు కథలందలి మనోహరగమనమునకు తోడ్పడి యున్నవి కిష్కింధాకాండమందలి సుగ్రీవవృత్తాంతము రాముని కథలో కొంత వఱకు సామ్యమును వహించి పతాకాస్థానము నాక్రమించు చున్నది. శబరి, గుహుడు మున్నగువారి వృత్తాంతములు భక్తి ప్రధానములై ప్రకరీస్థానము నాక్రమించుచున్నవి. తాటక, జటాయివు, విరాధుడు, కబంధుడు మున్నగువారి వృత్తాంతములు కూడ మనోహరముగా వర్ణింపఁబడినవి.

రామాయణమున భారతమునం దున్నన్ని ఉపాఖ్యానములు లేవు. ఉన్నవన్నియు బాలకాండమునందే యున్నవి. విశ్వామిత్రుడు రామలక్ష్మణులను తనతో తీసికొని పోవునప్పుడు వారికి కొన్ని కథలు చెప్పియుండెను. అందు కుమారస్వామి వృత్తాంతమును, గంగావతరణ కథయు ముఖ్యములైనవి. రాముడు గంగావతరణ కథ చెప్పుమనఁగా విశ్వామిత్రుడు ముందదిచెప్పక దాని కుపోద్ఘాతముగా కుమారస్వామి కథ చెప్పి ఆ రెండింటికిని సన్నిహిత సంబంధమున్నదని తెలిపెను. ఈ విషయమునే కవిసమ్రాట్టులు శ్రీమద్రామాయణ కల్పవృక్షములో–"అడిగిన దేదొ చెప్పకువె యాయితరం బఖిలంబు చెప్పుమా యడుగుచు నట్లె వించుఁ బడియుందురు శ్రోతలు నిద్దియేసుమా గడుసరియౌ కథాకథన కౌశల"మని చమత్కారముగా చెప్పియున్నారు. తరువాత శతానందుడు రామునికి విశ్వామిత్రుని వృత్తాంతమంతయు విశదీకరించెను. రాజైన విశ్వామిత్రుడు బ్రహ్మర్షియైన వృత్తాంతము పరమాద్భుతముగా నుండును. మేనకను జూచి విశ్వామిత్రు డాకృష్టచిత్తుడైనను కొన్ని యేండ్లైన పిమ్మట మరల తన ప్రధాన లక్ష్యమును స్మరించి, తీవ్రతరమైన తపము చేయ నారంభించి, చివరకు కృతకృత్యుఁడయ్యెను సామాన్యులైన మానవులకును జితేంద్రియులైన మహర్షులకును గల భేద మిందు చక్కగా ప్రదర్శింపబడినది. మానవు లొకక్క-మాఱు కామ పరవశులైనచో మరల నా స్థితినుండి బయటపడుట మిక్కిలి యరుదు ఋషుల

విషయ మట్లుగాదు వార లొకప్పుడు స్ఖలనము సంభవించినను వెంటనే తెలిసి కొని, నిగ్రహము వహించి, లక్ష్యసిద్ధి నొందుదురు అహల్యా శాపవశమున ఱాయియైపడి యుండె నని లోకమున బహుళముగా ప్రచారమైయున్న గాథ. వాల్మీకి ఆమె ఱాయియైనట్లు చెప్పియుండలేదు. నిరాహారయు, వాయు భక్ష యునై యామె పెక్కేండ్లు తపస్సు కావించి, శ్రీరామదర్శనముచే శాపవిముక్తి కాంచెనని చెప్పియుండెను. అహల్యా శాప విమోచనము శ్రీరాముని భగవత్త్వము నిరూపించు సన్నివేశములలో నొకటి. వాల్మీకి మహర్షి రామాయణమందలి ప్రధానకథను, ఉపకథలను కూడ నెంతో రమణీయముగా కూర్చి యుండుట చేతనే రఘువరచరితము "తదుపగత సమాససన్ధియోగం సమమధురోపనతార్థ వాక్యబన్ధ"మ్మను ప్రసిద్ధిని గాంచినది

రామాయణము మహాకావ్యము. ఇందు కావ్యలక్షణము లన్నియు గోచ రించును. మహర్షి ఇందప్రముత్న ముగ పదునెనిమిదియే కాదు, అసంఖ్యను కూడ మించిన, వర్ణనము లెన్నో కావించి యుండెను. అతని వర్ణనములు తరువాతి సంస్కృత కవుల కందఱకును మార్గదర్శకములైనవి. అతడు కావ్యారంభమున అయోధ్యానగరమును సుందరకాండమున లంకానగరమును వర్ణించి యుండెను. లంకానగరము సౌందర్యమున అయోధ్యకెందును తీసిపోదు. మహర్షి మానవులయు, రాక్షసులయు, వానరులయు నాగరితా సంప్రదాయాదులను చక్కగా వర్ణించి యుండెను. అరణ్యకాండమున నదులను, ఆశ్రమములను, గిరి వృక్షములను, మృగపక్ష్యాదులను ఎంతో వివరముగా వర్ణించి యుండెను. కిష్కింధాకాండా రంభము నందలి శరదృతు పంపాసరోవర వర్ణనములు, వర్షర్తు వర్ణనము, సుందరకాండారంభము నందలి సముద్ర వర్ణనమును, యుద్ధకాండమునందలి వివిధములైన యుద్ధ వర్ణనములు అతని లోకజ్ఞతను పలువిధముల వ్యక్తము చేయుచుండును. హనుమంతుడు రావణాంతఃపురమును దర్శించునప్పటి స్త్రీల వర్ణన మాతని క్రాంతదర్శిత్వమునకు నిదర్శనము. ఏ దృశ్యమును వర్ణించినను అతడు దాని సమగ్ర దృశ్యమును చిత్రించి దానిని పఠితల యెదుట సాక్షాత్క రింపఁజేయుచుండును. సుందరకాండమున కనవచ్చు చంద్రోదయ వర్ణనము పరమాద్భుతముగా నుండును.

హంసో యథా రాజతః పంజరస్థః సింహో యథా మందరకంధరస్థః
వీరో యథా గర్వితకుంజరస్థః చంద్రో విబభ్రాజ తథాంబరస్థః

మున్నగు శ్లోకము లాతని భావనామహిమను, పరిశీలనపాటవమును ప్రదర్శించు చున్నవి. కిష్కింధా కాండారంభమున వాల్మీకి శ్రీరాముని వియోగమును పలు విధముల వర్ణించియుండెను.

సర్వంతు దుఃఖం మమ లక్ష్మణేదమ్ శాంతం శరీరే వనమేత్య శూన్యం
సీతావియోగాత్ పునరప్యుదీర్ణః కాష్ఠై రివాగ్నిః సహసా ప్రదీప్తః .

అయోధ్యను, తల్లిదండ్రులను విడిచి వచ్చినందువలన గలిగిన విచార మంతయు క్రమముగా సన్నగిల్లెను. కాని సీతావియోగముచే కాష్ఠప్రదీప్తమైన వహ్నివలె నది మరల నుద్దీప్తమైనదని దీని భావము. పంపా సరోవరము నందలి పద్మములు, పక్షుల కూతలు నీటి తరగలు, ఇవి యవి యననేల, యన్నియు నాతని వియోగవేదనను పెంపొందించెను.

స్వనంతి పాదపాశ్చ్యేయే మమానంగ ప్రదీపనా
అశోక స్తబకాంగార షట్పదస్స్వన నిస్వనః
మాం హి పల్లవతామ్రార్చిః వసంతాగ్నిః ప్రధక్ష్యతి॥

పాదములు గాలిచే కదలునప్పుడు కలుగు ధ్వనియు. వానియందు వ్రాలిన పక్షుల కూజితములును, అతనికి మదన వేదనా దీపకము లయ్యెను. అశోక స్తబకము లనెడి అగ్నికణములు కలదియు, పల్లవము లనెడి జ్వాలలు గల దియు, తుమ్మెదరొద లనెడి జ్వాలారవము గలదియు, నగు వసంత మనెడి యగ్ని అతనిని దహింప మొదలిడెను. ఇందలి రూపకాలంకారము సర్వాంగ శోభితమై రాముని విరహాగ్ని వేదనను లెస్సగా వ్యక్తము చేయుచున్నది.

దర్శయంతి శరన్నద్యః పులినాని శనైశ్శనైః
నవ సంగమ సంవ్రీడా జఘనానీవ యోషితః

శరత్కాలమందలి నదులు నవసంగమలజ్జిత లైన యువతుల జఘన భాగముల వలె పులినములను మెల్లమెల్లగా ప్రదర్శించుచున్న వని దీని యర్థము. ఇందలి యుపమానము పరమ రమణీయమై మహర్షి ప్రకృతి పరిశీలనమును పట్టి చూపు చున్నది.

చంచత్ చంద్ర కరస్పర్శ హర్షోన్మీలిత తారకా
అహో! రాగవతి సంధ్యా జహాతి స్వయమంబరమ్.

ఇందలి కరతారకాంబర శబ్దము లించుక శ్లిష్టము లైయున్నవి. ప్రకాశించు చంద్రుని (నాయకుని) కిరణముల (కరముల) స్పర్శచేఁ గలిగిన సంతోషమువలన

వికసించిన నక్షత్రములు (కనుగ్రుడ్లు) గల సంధ్య (నాయిక) స్వయముగా నాకసమును (వస్త్రమును) విడుచుచున్నదని ఇందలి భావము. మహర్షి ఇందు ప్రదర్శించిన భావనాశక్తియు, అలంకార రామణీయకమును, పరిశీలనా పాటవమును వర్ణనాతీతములుగా నున్నవి. హనుమంతుడు రావణాంతఃపురమున పతివ్రతయైన మండోదరిని చూచినప్పుడామె ముఖకాంతిని కాంచి సీతయే యని యించుకసేపు భ్రాంతివహించెను. అప్పుడు కలిగిన సంతోషమున హనుమంతుడు చేసిన చేష్టలను మహర్షి —

ఆస్ఫోటయామాస చుచుంబ పుచ్ఛం ననంద చిక్రీడ జగౌ జగామ
స్తంభానరోహ న్నిపపాత భూమౌ నిదర్శయన్‌స్వాం ప్రకృతింకపీనామ్

అని వర్ణించి యుండెను. అతడు తోకతో నేలను చఱచి దానిని ముద్దుపెట్టుకొనెను; సంతోషపరవశుడయ్యెను; క్రీడించెను; రాగములు తీసెను; అటునిటు నడచెను, స్తంభముల నెక్కి క్రిందకు దూకెను అతడిట్లు తనకు సహజమైన వానరప్రకృతిని ప్రదర్శించెను. హనుమంతుడు వట్టి వానరుడు కాడు. రుద్రాంశసంభూతుడైన మహానుభావుడు. అట్టివాడు కూడ ఆనందవశమున నెట్లు సహజ వానర చేష్ట లొనరించెనో మహర్షి ప్రతిభావంతముగా నీ శ్లోకమున వర్ణించి యున్నాడు. యుద్ధకాండమున మహర్షి రామ రావణ పక్షముల యందున్న యోధులొండొరులతో గావించిన పలురకములైన యుద్ధములను చూచినట్లు వర్ణించియుండెను. ఇంద్రజిత్తు కావించిన మాయాయుద్ధమును, రామలక్ష్మణ రావణాదులు ప్రదర్శించిన పరాక్రమ విశేషములను, అతడు నేర్పుతో వర్ణించియుండెను. చివర రామరావణులు కావించిన యుద్ధ మప్రతిమానమైనట్టిది. దానిని వర్ణించుట కనన్వయము తప్ప మఱి యే అలంకారమును పనికిరాదు. అందుచేతనే మహర్షి —

గగనం గగనాకారం సాగర స్సాగరోపమః
రామరావణయో ర్యుద్ధం రామరావణయో రివ॥

అని చెప్పియుండెను. ఈ విధముగా చెప్పుచు పోయిన ఆయన వర్ణన వైశారద్యమును వివరించుటకే యొక గ్రంథము వ్రాయవలసి వచ్చును. ఆతని వర్ణనము లెంత సహజములో యంత భావగంభీరములు; ఎంత పరిపూర్ణములో అంత పరిశీలనా ప్రచురములు.

మహర్షి కథలనువలెనే సంభాషణములనుకూడ మిక్కిలి రమణీయముగా

నిర్వహించెను. ఆతని సంభాషణ చాతుర్యమునకు పెక్కు దృష్టాంతముల నొసంగ వచ్చును. దశరథ విశ్వామిత్రులు, సీతారాములు, శ్రీరామ భరతులు, హనుమద్రామ లక్ష్మణులు, సీతాహనుమంతులు, సీతారావణులు, హనుమద్రావణులు మున్నగువా రొనరించిన సంభాషణములు పాత్రోచితములై, రమ్యములై, నాగరికములై ఇంపునింపుచున్నవి. కొన్నిచోట్ల నాతని సంభాషణములు రసభరిత ములుగనేకాక నాటకోచితములుకూడనై పఠితల నానందమున నోలలాడించును. మహర్షి మానవ మనస్తత్వమును పూర్తిగా నెఱింగినట్టి మహనీయుఁడు. అందుచే నాతని సంభాషణములు ఆయా పాత్రల మానసిక ప్రవృత్తుల కనుగుణములై హృద్యములుగా నుండును.

రామాయణమున ప్రధానరస మేది యను విషయమున రెండు మూడు మతము లున్నవి. కొంద అది ధర్మవీర మనియు, కొందఱు విప్రలంభశృంగార మనియు, కొందఱు కరుణ మనియు చెప్పుదురు రాముఁడు పితృవాక్య పరిపాలన మను ధర్మమును నిర్వహించుటయం దమితమైన యుత్సాహమును చూపెను. అది కాక అతఁడు ధర్మస్థాపనము కొఱకే అవతరించిన మహనీయుఁడు. అతడు కావించిన రాక్షసవధ దేవతల భయమును, ఋషుల తపోవిఘ్నమును తొలఁగించుటకు చేయఁబడినట్టిదే. రాముని చేత లన్నింట మొదటి నుండి తుదివఱకు ధర్మోత్సాహ మంతర్వాహినిగా ప్రవహించుచుండును. అందుచే నిందలి ప్రధాన రస ముత్సాహస్థాయికమైన వీరమని చెప్పుటలో దోషము లేదు. కాని, సీతాపహరణానంతరము రాముఁ డనుభవించిన వియోగ మంతములేనట్టిది. అతఁడు ప్రియను కోల్పోయిన సామాన్య మానవునివలెనే దుర్భరవియోగముపాలై పరితపించెను. కిష్కింధాకాండాంతమున హనుమంతు డరుదెంచి "కంటిన్ సీతను" అని చెప్పువఱకు నతఁ డావేదన ననుభవించుచునేయుండెను. తరువాత సీతను చూచువఱకుఁ గూడ నతఁడు, యుద్ధోత్సాహము ప్రదర్శించుచుండినను, ఆంతరముగా వియోగవేదన అనుభవించుచునే యుండెను. ఈ విధముగా రామాయణమున విప్రలంభశృంగారము కూడ నున్నమాట నిజమే. కాని సీతను రావణుఁ డపహరించెనని తెలియువఱకు, హనుమంతుఁ డామె లంకలో క్షేమముగా నున్నదని తెలుపువఱకు, రాముని కామె విషయ మేమియును తెలియదు. అంతవఱ కాతఁ డనుభవించిన దొకవిధముగా కరుణయే యని చెప్పనొప్పును. ఉత్తరరామాయణ మంతయు కరుణరసమయము. వాల్మీకి రామాయణ రచనకు ప్రేరేపించినట్టిది

క్రౌంచ ద్వంద్వ వియోగోత్థమైన శోకము. ఆ శోకమే శ్లోకత్వము నందెను. కాళిదాసు కూడ రఘువంశమున "శ్లోకత్వ మాపద్యత యస్య శోకః" అని చెప్పి యుండెను. దీని ననుసరించి ఆనందవర్ధనాచార్యులు "రామాయణే హి కరుణోరసః స్వయ మాదికవినా సూత్రితః శోక శ్లోకత్వ మాగతః ఇత్యేవ మాదినా నిర్వ్యూఢశ్చ సయేవ సీతాత్యంత వియోగపర్యంతం స్వప్రబంధ ముపరచయతా" అని కరుణరసమే ప్రధాన మని చెప్పియుండెను. తరువాత పలువురు విమర్శకులును, కవులును ఆ మతమునే యంగీకరించి యున్నారు. ఈ విధముగా రామాయణమునందు కరుణయే ప్రధానమైనను ఆయా సందర్భములందు అన్యరసములు కూడ పోషింపబడినవి. యుద్ధ కాండమున వీరరౌద్రాద్భుతరసములు గోచరించును. లక్ష్మణుడు మూర్ఛితుడైనప్పుడు రాముడును, ఇంద్రజిత్తు మరణించినప్పుడు రావణుడును, రావణుడు మరణించినప్పుడు మండోదరీ విభీషణాదులును, దుఃఖించినపుడు కరుణరసము పోషింపబడినది. సీతారామ వివాహ సందర్భమున శృంగార మున్నది. శూర్పనఖా వృత్తాంతమునందును, రావణుడు సీతతో సంభాషించు సందర్భముననను శృంగారాభాసము గోచరించును. అగ్ని ప్రవేశ సందర్భముననను, భరద్వాజుడు భరతునికి విందొనరించిన సందర్భముననను అద్భుతరసము స్ఫురించును. మహర్షి రసపోషణమున సిద్ధహస్తుడు; సర్వరస పోషణమునందు నాతనికి గల కౌశలమే రామాయణమునకు మహాకావ్యత్వము నొసంగినది.

పాత్రపోషణమున మహర్షి ప్రదర్శించిన నేర్పనన్యసామాన్య మైనట్టిది. ప్రధానములు, అప్రధానములు అను భేదము లేకుండ సర్వపాత్రములను అతడపారమైన కౌశలముతో తీర్చి దిద్దియుండెను. రాముడు మూర్తమైన ధర్మము (రామో విగ్రహవాన్ ధర్మః). సత్యపరాక్రముడు, మర్యాదాపురుషోత్తముడు. అతడే మొనర్చినను, ఏమి భాషించినను ఆ చేతలును, భాషణములును సర్వ లోకాదర్శ ప్రాయములుగా నుండును. అతని పితృవాక్య పరిపాలన పరాయణత అసాధారణ మైనట్టిది. తండ్రిని సత్యప్రతిజ్ఞు నొనరించుటకై యాతడు నిశ్చింతముగా రాజ్యమును విడిచి యడవుల కేగెను. ఇట్టి మహాత్యాగము సాధారణముగా నెవ్వరి యందును గోచరింపదు రామాయణారంభముననే యేగుణములు కలవానిని గురించి తన కెఱిగింపు మని వాల్మీకి నారదు నడిగియుండెనో ఆ గుణగణములన్నియు రామునియందు గోచరించును. అతనికృతజ్ఞతఅపూర్వమైనది.

జటాయువు తన భార్యయైన సీతను రక్షించుటకై రావణునితో పోరాడి మరణింప నున్నాఁడని విని అతడు పొందిన దుఃఖమునకు మేరలేదు. అతఁడు లక్ష్మణునితో

నా స్త్యభాగ్యతరో లోకే మత్తోఽస్మిన్ సచరాచరే
యే నేయం మహతీ ప్రాప్తా మయా వ్యసన వాగురా
సీతాపహరణం దుఃఖం న మే సౌమ్య తథాగతం
యథా వినాశో గృధ్రస్య మత్కృతే చ పరంతప

అని సీతాపహరణ జాత దుఃఖము కంటెనుకూడ గృధ్ర రాజవినాశము తన కెక్కువ వేదనాకరముగానున్నదని పల్కియుండెను. తరువాతజటాయువునకు తండ్రికి వలెనే దహనసంస్కారాదుల నొనరించెను. ఇట్లే హనుమంతుడు లంక నుండి తిరిగివచ్చి సీతాక్షేమవార్త చెప్పఁగనే రాముఁడు కృతజ్ఞతాపూరితుఁడై ఆతనిని కౌగిలించుకొనెను.

ఇత్యుక్త్వా ప్రీతి సంహృష్టో రామ స్తం పరిషస్వజే
హనూమంతం మహాత్మానం కృతకార్య ముపాగతమ్

రాముని ధర్మజ్ఞత వర్ణనాతీతమైనది. విశ్వామిత్రుఁడు తాటకను సంహరింపు మని చెప్పినపు డతఁడు స్త్రీవధ అధర్మమగుటచే ముందు కొంత శంకించెను తరువాత గురువాక్యము ననుసరించి తాటకను సంహరించి ఆతని ప్రశంసలు పొందెను. రాముఁడు, గుహుఁడు, శబరి, హనుమంతుఁడు మున్నగు భక్తులయెడ ప్రదర్శించిన అనుగ్రహము వర్ణనాతీతమైనది. అతని శరణాగత రక్షణ పరాయణత అనిర్వచనీయము. తనకు పరమశత్రువైన రావణుని తమ్ముఁడు విభీషణుఁడు శరణాగతుఁడై నప్పుడు కూడ సుగ్రీవ లక్ష్మణాదు లెందఱెంత చెప్పినను వినక ఆతనికి శరణ మొసంగి లంకకు పట్టాభిషిక్తు నొనరించెను.

సకృదేవ ప్రపన్నాయ త వాస్మీతి చ యాచతే
అభయం సర్వభూతేభ్యః దదా మ్యేతద్వ్రతం మమ.

యనునది యతని వ్రతము. ఒకవేళ నీ నిశిత బాణముల సోకున కోర్వఁజాలక రావణుఁడే శరణాగతుఁడైనచో లంకానగరమును విభీషణుని కెట్లిచ్చెద వని సుగ్రీవుఁడు ప్రశ్నింప రాముఁ డప్పుడు రావణునికి అయోధ్య నిచ్చెద నని పలికి యుండెను.

అనఘచరిత్ర ! నీకు శరణాగతరక్ష కులవ్రతంబు నీ
సునిశిత బాణ జాలముల సోకున కోర్వక వచ్చి యాదశా

నను( దభయంబు వేడుకొనినం దగ వెట్లగు నన్న నవ్విభీ
యుయ్యనసుతు చూచి పల్కె నపు డిచ్చెద వాని కయోధ్య నావుడున్.

రామునికి తల్లులయెడను, సీతయెడను, తమ్ములయెడను గల భక్తి ప్రేమవాత్సల్యము లపారమైనవి. సీతాపహరణానంతర మాత(డు పొందిన వేదనయు, తరువాత సీతావియోగముచే ననుభవించిన విరహదుఃఖమును వర్ణింప నలవికానివి. తన పట్టాభిషేక భంగమునకును, వనగమనమునకును కారణభూతు రాలైన కైకయెడకూడ నాత(డు వైముఖ్యము వహింపకపోవుట అతని మహాత్మ్యతకు లక్షణము. భరతు(డు తన్ను మఱల నయోధ్యకు(గొనిపోవుటకై చిత్రకూటమున కరుదెంచినపుడు కోపించిన లక్ష్మణుని ఉపశమింప(జేసి యాత(డు భరతుని సౌశీల్యమును తెలియ(జెప్పెను. అప్పు డాత(డు భరతునియెడ చూపిన వాత్సల్య మింతింతనరానిది. యుద్ధమున లక్ష్మణు(డుమూర్ఛితు(డైనప్పు డాత(డు లక్ష్మణు(డు తనకై చేసిన త్యాగమును, వనవాసమున కరుదెంచినప్పటినుండియు నాత(డు కావించిన సేవను తలంచుకొని మిక్కిలి దుఃఖించెను.

దేశే దేశే కళత్రాణి దేశే దేశే చ బాంధవాః
తం తు దేశం న పశ్యామి యత్ర భ్రాతా సహోదరః

అను జగత్ప్రసిద్ధమైన శ్లోక మాతని భ్రాతృవాత్సల్యమునకు నిదర్శనము. మిత్రులయెడనే కాక, శత్రులయెట కూడ రాము(డు ప్రదర్శించిన సౌజన్య మాశ్చర్యమును కలిగించును. రావణ మరణానంతర మాత(డు విభీషణుని పిల్చి అన్నకు సాంపరాయికక్రియ లొనరింపు మని ఆదేశించెను. అతనికి వ్యక్తుల దుష్ట కార్యములపైనే ద్వేషముకాని ఆ వ్యక్తులపై నెట్టి ద్వేషమును లేదనుటకు

మరణాంతాని వైరాణి నివృత్తం నః ప్రయోజనం
క్రియతా మస్య సంస్కారః మమా ప్యేష యథా తవ

అను శ్లోకము దృష్టాంతము. ఈ విధముగా రాము(డు రామాయణమున సర్వ సద్గుణ సముద్రు(డుగా వర్ణింప(బడియున్నాడు. అతనియందు లేని గుణము లేదు. ఉన్నదోషము లేదు.

వాల్మీకి రాముని భగవంతునిగా కాక ఆదర్శరాజపుత్రు(డుగా చిత్రించి యుండె నని విమర్శకులు చెప్పుదురు. అందులో కొంత సత్యము లేక పోలేదు. వాల్మీకి యాతని నాదర్శ పురుషోత్తమునిగా వర్ణించుచునే యాయా పాత్రల

ముఖమున నాతని యవతార పురుషత్వమును గూడ సూచించుచునే యుండును.
విశ్వామిత్రుఁడు దశరథునితో పలికిక·

అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమం
వసిష్ఠోఽపి మహాతేజా యే చాన్యే తపసి స్థితాః

అను శ్లోకములో నాంతరముగా శ్రీరాముని అవతార మూర్తిత్వము ద్యోతిత మగుచున్నది. విశ్వామిత్రుసంతటి మహర్షికూడ నిద్రించుచున్నరాముని

కౌసల్యాసుప్రజా రామ పూర్వాసంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవ మాహ్నికమ్

అని మేల్కొలుపుట అతని అవతార పురుషత్వము నెఱింగియుండుట చేతనే. పరశురాముడు శ్రీరామునితో,

అక్షయ్యం మధుహంతారం జానామి త్వాం సురేశ్వరం

అనియు; మారీచుఁడు రావణునితో,

రామో విగ్రహవాన్ ధర్మః సాధు సత్యపరాక్రమః
రాజా సర్వస్య లోకస్య దేవానా మివ వాసవః

అనియు; సీత హనుమంతునితో,

కౌసల్యా లోకభర్తారం సుషువే యం మనస్వినీ

అనియు; మాల్యవంతుఁడు రామునితో సంధి చేసికొనుమని రావణునితో చెప్పు సందర్భమున,

విష్ణుం మన్యామహే దేవం మానుషం దేహ మాస్థితం

అనియు; రావణుఁడు శ్రీరామునిగూర్చి తనలో

యస్య విక్రమ మాసాద్య రాక్షసా నిధనం గతాః
త మ్మన్యే రాఘవం వీరం నారాయణ మనామయం

అనియు పలికియుండుట శ్రీరాముని అవతార పురుషత్వమునకు నిదర్శనములు. అసలు రామాయణము దేవతల ప్రార్థన నాలించి శ్రీమన్నారాయణుఁడు రాముఁడుగా నవతరించి రావణుని వధించెద నని పల్కి వారి నూరడించుటతో నారంభించుచున్నది. రాముఁడు జటాయువున కగ్ని సంస్కారము కావించి ఆతని నుద్దేశించి "యా గతి ర్యజ్ఞశీలానా మాహితాగ్నే శ్చ యా గతిః - - - గచ్ఛ లోకా ననుత్తమాన్" అని పలికియుండెను. శబరి శ్రీరాముని దర్శించినపుడు "గమిష్యా మ్యక్షయాన్ లోకాన్ త్వత్ప్రసాదా దరిందమ" అని పలికెను.

ఇట్లు భూలోకమునం దున్నవారిని ఉత్తమలోకమునకు పంపుటకు పరమాత్మునికి తప్ప మఱి యెవ్వరికి శక్తి యుండును? లక్ష్మణుఁడు రామునితో నడవుల కేగుట కనుమతి యిమ్మని సుమిత్ర నడుగఁ బోయినప్పు డామె,

రామం దశరథం విద్ధి । మాం విద్ధి జనకాత్మజా ।
మయోధ్యా మటమీ విద్ధి । గచ్ఛ తాత యథాసుఖమ్.

అని పలికి అతనిని సుఖముగా వెడలి రమ్మని యనుమతించి పంపెను. 'దశరథం' అనగా పక్షివాహనముగా గల విష్ణునిగా ననియు,'మాం' అనగా లక్ష్మినిగా ననియు, 'అయోధ్యా' యనగా స్వర్గముగా ననియు నర్థములు గలవు. (దేవానాం పూరయోధ్యా—అరుణము) ఈ యర్థములనుబట్టి చూచినచో రాముఁడు పరమ పురుషుఁ డనియే వ్యక్త మగుచున్నది. ఈ విధముగా మహర్షి పెక్కు చోట్ల శ్రీరాముని భగవత్త్వమును గూడ సూచించెను.

రాముఁడు వాలిని వధించుటయు, యుద్ధాంతమున సీత నగ్ని ప్రవేశము చేయ నియోగించుచు నామెను గూర్చి కొన్ని కఠినవాక్యములు పలుకుటయు రామునియం దెట్లు సమర్థనీయము లగునని కొందఱు ప్రశ్నించుచుందురు. ఈ ప్రశ్నముల కన్యరామాయణములలో సమాధానము లున్నవి. రాముఁడు వనవాసాగతుఁడయ్యు రాజునకు ప్రతినిధియే. అధర్మమును తొలగించి ధర్మమును కాపాడవలసిన బాధ్యత యాతనియం దున్నది. వాలి చేసిన యధర్మమును సహింపలేక యాతఁ డాతనిని సంహరింప నిశ్చయించెను. వాలి యెంత పరాక్రమవంతుఁడైనను మృగమగుటచే నతనిని మాటున నుండి చంపెను. రాముఁడు సీత నగ్ని ప్రవేశము చేయుమనుట సీత పాతివ్రత్య పవిత్రత్వములు తెలియక కాదు. స్వయముగా నాతఁ డావిషయము నెఱింగినను లోకమునకు కూడ సమాధానము చెప్పవలసి యున్నది. అతఁడు దేవుఁడైనను అభిమానశాలియైన క్షత్రియుడుగా పుట్టెను. ఆ యభిమానమే సీతతో నట్లు మాటాడుటకు కారణము.

లక్ష్మణుఁడు, భరతుఁడు శ్రీరామునియెడ చూపిన భక్తి గౌరవము లపారమైనవి. భరతుఁడు చేసిన త్యాగము శ్రీరాముఁ డొనరించిన త్యాగము కంటెను ఉత్కృష్టమైనది. అతఁడు తల్లి తనకై రాజ్యము సంపాదించినందులకు సంతోషింపలేదు సరికదా మిక్కిలి చింతించి యామెను నిందించెను. గుహుఁ డాతని ముందు శంకించినను తరువాత అతని త్యాగమునకు సంతోషించి,

ధన్య స్త్వం న త్వయా తుల్యం పశ్యామి జగతీపతే
అయత్నా దాగతం రాజ్యం య స్త్వం త్యక్తు మి హేచ్ఛసి

అని ప్రశంసించెను. భరతుఁడు చిత్రకూటమున కరుదెంచి నపుడు రాముఁడు తనవంటి పుత్రుడును, భరతుని వంటి సోదరుఁడును లేఁడని చెప్పి యుండెను. మహర్షి భరతుని శీలమును మిక్కిలి యుదాత్తముగా చిత్రించెను. లక్ష్మణుని యందు వట్టి భ్రాతృత్వమే గాక దాస్యభక్తి కూడ నున్నట్లు తోఁచును. కొన్ని సందర్భములలో నతడు కోపము నొందినను మఱల రాముని యుపదేశముచే శాంతించెను· ఆ కోపముకూడ రామునియందు తనకుఁ గల భక్తి ప్రేమల చేతనే. అతఁడు సీత యందు చూపిన గౌరవ మసాధారణ మైనట్టిది. కిష్కింధలో సీత పడవైచిన నగల మూటను రాముఁడు చూడు మన్నపు డతఁడు,

నాహం జానామి కేయూరే నాహం జానామి కుండలే
నూపురే త్వభిజానామి నిత్యం పాదాభివందనాత్

అని పలికి యుండెను. మహర్షి యీ శ్లోకమును వ్రాసి మఱఁదులు వదినెలయెడ వర్తింపవలసిన విధమెంతో ఉదాత్తముగా వర్ణించియుండెను.

హనుమంతుఁడు వట్టి వానరుఁడు కాఁడు " నా నృ గ్వే ద వి నీ త స్య " మున్నగు శ్లోకముల నాతఁడు వేదములను వ్యాకరణములను అభ్యసించిన వాఁడని తెలుపుచున్నవి. అతని మాటలలోనే ఒక వైలక్షణ్య మున్నది. వానిని వినఁగానే రాముఁ డతఁడు మహాపండితుఁ డని గ్రహించెను. అతని స్వామి భక్తి యప్రతిమానము. అతని పరాక్రమము సాటిలేనిది. రావణాంతఃపురమున సీతను వెదకుటకై వెడలినప్పు డాతఁడు వివిధవిన్యాసములలో నున్న స్త్రీలను దర్శించి బ్రహ్మచారియైన తనకు పాప మావహిల్లె నని తలంచెను. కాని తరువాత,

మనో హి హేతు స్సర్వేషా మింద్రియాణాం ప్రవర్తనే
శుభాశుభాస్వవస్థాసు తచ్చ మే సువ్యవస్థితమ్

అని యూఱట చెందెను. ఇది యాతని జితేంద్రియతకు తార్కాణము. అతడు రామాయణ మహామాలారత్నము. బుద్ధిమద్వరిష్ఠుఁడు.

రావణుడు సీతాపహరణ మను దుష్కార్యము నొనరించినను మహాపరాక్రమశాలి వాల్మీకి యతనిని శుష్కరాక్షసుఁడుగా కాక హృదయవంతుఁడైన తండ్రిగా, అన్నగా, సోదరుఁడుగా, పరిపాలకుఁడుగా వర్ణించియుండెను. సుందరకాండమున హనుమంతుఁ డాతని కొలువులో దర్శించి నప్పుడు,

అహో రూప మహో ధైర్య మహోసత్త్వ మహో ద్యుతిః
అహో రాక్షసరాజస్య సర్వలక్షణ యుక్తతా

అని యాతని రూపమును జూచి యాశ్చర్యచకితుఁడై

య ద్యధర్మో న బలవాన్ స్యా దయం రాక్షసేశ్వరః
స్యా దయం సురలోకస్య సశక్ర స్యాపి రక్షితా

అని అతని మహత్త్వమును ప్రశంసించెను. కాముకుఁడై సీత నపహరించి యుం డనిచో నతఁ డాదర్శప్రాయుడైన మహారాజు కాఁగలిగి యుండెడివాడు. మహరి వాలి, సుగ్రీవుఁడు, ఇంద్రజిత్తు, మారీచుఁడు, విశ్వామిత్రుఁడు, దశరథుఁడు, వసిష్ఠుఁడు, శత్రుఘ్నుడు, అంగదుఁడు, జాంబవంతుఁడు మున్నగువారి శీలము లను కూడ చక్కఁగా చిత్రించియుండెను.

దశరథుని దేవేరులైన కౌసల్యా సుమిత్రా కైకల శీలములను, తారా, మండోదరీ త్రిజటాదుల శీలములను వాల్మీకి యథోచితముగా చిత్రించెను. కైక సహజముగా దుష్టురాలు కాదు. రాముని నామె గాఢముగా ప్రేమించియుండెను. అతని పట్టాభిషేకమన నామె అందఱికంటె నధికముగా సంతోషించెను. మంథర దుర్బోధ మామె దృక్పథమును మార్చెను. ఆ మార్పే ఆమెను శాశ్వతముగా లోకమున నిందకు పాల్చేసెను. సీత మహాసాధ్వి. పతివ్రతాలక్షణములన్నియు నామెయందు పుంజీకృతములై యున్నవి. సుందరకాండలో హనుమంతుడు సీతను మొదట చూచినప్పుడు,

రాజ్యం వా త్రిషు లోకేషు సీతా వా జనకాత్మజా
అపి త్రైలోక్యరాజ్యం చ సీతాయా నాప్నుయాత్కలామ్

అని ఆమె గొప్పతనమును ప్రశంసించెను. ఆమె పల్కిన పల్కులు విని అతఁడు

యుక్తరూపం త్వయా దేవి! భాషితం శుభదర్శనే
సదృశం స్త్రీస్వభావస్య సాధ్వీ నాం వినయస్య చ

అని పలికెను. కాంచనమృగసంహరణానంతర మామె లక్ష్మణుని రాముని కొఱకు పంపుచు పల్కినపల్కులు పఠితల కాశ్చర్యమును కలిగించును. భర్త కేమి హాని జరిగినదో యను భయముచే నామె యుక్తాయుక్తము తెలియంగక లక్ష్మణునిఁగూర్చి పరుషములైన వాక్యములు పల్కెను. అందుచే నాతఁ డామె విడిచి వెడలక తప్పినదికాదు. అత్యంత భక్తినిధాన మైన లక్ష్మణుని గూర్చి యామె యట్లు పలుకుటయే తరువాత తీవ్రమైన విరహవేదన ననుభవించుటకు

కారణమైనది. యుద్ధానంతరము లక్ష్మణుని కలసికొన్నపు డామె తన వాక్పారుష్యమును క్షమింపు మని వేడుకొనెను. అనసూయాదు లామెను సంభావించిన విధమును, అగ్నిప్రవేశమును ఆమె పవిత్రత్వమునకు గొప్ప నిదర్శనములు. శూర్పణఖ, మంథర అనువారు అప్రధాన పాత్రలుగా కన్పింతురు. రామాయణ కథ యంతయు వారిమూలముననే సాగినదని చెప్పవచ్చును. ఈ విధముగా వాల్మీకి రామాయణమందలి స్త్రీ పురుషపాత్రల నన్నింటిని విస్పష్ట రూపరేఖలతో తీర్చిదిద్ది తన పాత్ర చిత్రణనైపుణ్యమును, మనస్తత్వ పరిజ్ఞానమును ప్రకటించి యుండెను.

వాల్మీకి రామాయణముద్వారా లోకమున కిచ్చిన సందేశము సర్వశిరోధార్యమైనది. సత్యధర్మము లెన్ని ఆటంకములకు గురియైనను చివరికి విజయము పొంది తీరును. సీతారాముల వృత్తాంత మిందుకు మంచి నిదర్శనము. త్యాగము ప్రశంసనీయమైన గుణము. అది ప్రదర్శించినవారు శాశ్వతమైన కీర్తి నొందుదురు. రాముఁడు, లక్ష్మణుఁడు, భరతుఁడు చేసిన త్యాగము చాల గొప్పది. అందుచేతనే వారికీర్తి నేఁటికిని అజరామజరమై అలరారు చున్నది. ఇతర గుణ సంపద యెంతయున్నను కామమునకు వశుఁడైనవాఁడు వినాశము పొందును. రావణుఁడు దిక్పాలురను, సర్వలోకములను జయించిన మహావీరుఁడు. అయ్యును కాముకుఁడై సీత నపహరించి, సబంధుమిత్రముగా వినాశము నొందెను. శూర్పణఖ రాముని వలచి ముక్కు, చెవులు కోల్పోయెను. దశరథుఁడు కైక యందలి మోహముచే నామె చేతి కీలుబొమ్మయై రామునే కాక తన ప్రాణములు కూడ పోఁగొట్టుకొనెను. దురుపదేశ శ్రవణము హానికరము. కైక మంథర దురుపదేశము విని లోకమున నెంతో అపకీర్తికి పాలయ్యెను. రాజ్యాశయు, లౌకిక భోగ వాంఛయు మానవులకు ధ్వంసము చేకూర్చును. కైకయు, వాలియు నిందుకు నిదర్శనములు. కృతజ్ఞత కెనయైన గుణ మింకొకటి లేదు. రాముఁడు జటాయువు నెడను, హనుమంతు నెడను, సుగ్రీవు నెడను వర్తించిన విధాన మిందుకు దృష్టాంతము. త్రికరణశుద్ధిగా భగవంతునికి ప్రసన్నులైనవారు తరించుటకు సందేహములేదు. శబరి, గుహుఁడు ఇందుకు నిదర్శనములు, రామాయణమున కథాసన్నివేశములు సూచించు నీ సామాన్య నీతులేకాక రాజనీతి కూడ విశదీకరింపబడినది. భరతుఁడు చిత్రకూటమున కరుదెంచినపుడు రాముఁ డతని పరిపాలనమును గూర్చి పెక్కు ప్రశ్నలు వేసెను. ఈ సర్గకు కచ్చిత్ సర్గ యని

పేరు. ఇందు రాజు రాజ్యమును పరిపాలించు విధమంతయు చక్కఁగా సూచింపఁబడినది. రామాయణమున సర్వజనీనభావములతో గూడిన శ్లోకములును, భావములును అసంఖ్యాకములుగా నున్నవి. "క్రుద్ధో హన్యా ద్గురూ నపి; జీవన్ భద్రాణి పశ్యతి; మనో హి హేతుః సర్వేషా మింద్రియాణాం ప్రవర్తనే" మున్నగునవి ఇట్టివి.

జాతే జగతి వాల్మీకౌ కవి రిత్యబిధా భవత్
కవీ ఇతి తతో వ్యాసే కవయ స్త్వయి దండిని.

అని దండిని గూర్చి ఎవరో చెప్పిన శ్లోక మొకటి యున్నది. దండి విషయమున నీవాక్యము సత్యమైనను కాకపోయినను వాల్మీకి విషయమున నిది పరమసత్యము. లోకమున వాల్మీకి జనింపఁగానే కవి శబ్దమున కేకవచన రూపమైన "కవిః" అను పదము కూడ పుట్టెను. అంతకు ముందు కవులు లేరనియు నప్పటి కతఁ డొక్కఁడే కవి యనియు దీని భావము. ఆతఁడు రామరావణ యుద్ధమునకు రామరావణ యుద్ధమునే పోలికగా చెప్పిన ట్లతని కవిత్వమున కతని కవిత్వమునే పోలికగా చెప్పవలయును. ఆతని రచనలో నాడంబర మెచ్చటను కానరాదు. అది ఎంత సరళముగా నుండునో అంతశక్తిమంతమై యొప్పారును. అతని భావములు సహజ గంభీరములు.

అమృతం విషసంసృష్టం త్వయా వానర భాషితం
యచ్చ నాన్యమనా రామః యచ్చ శ్లోకపరాయణః

అని సీత హనుమంతునితో చెప్పిన శ్లోక మిందుకు నిదర్శనము. సంస్కృతభాష రాని వారికి కూడ ఆతని శ్లోకము లొక విధముగా నర్థమగుచునే యుండును. అందు కందలి సారళ్యమే కారణము. ఆతఁడు వర్ణ్యయములను సమగ్ర రూపముతో చిత్రించి వానిని పఠితలకు సాక్షాత్కరింపఁ జేయుచుండును. ఆతఁడు ప్రయత్న పూర్వకముగా నలంకారములను వాడఁడు. ఉపమారూపకాద్యలంకారము లతని రచనలో నప్రయత్నసిద్ధములై దాని కపూర్వమైన సౌందర్యము నాపాదించుచుండును.

ఊరువేగోద్ధతా వృక్షాః ముహూర్తం కపి మన్వయుః
ప్రస్థితం దూర మధ్వానం స్వబంధు మివ బాంధవాః
అకర్దమ మిదం తీర్థం భరద్వాజ నిశామయ
రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్య మనో యథా.

అను శ్లోకములయందలి ఉపమానము లెంత రమణీయములో వేఱుగా చెప్ప నక్కఱలేదు. అశోకవృక్షము క్రింద నున్న సీతను వర్ణించుచు అతఁడు

దదర్శ శుక్లపక్షాదౌ చంద్రరేఖా మి వామలాం
పినద్ధాం ధూమజాలేన శిఖా మివ విభావసోః
సపంకా మనలంకారాం విపద్మా మివ పద్మినీం
తాం స్మృతీ మివ సందిగ్ధాం బుద్ధిం నిపతితా మివ
విహతా మివ చ శ్రద్ధా మాశాం ప్రతిహతా మివ
ప్రతిపత్ పాఠశీలస్య విద్యేవ తనుతాం గతాయ్

అని సముచితములైన ఉపమానములును గుమ్మరించెను. అతని ఉపమానములు పెక్కు కాళిదాసాది మహాకవులకు కూడ మార్గదర్శకము లైనవి. హనుమంతుని ద్వారా రామ సుగ్రీవులకు సఖ్య మేర్పడిత సందర్భము నందలి

సీతాకపీంద్రక్షణదాచరాణాం రాజీవ హేమ జ్వలనోపమాని
సుగ్రీవరామ ప్రణయ ప్రసంగే వామాని నేత్రాణి సమం స్ఫురంతి

అను శ్లోకమున ఉపమాలంకారముతో పాటు క్రమాలంకారము కూడ కానవచ్చు చున్నది. రావణుఁడు మరణించినప్పుడు విభీషణుడు విలపించు సందర్భమున

ధృతి ప్రవాళః ప్రసహాగ్ర్య పుష్పః తపోబలః శౌర్యనిబద్ధమూలః
రణే మహాన్ రాక్షసరాజవృక్షః సమర్దితో రాఘవమారుతేన

అను శ్లోక మున్నది ఇ-దు రావణునియందు వృక్షత్వమును, రాముని యందు మారుతత్వమును అరోపింపఁబడినవి. ఇందలి రూపకాలంకారము రావణుని గుణ గణములను వర్ణించుచు అత్యంత సుందరముగా నున్నది.

విషాద నక్రాధ్యుషితే పరిత్రాసోర్మిమాలిని
కిం మాం న త్రాయసే మగ్నం విపులే శోకసాగరే

అనునది మఱియొక చక్కని రూపకాలంకారము. ఇట్లే రామాయణమున ఉత్ప్రేక్ష అర్థాంతరన్యాసము, అతిశయోక్తి మున్నగు నలంకారము లందందు గోచరించు చుండును. వాల్మీకి శబ్దాలంకారములకొఱకు యత్నింపనే యత్నింపఁడు. అయ్యు నవి యచ్చటచ్చట నప్రయత్నసిద్ధములై గోచరించుచుండును. సుందరకాండము నందలి చంద్రోదయ వర్ణన మిందుల కుదాహరణము. రామాయణమున సర్గాంత ములందును, కొన్ని సర్గములందును తప్ప సర్వత్రా అనుష్టుప్పులే వాడఁబడినవి. వాల్మీకి కవిత్వము సరళసుందరమయ్యు వ్యంగవిలసిత మగుటచే నందలి

యర్థము సమగ్రముగా గ్రహించుటకు గాఢమైన యత్నము చేయవలెను. "మధుమయ ఫణితీనాం మార్గదర్శీ మహర్షిః" అను మాట అతని యెడ మిక్కిలి సార్థకము. అతని రచనా వైచక్షణ్యమే రామాయణమునకు శాశ్వతత్వము చేకూర్చెను. "యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే తావ ద్రామాయణకథా లోకేషు ప్రచలిష్యతి".

—: ౦ :—

# అధ్యాత్మ రామాయణం
## —డాక్టర్ ధూళిపాళ శ్రీరామమూర్తి

"విశ్వోద్భవస్థితిలయాదిషు హేతు మేకం
మాయాశ్రయం విగతమాయ మచిన్త్యమూర్తిం
ఆనందసాన్ద్ర మమలం నిజబోధరూపం
సీతాపతిం విదితతత్త్వ మహం నమామి."
"పురారిగిరిసంభూతా శ్రీరామార్ణవసంగతా
అధ్యాత్మరామ గంగేయం పునాతి భువనత్రయం"

ఈ శ్లోకములు అధ్యాత్మరామాయణమహిమను గురించి చెప్పును. వాల్మీకీయమహిమనుగురించి చెప్పునట్టిది, దీనితో బింబప్రతిబింబసంవాదము కలిగిన శ్లోక మొకటి యున్నది.

'వాల్మీకి గిరిసంభూతా రామసాగరగామినీ
(పునాతి భువనం పుణ్యా రామాయణమహానదీ)
శ్రీమద్రామాయణీ గంగా పునాతి భువనత్రయం.'

ఈ రెండు రామాయణములు సమానమైనమహిమ గలవి యని దీనివల్ల మనము గ్రహించదగియున్నప్పటికిని మొదటిశ్లోకములో కొంతవిశేష మున్నది. రెండురామాయణములును గంగవంటివే మూడులోకములను పవిత్రము చేయునట్టివే. ఈ రెండువిశేషణములును సమానముగా నుండగా మఱిరెండువిశేషణములు భిన్నములై యున్నవి.

ఒకటి:— ఒకరామాయణము వాల్మీకిగిరిసంభూతము, రెండవది పురారిగిరిసంభూతము. వాల్మీకి, పురారి, ఇద్దరును గిరులే. వల్మీకమునుండి యావిర్భవించినవాడు వాల్మీకి. పురములకు శత్రువైనవాడు పురారి. పురము లనగా త్రిపురములు. త్రిపురములతో దండెత్తివచ్చినయసురులను జయించినవాడు అనుకథార్థము లభ్యమానమగుచుండగా స్థూల, సూక్ష్మ, కారణదేహములను జయించి తురీయ

మైన బ్రహ్మభావమును బొందినవాడను నర్థముకూడ శబ్దశక్తిచేత వ్యజ్యమాన మగుచున్నది.

రెండు:- ఒకకథ రామసాగరగామిని యగుచుండగా రెండవకథ రామార్ణవసంగత యగుచున్నది.

సాగరము- అర్ణవము-ఈరెండును సముద్రార్థకములే. మొదటివానికి సగరులు త్రవ్వినది యనియర్థము. రెండవదానికి అర్ణములకు స్థానమని యర్థము. అర్ణము లనగా జలములు. ఈ అర్ణశబ్దము 'ఋ' గతౌ అనుధాతువునుండి నిష్పన్నమైనది. అర్ణము లనగా గతి గలవి. ప్రవహణశీల మైనవి, యని అర్థము. ఇవి రాముని పొందును. పొంది ఏ మగును? పైన వానికి గతి లేదు. నిలచిపోవును కావున రాముడు గతిమంతము లైనవానికి పరమప్రాప్యము అనగా పరిపూర్ణ మైన పరబ్రహ్మస్వరూప మన్నమాట. గతి యనగా చలనము. చలనమునకు తొలిరూపము సంకల్పము. సంకల్పము సంపూర్ణున కుండదు. అసంపూర్ణుడైన వానికే సంకల్పము కలుగును. అపు డతడు క్రియాభిముఖు డగును. సంకల్పము వలననే సంసరణ మన్నమాట. జీవులందఱును సంసరణశీలురె. గతిమంతులె. సంపూర్ణమైన స్వరూపావగతి వీరికెప్పుడు కల్గునో, అప్పుడు వారికి సంకల్పముపశాంతమై చలన ముడిగి శాంతి లభించును.

ఇ ట్లీవిశేషణములు రెండును భిన్నములై రామాయణాధ్యాత్మరామాయణములకు గల ప్రయోజనతారతమ్యమును పట్టియిచ్చుచున్నవి. వాల్మీకీయము కథాప్రధానము. అందున్న తత్త్వప్రతిపాదనలక్షణము నిగూఢమైనది. మిక్కిలి నిపుణముగా విచారించినగాని తెలిసికోరానట్టిది. అధ్యాత్మరామాయణమునందు తత్త్వవివేచనము మిక్కిలిప్రధానము. కథ అప్రధానము. ఇందు కథ పట్టియాలంబనము మాత్రమే. వాల్మీకి కథతప్ప మఱియొకటి చెప్పడు. కథనుమాత్రమే బహువేగముగా నడిపించును. తక్కిన సర్వవిషయములు కథలో మప్పి లోపల నెక్కడనో నిక్షేపించియుంచును. ఆయనశైలి మధురాతిమధురమైనది. ఈశైలీమాధుర్యము పాఠకుల నాకర్షించి లోనికి దిగనీయదు. దీనికితోడు కథావేగము. ఆ వడిలో పాఠకుడు కొట్టికొనిపోవలసినదే.కాలూది నిలువనే లేడు. మఱి లోపలికి దిగుట యెక్కడిది? ఒకవేళ నెట్లో ప్రయత్నించి శైలీమాధుర్యమును, కథావేగమును తట్టుకొని లోనికి మునుగుటకు మొదలుపెట్టినను ఊరక లోనికి పోవుటయే కాని యాలోతుల కంతు దొరుకదు. వాల్మీకి రచనాలక్షణ మిట్టిది, అది

కావ్యము. మహాకావ్యము. నీటికొలదితామర. అంతవర కెందులకు వాల్మీకీయము నందు మొదలునుండి తుదివఱకు, ఆధ్యాత్మికవిశేషములమాట యట్లుంచి, కథాగతము లైన సమస్యలే యనేకము లున్నవి. వాల్మీకీయమునకు ననేకవ్యాఖ్యా నములు పుట్టినవి. కావ్యరూపమునను నాటకరూపమునను కూడ బహువ్యాఖ్యా నములు పుట్టినవి. వీరంవరును మహానుభావులే. మహామేధావులే కొందఱుకొందరు కొన్నికొన్ని సమస్యలను పరిష్కరించుటకు ప్రయత్నించినారు. కొంద ఱాయా ఘట్టములను మఱియొకతీరున సంస్కరించి వ్యాకరించినారు. కొందఱు మార్పులు చేర్పులు గావించి వాల్మీకికి మెఱుగులు దిద్దినా మనుకొన్నారు కాని వీ ఱెవరు వాల్మీకిహృదయమును సంతృప్తికరముగా వ్యాకరింపలేకపోయిరి. దీనివలన బహురామాయణములు పుట్టుకొనివచ్చినవి. పురాణములయందలి రామాయణములు భిన్నభిన్నముగా నగుపించుచున్నవి. ఒకరకముగా నీయన్నియు వాల్మీకిరామా యణకథాసందర్భములందలిసమస్యలకు పరిష్కారభూతములే. దిద్దుబాటు లగు నట్టివే. సనాతనసంప్రదాయవాదులు ఈ కథాభేదముల కన్నింటికి చెప్పుసమాధాన మొక్కటే. ఆయాకల్పభేదములనుబట్టి యట్టియట్టికథాభేదములు సంభవ మని "కల్పభేదం పురస్కృత్య కథా భేదం జగాదహ".

సరే దానిపైన మన మడుగు ప్రశ్న యొకటున్నది. అయినచో వానితో మాకు నిమిత్తములేదు. అది యొప్పికొందము. మఱి రామాయణమందలి కథా సమస్యలకు సమాధాన మేమిః అని. దానికి సమాధానము లేదు. ఆలోచన లేదు. అది అట్లు జరిగిన దంతే. అది యట్లే ఎందుకు జరిగిన దని ప్రశ్న. ఈ ప్రశ్న ఎవనికి పుట్టునో, వాడు మహాకావ్యమును చదువుట కర్హుడు. ఈ ప్రశ్న పుట్టించు కొని సమాధానమును ఆకథలోనే వెదుకవలయును. ఆకావ్యమునందే వెదుకవల యును. మహాకావ్యపాఠకుని లక్షణ మట్లుండవలెను. అట్లుగాక శైలీగతములైన ప్రసాదమాధుర్యాది లక్షణములను కొన్నిరమణీయములైన యూహలను రసభా వౌచిత్యాది, కావ్యలక్షణములను పట్టుకొని యానందించువాడు నిజమైన భావుకుడు కానేరడు. తలస్పర్శిగా మునిగి యచ్చట నున్న యనర్ఘరత్నములను వెలికి తెచ్చువాడే నిజమైన పాఠకుడు. తక్కినవారు యథాశక్తిపాఠకులు. నేను చెప్ప వచ్చిన దేమనగా వాల్మీకిరామాయణవిషయమున న్నేరు నిట్టి యథాశక్తిపక్ష పతితులే యని.

తత్త్వవివేచన మట్లుంచి కథావిషయకముగా నధ్యాత్మరామాయణము

వాల్మీకీయకథకు కొన్నివ్యాఖ్యానములు చేసినది. కొన్నిమార్పులు చేసినది. కొన్ని చేర్పులు చేసినది. మొదటిది రసవిషయము. వాల్మీకిరామాయణమున రసము కరుణము. శ్రీరాముడు తాను నిత్యశుద్ధబుద్ధముక్తస్వరూపమైన పరబ్రహ్మ స్వరూపుడ నను ప్రత్యభిజ్ఞ కలవాడై నచో రామాయణమున కరుణరసము వ్యజ్యమాన మనుటకు వీలులేదు. రసములు, శృంగారహాస్యకరుణాద్భుతవీర రౌద్రభీభత్సభయానకము లెనిమిది. "శాంతోపి నవమో రసః" యని చెప్పినను, అదిసర్వరసాశ్రయభూత మైనది. కావున సర్వరసములందు పరోక్షముగా నను భూయమానమగుచుండునట్టిదే. కావున చెప్పకున్నను బాధ లేదు. సంసారచక్ర పతితు డైన జీవునికి వానిమనఃప్రవృత్తినిబట్టి యీశ్వరానుభూతిని అందీఅంద నట్లుగా చిత్రించుట కావ్యమునకు ధ్యేయము. ఇట్టియనుభూతిని అట్టిలౌకికభాషలో నందిచ్చుట.కావున శబ్దార్థములు వ్యంజక మగుట, అనుభూతి వ్యంగ్య మగుటయు. మానవ స్వభావపరిజ్ఞాతయైన వానికిగాని వ్యంజకభావలక్షణ మవగతము గాదు. కావున శ్రీరాముడు డవతారపురుషుడై నను మానవుడై ప్రవర్తింపక రసము లేదు. అందుచేత వాల్మీకిరామునియం దీ మానవతాలక్షణమును సంపూర్ణముగా పెట్టినాడు. ధర్మమూర్తిగా చిత్రించి, లక్ష్యభూతుని జేసినాడు. రాముడు ధర్మమూర్తి కర్తవ్యపరాయణుడు. ఈ కర్తవ్యపరాయణత్వమునకు అభిషేక భంగము, వనవాసము, సీతావియోగము మొదలైన కష్టము లనుభవించుట యనివార్య మగుటలో రసబీజ మున్నది. ఇచ్చటినుండి కరుణరసము పుట్టు చున్నది. రామునకు స్వరూపప్రత్యభిజ్ఞ యున్నచో ఇవి కష్టములు కావు. వట్టిలీల లగును. అప్పుడు వానియందు రసలక్షణ ముండదు. వాల్మీకీయమునందు కావ్యత్వ ముండదు. కావున రాముడుభగవంతుడయ్యు, మానవుడే. రామాయణము ఈశ్వరలక్షణమును వ్యాకరించునట్టి దయ్యును కావ్యమె. అది కావ్యమార్గమున నీశ్వరలక్షణమును వ్యాకరించినట్టిది.

అధ్యాత్మరామాయణమున పార్వతి యీ విషయమునే ప్రశ్న రూపమున వ్యాకరించినది.

"వదంతి కేచి త్పరమోపి రామః స్వావిద్యయా సంవృత మాత్మసంజ్ఞమ్
జానాతి నాత్మానమతః పరేణ సంబోధితో వేదపరాత్మతత్త్వమ్."
"యది స్మ జానాతి కుతో విలాపః సీతాకృతేఽనేన కృతః పరేణ
జానాతి నైవమ్ యది కేనసేవ్యః సమో హి సర్వై రపి జీవజాతైః"

రాముడు పరమేశ్వరు డైనప్పటికిని తన యజ్ఞానముచేత కప్పబడినవాడై తన స్వరూప మెఱుగడు. కావుననే యితరులైన వశిష్ఠాదులచేత ప్రబోధితుడై తాను పరబ్రహ్మ స్వరూపుడ నని తెలిసికొనెను. అతడు తా నాత్మ స్వరూపు డని తెలిసికొన్నచో రావణాపహృత యైన సీతకొఱకు దుఃఖించుట యెందులకు? కాదయ్యా తెలియకపోయినచో తక్కిన యందఱి జీవుల వంటివాడే యందువా మఱి యప్పు డత డెట్లు సేవ్యు డగును ?

ఈ ప్రశ్నకు వాల్మీకీయమునుబట్టి చెప్పవలసిన సమాధానము వేఱు. దానికి నే నిచ్చట సమాధాన మొసంగుట ప్రసక్తము గాదు అధ్యాత్మ రామాయణమున నీ ప్రశ్నకు శంకరుడు సమాధాన మొసంగినాడు.

"నాహో న రాత్రిః సవితు ర్యథా భవేత్ ప్రకాశరూపా వ్యభిచారతః క్వచిత్
జ్ఞానం తథాజ్ఞాన మిదం ద్వయం హరే -రామే కథం స్థాస్యతి శుద్ధచిద్ఘనే."
"తస్మాత్పరానందమయే రఘూత్తమే విజ్ఞాన రూపే హి న విద్యతే తమః
అజ్ఞాన సాక్షి ణ్యరవిందలోచనే మాయాశ్రయత్వా న్న హి మోహకారణమ్."

సూర్యుని ప్రకాశ మెప్పుడును విడువదు. కాన నతనికి రాత్రింబవళ్ళు లేవు. అట్లే శుద్ధజ్ఞానఘనుం డగు పరమేశ్వరు డైన శ్రీరామునియందు జ్ఞానాజ్ఞానములు నెట్లుండును. పరానందమయుడు విజ్ఞాన స్వరూపుడు. అజ్ఞాన సాక్షియు నగు రామునియందు అజ్ఞాన ముండనేరదు. ఆయన మాయకాశ్రయుడు కాని మాయాపరిచ్ఛిన్నుడు కాదు. కావున దానిచేత మోహితుడు కానేరడు. ఈ సమాధానముతో రామునియందు కరుణ రసాశ్రయత్వ మెగిరిపోయినది. రామకథయందు కావ్యత్వ మెగిరిపోయినది. మిగిలిన దేమి? రామచరితము భగవల్లీల యగుట. తత్త్వవివేచనపర మగుట.

"పురారిగిరి సంభూతా" యన్న శ్లోకమునందు నిర్దిష్టమైన యంశ మిదియే. ఇట్లు ఒక కథయందలి ప్రధానాప్రధాన విషయములు, ప్రకట నిగూఢ విషయములు, వివృత సంవృత విషయములు. రెండవ కథయందు తారుమారగుట సంభవించినది.

శంకరుడనును.

"రామో న గచ్ఛతి న తిష్ఠతి నానుశోచ త్యాకాంక్షతే త్యజతినో న కరోతి కించిత్

ఆనందమూర్తి రచలః పరిణామహీనో మాయాగుణా ననుగతో హి తథా
విభాతి''

రాముడు కదలడు. నిలుచుండడు. దుఃఖింపడు. ఆకాంక్షింపడు, త్యజింపడు. ఇంకే పనియు చేయడు. ఆయన యానందమూర్తి, నిశ్చలుడు; షడ్భావ వికారములు లేనివాడు. త్రిగుణాత్మకమైన మాయ కాధారభూతుడై మాయచే ననుగతుడై యట్లు, అనగా నన్నిపనులు చేయుచున్నట్లు భాసించును. అయినచో అయోధ్యానగరమందలి జన్మ విశ్వామిత్ర సహాయత్వము వన గమనాదికమైన కర్మములన్నియు నిజమున కెవరు చేసినట్లు. సీత హనుమంతునితో చెప్పును.

''ఏవ మాదీని కర్మాణి మయైవాచరితా న్యపి
ఆరోపయంతి రామేస్మి న్నిర్వికారేఽఖిలాత్మని.''

ఈ పనులన్నియు నేను చేసినప్పటికిని నిర్వికారుడు నఖిలాత్ముడు నైన రాముని యందు అజ్ఞాను లారోపించుచున్నారు. అని.

రాముడు పరబ్రహ్మ స్వరూపుడు. సీత ప్రకృతి స్వరూపము. బ్రహ్మము నిర్వికారము పరిపూర్ణము నిశ్చలము సచ్చిదానంద స్వరూపము కాబట్టి, కర్తృ కారక లక్షణము దానియందు లేదు. అది నిష్క్రియము. ప్రకృతి జడము కాబట్టి సంకల్ప వికల్పములు దాని యందు పొసగవు. కావున దాని యంత నదియు క్రియారహితము. అసలు దానికి దానియంతట సత్త్వమే లేదు. కావున రెండును స్వతంత్రముగా కార్యకారులు గావు. మఱి పరబ్రహ్మ సన్నిధానమున ప్రకృతి కార్యకారిణి యని చెప్పవలెను. ప్రకృతియందు బ్రహ్మము ప్రతి బింబించినది జలమునం దాకాశము ప్రతిబింబించినట్లు. జలగతమైన చలనము ప్రతిబింబగతమై కన్పించును గదా! కాని బింబము కాని ప్రతిబింబము కాని కదలుచున్న వనుట కుదురదు. చలనము జల లక్షణమే. ఇదియే హనుమంతునికి సీత చెప్పును.

''రామం విద్ధి పరంబ్రహ్మ సచ్చిదానంద మద్వయం
సర్వోపాధి వినిర్ముక్తం సత్తామాత్ర మగోచరమ్
ఆనందం నిర్మలం శాంతం నిర్వికారం నిరంజనం
సర్వవ్యాపిన మాత్మానం స్వప్రకాశ మకల్మషమ్.''
''మాం విద్ధి మూలప్రకృతిం సర్గస్థిత్యంతకారిణిం
తస్య సన్నిధి మాత్రేణ సృజా మీద మతంద్రితా

తత్సాన్నిధ్యా న్మయా సృష్టమ్ త స్మి న్నారోప్యతే౽బుద్ధైః''

పూర్వము చెప్పిన ప్రతిబింబ స్థానమున మూడు ఆకాశము లున్నవి. ఒకటి మహాకాశము. రెండు జలస్థానగత మైన ఆకాశము. మూడు జలమునందు ప్రతి బింబించిన ఆకాశము. ఇప్పు డీ జలగతమైన చలనము భాసించినది ప్రతిబింబ రూపమైన యాకాశమునందు. జల మావరించియున్న యాకాశమందు కాని, మహాకాశమునందు కాని, ఈ చలనము భాసింపదు. ఇట్లే బుద్ధి స్థానమందలి చైతన్య మొక్కటి. పరిపూర్ణ మైన చైతన్య మొకటి. బుద్ధియందు ప్రతి బింబించిన చైతన్య మొకటి. ఇప్పుడు ఈ బుద్ధియందు ప్రతిబింబించిన చైతన్యమునకు కార్యకారిత్వము. ఈ రెండింటికి గల ముడియే జీవగ్రంధి. ఈప్రతి బింబమునకు వాస్తవమునందు స్థితి లేదు. దీని కున్న స్థితి సాంక్రామిక మైనది. అసత్య మైనను సర్వవ్యాపక మైన సత్స్వభావముచేత దీనికి సత్యత్వము సంక్రమించినది.

సత్యాసత్యే మిథునీకృత్య లోక వ్యవహారః ప్రవర్తతే.

ఈ ప్రతిబింబము మృష యని బుధ్యవచ్ఛిన్న మైన చైతన్యము వికల్పమాత్ర మేయని, ఈ రెండును అవిచ్ఛిన్న మైన, పూర్ణ చైతన్యముతో నభిన్నము లని తత్త్వమస్యాది మహావాక్యములవలన గ్రహింపబడినప్పుడు ఈ జీవగ్రంధి విడిపోయి ఈ అవిద్య స్వకార్యముతో కూడ నశించును. ఇదియే ముక్తి.

ఆకాశస్య యథా భేద స్త్రివిధో దృశ్యతే మహాన్
జలాశయే మహాకాశ స్తదవచ్ఛిన్న ఏవ హి
ప్రతిబింబాఖ్య మపరం దృశ్యతే త్రివిధం నభః
బుధ్యవచ్ఛిన్న చైతన్య మేకం పూర్ణ మథాపరం
ఆభాస స్త్వపరం బింబభూత యేవం త్రిధాచితిః
సాభాసబుద్ధేః కర్తృత్వ మవిచ్ఛిన్నే అవికారిణి
సాక్షిణ్యారోప్యతే భ్రాంత్యా జీవత్వం చ తథా బుధైః
ఆభాసస్తు మృషా బుద్ధి రవిద్యాకార్య ముచ్యతే
అవిచ్ఛిన్నం తు తద్బ్రహ్మావిచ్ఛేదస్తు వికల్పతః
అవిచ్ఛిన్నస్యపూర్ణేన ఏకత్వం ప్రతిపాద్యతే
తత్త్వమస్యాదివాక్యైశ్చ సాభాసస్యాహమ స్తథా

ఐక్యజ్ఞానం యదోత్పన్నం మహావాక్యేన చాత్మనోః
తదావిద్యా స్వకార్యైశ్చ నశ్యత్యేవ నసంశయః

సంగ్రహముగా నిది సర్వోపనిషత్తులకు సారభూతమైన విషయము. దీనిపైన సందేహములు సమాధానములు, వివరణములు, చర్చలు ఖండనమండనములు ననంతముగా చెలరేగి శాస్త్రములు విజృంభించినవి. ఈ విషయము వాల్మీకి రామాయణమునందు చాలా లోతుగా నిక్షిప్తమైనది. అధ్యాత్మ రామాయణమున దీనిని మూల స్థంభము చేసి, రామకథ యీ దీనికి వ్యాఖ్యాభూతముగా చిత్రింపబడినది. కావున నా ఘట్టము లట్లు వ్యాకృతము లైనవి. ఒకటి రామాది జన్మ ఘట్టము. వాల్మీకీయమునందు దశరథుడు పాయసమునం దర్ధ భాగమును కౌసల్య కిచ్చును. మిగిలిన దానియం దర్ధభాగము సుమిత్ర కిచ్చును. కడమ దాని యం దర్ధ భాగమును కైకేయి కిచ్చును. మిగిలినదానిని తిరిగివచ్చి సుమిత్ర కిచ్చును. ఇప్పుడు పాయసమునందలి భాగములు రాజు భార్యలకు లభించిన తీరిది- పాయసమందలి సగము కౌసల్యకు నెనిమిదింట మూడువంతులు సుమిత్రకు, ఎనిమిదింట నొకవంతు కైకేయికి లభించినవి.

ఈ సందర్భమున వాల్మీకీయమున జన్మఘట్టమున నున్న శ్లోక మొకటి.

తతః పద్మపలాశాక్షః కృత్వాత్మానం చతుర్విధమ్
పితరం రోచయామాస తదా దశరథం నృపం,
కౌసల్యాయై నరపతిః పాయసార్థం దదౌ తథా.
అర్ధాదర్థం దదౌ చాపి సుమిత్రాయై నరాధిపః
కైకెయ్యై చావశిష్టార్థం దదౌ పుత్రార్థ కారణాత్
ప్రదదౌచావశిష్టార్థం పాయస స్యామృతోపమమ్.
అనుచింత్య సుమిత్రాయై పునరేవ మహామతిః
కౌసల్యా జనయద్రామం దివ్యలక్షణసంయుతం
విష్ణో రర్ధం మహాభాగం పుత్ర మైక్ష్వాకునందనం
భరతోనామ కైకేయ్యామ్ జజ్ఞే సత్యపరాక్రమః
సాక్షాత్ విష్ణోః చతుర్భాగః సర్వై స్సముదితో గుణైః
అథ లక్ష్మణశత్రుఘ్నౌ సుమిత్రా జనయత్ సుతౌ
వీరౌ సర్వాస్త్ర కుశలౌ విష్ణోరర్ధ సమన్వితౌ.

ఈ శ్లోకములనుబట్టి విష్ణుమూర్తి తన్ను నాల్గుభాగములు చేసుకొని

దశరథునియందు ప్రవేశించెను. దశరథుడు పాయసమును పూర్వము చెప్పినట్లు పంచియిచ్చెను. మఱి పుత్రులు పుట్టినతీ టిది. విష్ణువునం దర్ధభాగము రాముడై పుట్టెను. చతుర్థభాగము భరతుడై పుట్టెను. అర్ధభాగము లక్ష్మణశత్రుఘ్నులై పుట్టిరి. జన్మఘట్టమునందలి ఈ మూడంశములకు ఏకవాక్యత కుదురుట లేదు. విష్ణువు తన్ను భాగించుకొన్నతీఱు వేఱు. రాజు పంచియిచ్చినతీఱు వేఱు. వారి యందున్న విష్ణ్వంశల తీఱు వేఱు. మఱియొకటి. రాము డర్ధము, భరతుడు నాల్గవవంతు, లక్ష్మణశత్రఘు లర్థము, వెరశి ఒకటి కావలసినది, $1\frac{1}{4}$ అగు చున్నది. దీనికి పరిష్కారమేమి. లోతుగా జాగరూకముగా విచారించినగాని తెలియునట్టిదికాదు. రామాయణముయొక్క ముందుకథయంతయు దీనిపై నాధార పడియున్నది.

అధ్యాత్మరామాయణమున రాజు పాయసమును కౌసల్యాకైకేయిలకు చెఱి సగము పంచియిచ్చును. తరువాత నచ్చటకు సుమిత్ర వచ్చును. ఆమెకు వారిద్దరు తమతమ భాగములనుండి సగముసగమిత్తురు. ఇప్పుడు సుమిత్రకు రెండుభాగ ములు కౌసల్యాకైకేయులకు ఒక్కొక్కభాగము లభించినది.

వశిష్ఠ ఋష్యశృంగాభ్యాం అనుజ్ఞాతో దదౌ రవిః
కౌసల్యాయై స కైకేయ్యై అర్ధమర్ధం ప్రయత్నతః
తతః సుమిత్రా సంప్రాప్తా జగృధ్నుః పౌత్రికం చరుం
కౌసల్యాతు స్వ భాగార్ధం దదౌ తస్యైముదాన్వితా
కైకేయీ చ స్వభాగార్ధం దదౌప్రీతి సమన్వితా

లక్ష్మణుడు రాము ననుసరింప నేల. శత్రఘ్నుడు భరతు ననుసరింప నేల నన్న ప్రశ్నల కిందు సమాధాన మున్నది. ఇంతేకాక లక్ష్మణుడు శేషునియొక్క యవతార మని, భరతశత్రఘ్నులు శంఖ చక్రముల యవతారము లని యధ్యాత్మ రామాయణమం దున్నది.

శేష స్తు లక్ష్మణో రాజన్ రామయేవాన్వవద్యతా
జాతౌ భరతశత్రుఘ్నౌ శంఖచక్రే గదాభృతః
యోగమాయాపి సీతేతి జాతా జనకనందినీ

అహల్యాశాపవిమోచనమందు వాల్మీకీయమున నున్న శాపములతీఱు వేఱు. అచ్చట గౌతము డింద్రుని విఫలుడవు కమ్మని శపించెను. భార్యను వేయి సంవత్సరములు వాతభక్షయు, నిరాహారయు, భస్మశాయియునై, భూతముల

కదృశ్యయై తపింపుమని శపించెను. అధ్యాత్మరామాయణమునందు

'యోనిలంపట దుష్టాత్మన్ సహస్ర భగవాన్ భవ' యని యింద్రుని, అహల్యను ఒకశిల నాశ్రయించి తపింపుమని శపియించెను. వేలసంవత్సరములైన తరువాత తదాశ్రయశిలను రాముడు పాదతాడనము చేయగా శాపమోక్షణ మగునని నిర్దేశించెను. లోకమునందు ఈ అహల్యావృత్తాంతము అధ్యాత్మరామాయణమునుబట్టియే బహుళ ప్రచారము గాంచినది. కైకేయి వరదానఘట్టము. రామాయణమున దేవాసురయుద్ధమున దశరథుడు కైకేయితోడ దేవతలకు సహాయము చేయబోయి యుద్ధమునందు రాక్షసులచే శస్త్రాస్త్రప్రహరణముల నొంది మూర్ఛితుడు కాగా కైకేయి యుద్ధభూమినుండి దశరథుని తప్పించి కొనిపోయి రాజు ప్రాణములను కాపాడినది. యుద్ధభూమికి వెలుపలకూడ రాక్షసులనుండి రాజును కాపాడినది. ఇట్లు రెండుమాఱులు కాపాడినందున రెండు వరములను రా జొసగినట్లున్నది.

అధ్యాత్మమున దేవాసురయుద్ధమున రథచక్రము శీలపడిపోగా దాని స్థానమున తనవ్రేలినుంచి చక్రము జాఱిపోకుండ కాపాడినందున రాజు వరమొసింగినట్లున్నది. లోకమునందు ప్రచురితముగ నున్నకథ కూడ నిదియే. వాల్మీకీయమున మంథర కైకేయికి దుర్బోధయొనర్చుటకు గల కారణము దాని దౌరాత్మ్యమే యన్నట్లు కన్పించును.

సా దహ్యమానా క్రోధేన మంథరా పాపదర్శినీ
శయానా మేవ కైకేయీ మిదం వచన మబ్రవీత్

కైకేయికూడ ఈపాపనిశ్చయమున కొడంబడుటకు హేతు వున్నేయముగా కన్పించుచున్నది. భరద్వాజునికి తనతల్లిని చూపించి భరతుడు దూషణములాడినపుడు భరద్వాజు డనును.

నదోషేణావగంతవ్యా కైకేయీ భరత త్వయా
రామప్రవ్రాజనం హ్యేతత్ శుభోదర్కం భవిష్యతి
దేవానాం దానవానాం చ ఋషీణాం భావితాత్మనాం
హిత మేవ భవిష్యద్ధి రామప్రవ్రాజనాదిహ.

ఈ భరద్వాజుని మాటలయందు కైకేయి నిర్దోషిత్వము లోతు గానిక్షిప్తమైయున్నది. అధ్యాత్మమున

'ఏతన్నస్మిన్నంతరే దేవీం వాణీ మచోదయన్

గచ్ఛ దేవీ భువోలోక మయోధ్యాయాం ప్రయత్నతః
రామాభిషేక విఘ్నార్థం యతస్వ బ్రహ్మ వాక్యతః
మంథరాం ప్రవిశ స్వాదౌ కైకేయీం చ తతః పరం
తతో విఘ్నే సముత్పన్నే పున రేహి దివం శుభే.
తదేత్యుక్త్వా తథా చక్రే.

అని యున్నది. దీనివలన కుబ్జకాని, కైకేయిగాని యట్లు ప్రవర్తించినట్లు స్పష్టమగుచున్నది. మఱియు రాముని పదునాల్గేండ్లుమాత్రమే యరణ్యావాసమునకు పంపనేల. దీనికి రామాయణమునందు ప్రజ లీ పదునాల్గేండ్లలో రాముని మఱచి భరతునియం దనురక్తు లగుదు రని కుబ్జ చెప్పినట్లున్నది. మఱియు కైకేయి భరతుడు పదునాల్గేండ్లు మాత్రమే రాజుగా నుండవలె నని కోరినట్లు లేదు.

అనేనైవాభిషేకేణ భరతో మేఽభిషిచ్యతాం
నవపంచచవర్షాణి దండకారణ్య మాశ్రితః
చీరాజినధరో ధీరో రామో భవతు తాపసః
భరతో భజతా మద్య యౌవరాజ్య మకంటకం"

ఇందు భరతుడు పదునాల్గేండ్లు మాత్రమే యువరాజుగా నున్న చాలునన్న యర్థ మనునీయమానముగా నున్న దనవచ్చును. మఱి పదునాలుగేండ్ల తరువాత రాముడు తిరిగివచ్చినచో నప్పటి మాట యేమి. దీనికి సమాధానము వాల్మీకీయమునం దున్నేయముగా నున్నది. అధ్యాత్మమునందు కైకేయి యీ వరముల నిట్లే కోరి "పునరాయాతు తస్యాంతే వనేవా తిష్ఠతు స్వయా" అని కైకేయి యీ పదునాల్గేండ్లపైన రాముడు వచ్చుటయో రాకపోవుటయో యతని యిచ్ఛాధీన మని చెప్పను. అధ్యాత్మమున వశిష్ఠుడు ప్రాయోపవిష్టుడైన భరతునికి దేవరహస్య మంతయు చెప్పివేయును.

వత్స గుహ్యం శృణు ష్వేదం మమవాక్యా త్సునిశ్చితం
రామాయణ స్సాక్షాత్ బ్రహ్మణా యాచితః పురా
రావణస్య వధార్థాయ జాతో దశరథాత్మజః
యోగమాయాపి సీతేతి జాతా జనకనందినీ
శేషోపి లక్ష్మణో జాతో రామమన్వేతి సర్వదా
రావణం హంతు కామా స్తే దమిష్యంతి నసంశయః
కైకేయ్యా వరదానాది యద్య నిష్ఠురభీషణం

సర్వం దేవకృతం నోచే దేవం సా భాషయే త్కథం
తస్మాత్య జాగ్రహం తాత రామస్య వినివర్తనే

తరువాత భరతుడు రాముని పాదుకలు తీసికొని తిరిగి పోవును. ఇట్లనేక ఘట్టములకు పరిష్కారములు అధ్యాత్మమున చూపింప బడినవి. ఇట్లు వ్రాసికొని పోయినచో తేలదు. కాని యిచ్చట యన్నింటికంటె ప్రధానమైన సీతాపహరణ ఘట్టము నుదాహరించి, చర్చింపక తప్పదు.

సీత నపహరించుకొని పోవుటలో రావణుడు పన్నిన యుపాయము, దాని యొక్క స్వరూప మేమి? మారీచుడు లేడియై పోయి సీత నాకర్షింపవలెను. సీత యాకృష్టురాలై దానిని పట్టితెమ్మని రాము నడుగును. రాముడు దానివెంట పడును. అప్పుడు మారీచుడు రాము నెలయించికొని దూరభూమికి కొనిపోవల యును. అచ్చట రాముడు బాణముతో గొట్టును. రాముని గొంతుకతో మారీచుడు లక్ష్మణుని పిలుచును. అపుడు రాముని కాపద కల్గిన దని, సీత లక్ష్మణు నతని కొఱకు బొమ్మనును. అపుడు సీత యొంటరిగా నుండును. రావణు డామె నెత్తు కొని పోవచ్చును. ఇది రావణుని పన్నాగము ఇది యెట్లు జరుగగలదు. ఒక పన్నాగము పన్నినచో దానిని నిర్వహించుట నెవరి చేతిలో నుండవలెను. ఇప్పు డీ పన్నాగమునందు మారీచుడు లేడి యగుట తొలి భాగము. రావణుడు, సీత నెత్తుకొని పోవుట తుది భాగము.

ఈ మొదలి తుది యంశములు మాత్రమే రావణుని చేతియం దున్నవి. తక్కిన పన్నాగమంతయు ఎదుటి కక్ష్యవారు నిర్వహింపవలెను. మారీచుడు లేడియై పోవును. సీత యాకృష్టురాలు కాలేదు. అపు డీపన్నాగమేమి యగును. ఒకవేళ యాకృష్టురా రాలైనచో రాముని నడుగవచ్చును. రాముడు కూడ నట్టి లేడి యుండు నని భ్రమపడవలెను. అది సంభవము కాదు. లక్ష్మణుడు సందే హింపవచ్చును. రామునికి చెప్పవచ్చును. ఇవి యన్నియు వదలి రాముడు మాయ లేడి వెంట పడుననుకొందము. లేడి యెలయించు ననుకొందము. అపుడు రాముని వద్ద నెన్ని యస్త్రములు లేవు. ఒక యస్త్రముచే దానిని కట్టివేయవచ్చును. లేదా శరపంజరమునందు బంధింపవచ్చు. దూర దేశమునకు కొంపోయినను రాముడు కొట్టుటయు, దాని నోటివెంట కేకవచ్చుటయునా? వచ్చినను ఆసమయమున రాముని గొంతుకతో వచ్చునా? లక్ష్మణుడుగాని సీతగాని రామపరాక్రమమును సందేహించి, రాముని కాపదకల్గు నని యనుకొందురా? ఈ యన్నియు నట్లుంచి

లక్ష్మణుడు సీత నొంటరిగా నేల వదలి పోవలెను. ఆమెనుకూడ తనతోపాటు తీసికొని పోవచ్చును. లేదా రక్షోఘ్నమైన నొకయస్త్రము నభిమంత్రించి యామెకు రక్షకముగా నిల్పి పోవచ్చును. ఇది యేమి పన్నాగము ? కాని దీనిపైన రామాయణ కథయంతయు నాధారపడియున్నది. ఈ యంశములలో నే యొకటి జరుగకపోయినను రామాయణమేలేదు. మఱి యిది జరిగినది. ఎందుకు జరిగినది? దీనికి సంభవత యెట్లు. ఇది రామాయణమందలి ముఖ్యమైన సమస్య. దీనికి సమాధానము రామాయణమును మొదటినుంచి తుదిదాక బహు జాగరూకముగ ననేక పర్యాయము లధ్యయనము చేసినగాని యవగతము గాదు. ఈ సమస్య నుత్తరించుటకు పలువురు పలువిధముల ప్రయత్నములు చేసిరి. భాసుడు మొదలైన పూర్వ మహాకవులు, దీనిని మార్చి ప్రదర్శించిరి. భాసుని ప్రతిమానాటకమందు, పితృశ్రాద్ధదినమున సన్యాసి వేషమున రావణుడు వచ్చి, హిమాలయ పర్వతప్రాంతమునందలి కనకమృగమాంసమును పెట్టినచో పితృదేవతలు తృప్తులగుదు రని చెప్పుచుండగా నచ్చటకు మారీచుడు లేడియై వచ్చుట, రాముడు దానివెంటపడుట జరుగును. ఈ మార్పులందు రాముడు లేడివెంట పడుటకు సమాధాన మున్నదిగాని తక్కిన ప్రశ్నలకు లేదు.

అధ్యాత్మమునందు

అథ రామోపి తత్సర్వం జ్ఞాత్వా రావణచేష్టితం
వాచా సీతా మేకాంతే శృణు జానకి మే వచః
రావణో భిక్షురూపేణ ఆగమిష్యతి తేఽంతికం
త్వం తు ఛాయాం త్వదాకారాం స్థాపయి త్వోటజే విశ
అగ్నా వదృశ్య రూపేణ వర్షం తిష్ఠ మమాజ్ఞయా
రావణస్య వధాంతే మాం పూర్వ వత్ప్రాప్స్యసే శుభే.
శ్రుత్వా రామోదితం వాక్యం సాపి తత్ర తథాఽ కరోత్
మాయాసీతాం బహిః స్థాప్య స్వయం మంతర్ధధేఽనలే

ఇచ్చట రాముడు తెలిసి తనంతట తానే రావణుని పన్నాగములోనికి పోయిన ట్లున్నది. మఱి లేనిచో రావణుని చంపుటకు వీలులేదు. రావణునకుకూడ మారీచుడు రాముడు పరమేశ్వరుడు రాక్షస హరణమునకై నిన్ను చంపుటకై బ్రహ్మచేత ప్రార్థింపబడి భూభార హరణార్థమై పుట్టినాడు. కాబట్టి నీవు పిచ్చి వేషములు వేయక నింటికి బొమ్మని హితము చెప్పినపుడు రావణు డనును.

పరమాత్మా యథా రామా ప్రార్థితో బ్రహ్మణా కిల
మాం హంతుం మానుషో భూత్వా యత్నా దిహసమాగతః
కరిష్యత్యచిరా దేవ సత్య సంకల్ప ఈశ్వరః
అతోహం యత్నతః సీతా మానేష్యా మ్యేవ రామవాత్.

రాముడు నారాయణుడే యైనచో నన్ను చంపుటకే పుట్టినచో చంపకుండ నెట్లుండును. అందుకే తప్పకుండ సీత నపహరించెద నన్నాడు.

మఱి యీ సీత నపహరించి రావణు డేమి చేసినాడో చూడుడు.

స్వాంతఃపురే రహస్యే తా మశోక విపినేఽక్షిపత్
రాక్షసీభిః పరివృతాం మాతృబుద్ధ్యా స్వపాలయత్

రావణుడు సీతను నెడమ చేతితో జుట్టుపట్టుకొని కుడిచేతితో నూరువులు పట్టుకొని తీసికొని పోయినట్లు వాల్మీకీయమునం దున్నది. 'వామేన సీతాం పద్మాక్షీం మూర్ధజేషు కరేణసః, ఊర్వోస్తు దక్షిణేనైవ పరిజగ్రాహ పాణినా.' అధ్యాత్మమున ఆమె నిలుచుండిన భూమిని పెల్లగించుకొని రథమునం దిడుకొని, పోయినట్లున్నది. ఛాయాసీతకు కూడ రావణుని కరస్పర్శ తగులకుండ జాగరూకత వహించినాడు కవి. మఱి నిజమైనసీత అగ్నియందు ప్రవేశించినది. రావణ వధాంతమున నీ మాయసీత యగ్నిలో ప్రవేశించును. సత్యసీత యగ్నినుండి బయటకు వచ్చును. ఇది యీ కల్పనయందలి సొగసు. సీతను రావణుడు తల్లి వలె చూచినాడట. మఱి యామె నెందుకు కొనిపోయినట్లు. రావణు డనును.

జానామి రాఘవం విష్ణుం లక్ష్మీం జానామి జానకీం
జ్ఞాత్వైవ జానకీ సీతా మయానీతా వనా ద్బలాత్
రామేణ నిధనం ప్రాప్య యాస్యా మీతి పరంపదం
పరానందమయీ శుద్ధా సేవ్యతే యా ముముక్షుభిః
తాంగతింతు గమిష్యామి హతో రామేణ సంయుగే
ప్రక్షాళ్య కల్మాషాణీహ ముక్తిం యాస్యామి దుర్లభాం
క్లేశాది పంచగతరంగయుతం భ్రమాఢ్యం
దారాత్మ జాప్త ధనబంధు ఝషాభియుక్తం
ఔర్వానలాభ నిజరోష మనంగజాలం
సంసారసాగరమతీత్య హరిం వ్రజామి
ఇది రావణుని హృదయము.

రావణుడు విరక్తుడు. మోక్షేచ్ఛ గలవాడు. వానికి రాముడు పరమేశ్వరుడని తెలియును. జానకి లక్ష్మి యని తెలియును. వారు తన్ను చంపుటకై పుట్టినారని తెలియును. ఇన్నియు తెలిసి తదభిముఖముగా నతడు నడచెను. అతడు వైరయోగి. మహాభక్తుడు. ఇది యీఘట్టమున కిందలి పరిష్కారము. కథా విషయకముగా అధ్యాత్మమునందలి మార్పులే జనబాహుళ్యమునందు ప్రచారము నందున్నవి. వాల్మీకి వ్రాసిన తీరుగా రామాయణ కథ, ఇంత బహుళ ప్రచారము నంది యుండలేదు. ఈ మార్పులన్నియు సుసగంతములా కాదా యన్న ప్రశ్నకు నిట తావు లేదు. ఆధ్యాత్మికతత్త్వ ప్రతిపాదనమునకై ఈ మార్పు లిట ప్రసక్తములయ్యె నని మాత్రమే ప్రస్తుత విషయము. ఈ గ్రంథమునందు బాలకాండయందలి రామహృదయమును, ఉత్తరకాండయందలి రామగీతయును తత్త్వ ప్రతిపాదన విషయమున మిక్కిలి ప్రాముఖ్యము వహించియున్నవి. రామగీతయందు అద్వైత సిద్ధాంతము శాస్త్రసంప్రదాయానుసారముగ చక్కగా నిరూపితమైనది.

కర్మవల్ల శరీరము, శరీరమువలన కర్మ ఇది యొకచక్రము. మూలభూతమైన యజ్ఞానమువలన నిది కలిగినది కాన నిది యజ్ఞానమును తొలగింపనేరదు. అజ్ఞాన మనగా యవిద్య. అది జ్ఞానము వలననే తొలగును. అజ్ఞానమునకు మొదటి రూప మావరణ మంటిమిగదా ! ఈ ఆవరణభంగము జరిగినప్పుడు ఈ యజ్ఞానము నష్టమై స్వరూపావగతి కల్గి జీవుడు ముక్తుడగును. కావుననే తైత్తిరీయము న్యాసమును విధించినది. కావున, అజ్ఞానము విద్యవలన తొలగునట్టిది కాని కర్మవలన తొలగునట్టిది కాదు. విద్య యనగా మహావాక్యములయొక్క అఖండర్థావబోధము. ఈశ్వరార్పణబుద్ధితో చేసిన విహితకర్మానుష్ఠానమువలన పరిశుద్ధమైన మనస్సుగలవానికి ఈ ప్రపంచముయొక్క యనిత్యత్వము బోధపడి దానియందు నిర్వేదము కలుగును. వైరాగ్యము కలుగును సర్వము నశ్వర స్వభావము దుఃఖమయము. నిత్యమై సుఖస్వరూపమైన వస్తు వేదిః దాని నెట్లు తెలిసికొనవలయును? ఈ సంసారచక్రమునుండి ఎట్లు ముక్తి పొందవలెను. అని యతనికి యొకతీవ్రమైనకోరిక కలుగును. దీనినే సాధనచతుష్టయమందురు. నిత్యానిత్యవస్తువివేకము, ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము, ముముక్ష, శమాది షట్కసంపత్తి. ఇట్టివాడు గురూపసదనము చేసి యతనియనుగ్రహమువలన మహావాక్యబోధ నంది తత్త్వము గ్రహించి ముక్తుడగును. ఆతత్త్వము జీవాత్మ

పరమాత్మల యొక్య రూపమైనది. ఇది సంగ్రహముగా అద్వైతసిద్ధాంతము. తత్త్వమస్యాది మహావాక్యముల పదార్థ వాక్యార్థ శోధన క్రమము. అందలి సంప్రదాయములు, స్థూల, సూక్ష్మ కారణ దేహములు, వాని యందలి యనుభవములు, జాగ్రత్స్వప్న సుషుప్తులు, విశ్వతైజస ప్రాజ్ఞులు, ప్రణవము, దాని యందలి మాత్రలు, తదర్థ భావనము, ఈ మొదలైన సర్వోపనిషద్రహస్యము లన్నియు నీ రామగీతయందు, కడు నిపుణముగా సంగృహీతములైనవి. కావుననే ఈ రామగీతను లెస్సగా నధ్యయనము చేసినచో నుపనిషత్సిద్ధాంతము కరతలామలకము కాగలదు. ఇదియు శ్రీశ్రీరామ హృదయము రెండును శిష్టలోకమున నిత్యపారాయణ క్రమమునం దున్నవి. దీనిని విడిచి అధ్యాత్మరామాయణమునం దంతటను పట్టినచోటనెల్ల భక్తిజ్ఞాన వైరాగ్య ప్రతిపాదకములగు శ్లోకములు కుప్పతిప్పలుగా గోచరించును. అధ్యాత్మ రామాయణమందు ఆయా కథా సందర్భములందు బహుస్తోత్రములు కలవు. ఈ యన్నియు తత్త్వావేదకములే. ఉపనిషత్సారభూతములే. ఈ గ్రంథము యొక్క మాహాత్మ్యము చెప్ప నలవి కాదు. ఈ స్తోత్రములను పారాయణము చేసినచో బ్రహ్మహత్యాది మహాపాతకములు నశించు నని యాయా సందర్భములందు చెప్పబడియున్నది. ఇందలి బహు శ్లోకములు పండితలోకమున ప్రచారమున నున్నవి. ఈ గ్రంథమునందలి శైలి లలిత మధుర పద భూయిష్ఠమై గంభీరార్థసంయుతమై ప్రసన్న రమణీయమై చెలువారుచుండును.

"సుఖస్య దుఃఖస్య నకోపి దాతా, పరో దదాతీతి కుబుద్ధి రేషా
అహంకరోమీతి వృథాభిమానః, స్వకర్మ సూత్రగ్రథితో హి లోకః"
"సుఖస్యానంతరం దుఃఖం, దుఃఖస్యానంతరం సుఖం
ద్వయమేతద్ధి జంతూనాం, అలంఘ్యం దినరాత్రివత్"
"సుఖమధ్యే స్థితం దుఃఖం, దుఃఖమధ్యే స్థితం సుఖం
ద్వయ మన్యోన్యసంయుక్తం, ప్రోచ్యతే జలపంకవత్"
"తస్మా ద్ధైర్యేణ విద్వాంసః, ఇష్టానిష్టోపపత్తిషు
నహృష్యంతి నముహ్యంతి, సర్వం మాయేతి భావనాత్"

అధ్యాత్మ రామాయణము కాంతాసమ్మితమైన కావ్యము గాదు. మిత్రసమ్మితమైన పురాణము. ఇందు రమణీయమైన కల్పనలకు, నూహలకు. అలంకారములకు,

రసభావ పోషణలకు కథా కథన వైచిత్రీ విశేషములకు శీల చిత్రణములకు, స్వభావ పరిశీలనములకు, గాఢశిథిలబంధములకు దీర్ఘవర్ణనల కీ మొదలైన వానికి స్థానము లేదు. అయినను హృదయావర్జకములైన ఘట్టము లిందు లేకపోలేదు.

అహల్యా శాపవిమోచన మైన తరువాత రామలక్ష్మణులు విశ్వామిత్రు నితో మిథిలకు పోవుచు గంగానది యొద్దకు వత్తురు. అచట నావికుడు శ్రీరాముని పడవ నెక్క వద్దనును.

"క్షాళయామి తవ పాదపంకజం, నాథ దారు దృషదోః కి మంతరం
మానుషీకరణ చూర్ణమస్తి తే, పాదయో రితి కథా ప్రథీయసీ"
"పాదాంబుజం తే విమలం హి కృత్వా, పశ్చా త్పరం తీరమహం నయామి
నోచే త్తరీ సద్యువతీ మలేన, స్యాచ్చే ద్విభో విద్ధి కుటుంబహానిః"

ఓ ప్రభూ! నీ పాదములు కడిగెదను. రాతికి కొయ్యకు నేమి భేదమున్నది? నీ పాదములందు మానుషీకరణచూర్ణ మున్న దని కథ వినబడుచున్నది. అందు చేత నీ కాళ్ళకు దుమ్ము లేకుండ కడిగి పడవ నెక్కించుకొందును. లేనిచో ఈ పడవ యువతిగా మారినట్లైన నాకు ఇంటికి పోవుటకు ప్రాప్తి యుండదు. ఇది చాల చమత్కార మైన సన్నివేశ మగుటయే కాదు. ఈ చమత్కారమునకు వెనుకనుండి యా నావికుని భక్తి భావనము ప్రతీయమాన మగుచున్నది. ఇది చాల రమణీయమైన చిత్రణము.

రాముడు సీత నడవికి తీసికొనిపోనని నిరాకరింపగ సీత యనేక విధముల రామునికి చెప్పిచెప్పి చివరి కిట్లనును.

అన్య చ్చించి త్ప్రవక్ష్యామి శ్రుత్వా మాం నయకాననమ్
రామాయణాని బహుశః శ్రుతాని బహుభి ర్ద్విజైః
సీతాం వినా వనం రామో గతః కిం కుత్రచి ద్వద
అత స్త్వయా గమిష్యామి సర్వథా త్వత్సహాయినీ

ఇంకొక కారణముకూడ కొంచెము చెప్పెదను. అది విని, నన్ను, సీతోకూడ నడవికి తీసికొని పొమ్ము. పలువురు బ్రాహ్మణులవలన బహురామాయణములు వింటిమి గదా! సీతను విడచి రాము డొక్కడే యడవికి పోయిన ట్లే రామాయణ మందైన నున్నదా చెప్పు మన్నది. రామాయణములు తత్పూర్వమే యనేకము లున్నవన్నమాట ప్రతికల్పమునందును రామాయణములు జరుగుచునే యున్న

వన్నమాట. జరిగినను జరుగకపోయినను నిట్టి విశ్వాసము ప్రజలలో ప్రచలిత ముగా లేనిచో నిట్టి కల్పన యుండదు. రామాయణకథయం దున్న భేదములకు సంప్రదాయ వేత్తలు కల్పభేదమును కారణముగా చెప్పుదు రని పూర్వము వ్రాసితిని. సీత దాని నాధారముగా తీసికొని రామునితో నిట్లనుటయే చమత్కారము. సీత యనపాయిని. రాముని విడచి యుండునది కాదు. సీతారాములను విడదీయుట సంభవము కాదు. వారిరువురు ప్రకృతి పురుషులు అని దీనియందలి ధ్వని. ఈ గ్రంథము బ్రహ్మాండపురాణమందలి యుత్తరకాండాతర్గత మని చెప్పుదురు. అందుచేత నిది వ్యాసప్రోక్త మనవలెను. అయినచో అద్వైత సిద్ధాంతమునకు పట్టుగొమ్మయిన యీ గ్రంథమునుండి శ్రీ శంకరులు నొక్క యుదాహరణ మేనియు నీయకపోవుటకు కారణము కన్పించదు. దీనినుండియే కాదు, శ్రీ మద్భాగవతము నుండి గూడ శ్రీశంకరు లుదాహరింప లేదు. మఱి బ్రహ్మాండ పురాణమునుండి బహుశః నుదాహరణములు శ్రీ శంకర భగవత్పాదుల గ్రంథములందు కన్పించును. ఇట్టి కారణములవలన యిదివ్యాసప్రోక్తము కాదని నిర్ధరించుటకును వీలులేదు. ఇది ముముక్షువులకు నిత్య పఠనీయమై మనన యోగ్యమై శిరోధార్యమై చెలువారునట్టి పరమోత్కృష్టగ్రంథ మనుటలో నతిశయోక్తి లేదు.

ఇతిశమ్

# తమిళ, మళయాళ రామాయణాలు

## — డాక్టర్ చల్లా రాధాకృష్ణశర్మ

తమిళ మలయాళ సాహిత్యాలలో తలమానికంగా వెలుగొందుతున్న రస వత్కావ్యం రామాయణం. అంతేకాక ప్రచుర ప్రచారం గడించిన కావ్యాలలో రామాయణానికి పెద్ద పీట లభించింది. కాగా, ఈ రెండుభాషలవారికే రామాయణం ప్రీతిపాత్రమైన కావ్య మని చెప్పడం సత్యసన్నిహితం.

తమిళ సాహిత్య సదనంలో మణిదీపిక వెలిగించిన మనీషి కంబ మహా కవి. ఆయన కవి చక్రవర్తి బిరుదవిరాజితుడు. అలాగే మలయాళ సాహిత్యోద్యానంలో కల్పవృక్ష సదృశమైన కావ్యాన్ని వెలయించిన కవిశేఖరుడు తుంజత్తు ఎళుత్తచ్చన్. ఆధునిక మలయాళభాషాజనకుడుగా ఆయన పేరు పెంపులు గడించాడు. ఈ మహాకవులిద్దరూ తమిళ మలయాళములలో ప్రసిద్ధ రామాయణ కర్తలు.

కంబకవి రచన కంబరామాయణంగా ప్రసిద్ధి కెక్కినప్పటికీ, ఆయన తన రచనకు పెట్టిన పేరు రామావతారం. ఎళుత్తచ్చన్ సంతరించివ రచన అధ్యాత్మ రామాయణం. రామకదై, కంబ నాటకం అనే నామాంతరములు కలిగిన కంబరామాయణం 42,276 పాదాలు కల బృహద్రచన. కంబరామాయణం ప్రక్షిప్త పద్యముల మయం అని సుప్రసిద్ధ విమర్శకులయిన టి. కె. సి. (టి.కె. చిదంబరనాథ ముదలియారు) అభిప్రాయం. ఆయన పరిష్కరించి ప్రకటించిన రామాయణంలో బాలకాండలో 167 పద్యములూ, అయోధ్యకాండలో 550 పద్యములూ మాత్రమే చోటు చేసుకున్నవి. కాని నేడు వాడుకలో ఉన్న కంబ రామాయణం ప్రతులలో బాలకాండలో 1,420 పద్యములూ, అయోధ్యాకాండలో 1,210 పద్యములూ ఉన్నవి. అధ్యాత్మ రామాయణంలో సుమారు 13,200 పాదాలు అందాలు దిద్దుకున్నవి. కంబన్ ఎంత గొప్పకవి అంటే, ఆయన యింటి కట్టు కొయ్యకూడా కవిత చెప్పగలదట! (కంబన్ వీట్టుక్కట్టుత్తరియుం

కవి చొల్లుం). ఎళుత్తచ్చన్ మాత్రం సామాన్యుడా? కాదు. అక్షరాచార్యుడని అర్థం, ఎళుత్తచ్చన్ అనే మాటకు. 'తుంజన్ పరంబివె మణ్ణు విద్యారంభత్తినె విశేషం' అని జనశ్రుతి! తుంజన్ యింటి ఆవరణలోని యిసుక అక్షరాభ్యాసానికి శ్రేష్ఠమైన దని దీని అర్థం. అంతే కాదు, ఆ ఆవరణలోని చెట్టు ఆకు సైతం చేదుగా ఉండదు-అనే జనశ్రుతి కూడా వాడుకలో ఉన్నది. (ఆ పరంబిలె కాంజిర మరత్తినై యిలక్కై ప్పిల్ల.) ఈ విధంగా ఈ కవిద్వయం ఈనాటికీ ప్రజల నాలుకల మీద నిలిచివుండడం గమనించదగిన యింకొక అంశం. అయితే వీరు ఏక కాలానికి చెందినవారు కారు. కంబన్ క్రీస్తుశకం 9వ శతాబ్దానికి చెందిన వాడని కొందరు భావిస్తున్నారు, మరి కొందరి దృష్టిలో ఆయన త్యాగ వినోదన్ బిరుదాంకితుడైన మూడవ కులోత్తుంగ చోళుని సమకాలికుడనీ, అనగా, 12వ శతాబ్ది ఉత్తరార్ధంలోనూ 13వ శతాబ్ది ప్రారంభంలోనూ జీవించి నట్లూ తెలియవస్తున్నది. ఏమయినప్పటికీ, కంబమహాకవి చాలా ప్రాచీనుడనీ, ఆయన సంతరించిన రామాయణం దేశభాషలలో వెలసిన రామాయణాలలో మొట్టమొదటిదనీ నిస్సంశయంగా పేర్కొనవచ్చు. ఈ మహాగౌరవాన్ని తమిళ భాషకు చేకూర్చిన ఘనుడు కంబడు. కాని ఎళుత్తచ్చన్ అంత ప్రాచీనుడు కాదు. ఆయన 16వ శతాబ్ది ఉత్తరార్ధంలో జీవించాడు. ఈ మహాకవుల రచనలకు ముందూ వెనకా తమిళ మలయాళములలో రామకథా సంబంధములైన రచనలు కొన్ని వెలువడక పోలేదు. కాని వాటికి ప్రచారం నానాటికి తీసికట్టు నాగంభట్టు అయింది.

తమిళ సాహిత్యానికి శ్రీకారం చుట్టిన సంగయుగంలోనే రామకథా ప్రశంస చేయబడటం పేర్కొనదగిన విషయం. సంగయుగపు కాలమును గురించి అభిప్రాయభేదా లున్నప్పటికీ, అది క్రీస్తుశకం తొలిమూడు శతాబ్దులలో వర్ధిల్లి నట్లు భావించవచ్చు. సంగకాలపు సంకలన కృతులలో ఒకటయిన అగనానూరులో చిత్రించబడిన యీ అద్భుత సన్నివేశాన్ని పరికించండి: ధనుష్కోటిలో ఒక రావిచెట్టు నీడకు ఆసీనుడై రామచంద్రుడు తన సహచరులతో సమాలోచన జరుపుతున్నాడు. దశకంఠుని మీదికి ఎలా దండెత్తి వెళ్లాలా అని. అప్పుడు చెట్టుమీది పక్షులు చెవులు చిల్లులుపడేలా గోలచేస్తున్నాయి. వాటి వంక రాముడు ఒక్కసారి చూశాడు. అంతే. పక్షుల నోళ్లకు తాళాలుపడ్డాయి. అనగా, పిట్టలూ

పులుగులూ సైతం రాముడి పక్షం వహించినట్లు ఈ సన్నివేశంలో చమత్కరించ బడింది.

పరిపాడల్ అనే మరో కృతిలో అహల్యకథను సంగ్రహంగా తెలియజేసే ఒక పద్యం కానవస్తున్నది. తమిళనాడులో వాడుకలో ఉన్న కథకు అనుగుణంగా ఇంద్రుడు పిల్లిరూపంలో గౌతమాశ్రమం నుంచి నిష్క్రమించినట్లు అందులో ఉదాహరించబడింది.

ఇలా రామకథా సంబంధములైన సన్నివేశాలుకొన్ని కనిపించడమే కాక, అతి ప్రాచీనమైన సంగయుగంలోనే వెణ్బా ఛందస్సులో (అగవల్ ఛందస్సని కొందరి మతం) ఒక రామాయణం వ్రాయబడినట్లూ, క్రీస్తు శకం 650 ప్రాంతాలలో అది వెలుగు చూచినట్లూ, ప్రాచీన కాలంలో రామాయణమును సీరామకదై (శ్రీరామకథ) అని వ్యవహరించేవారనీ తమిళపండితుల అభిప్రాయం.

తమిళ కావ్యపంచకంలోని సిలప్పదికార, మణిమేఖల కృతులలోకూడా రామకథా ప్రశంస చేయబడింది. సిలప్పదికారం (మంజీరగాథ) కావ్య నాయకుడైన కోవలుడు, కొన్ని కారణాలవల్ల, స్వస్థలమైన పుహార్ నామాంతరం కల కావేరీ పూం పట్టణమును విడిచిపెట్టి మధురా నగరానికి వెళ్లవలసి వస్తుంది. తత్కావ్య కర్త యీ విషయాన్ని యిలా వ్యక్తం చేశాడు. 'కోవలన్ వెళ్లిపోయిన తర్వాత పుహార్ పట్టణం రాముడులేని అయోధ్యవలె ఉన్నది' అని. మధురా నగరం సరిహద్దులు చేరుకున్న పిమ్మట కోవలుడు తన భార్య కణ్ణకిని కౌంతి అనే జైనసన్న్యాసినికి ఒప్పజెప్పాడు. పూర్వం భార్యావియోగంవల్ల రాముడు, నలుడు మున్నగువారు బాధపడ్డారనే విషయాన్ని అప్పుడు కౌంతి తన అనునయ వాక్యాలలో కోవలుడికి గుర్తు చేస్తుంది.

పెద్దపెద్ద కొండలను సముద్రంలోకి విసిరివేసి ఆ విధంగా వానర వీరులు సేతు నిర్మాణంలో రాముడికి తోడ్పడిన విషయం మణిమేఖలలో పేర్కొనబడింది. ఈ సందర్భంలో ఉదాహరించబడిన సేతువు కన్యాకుమారి అని సుప్రసిద్ధ తమిళ విద్వాంసులు ము. రాఘవయ్యంగారు విశ్వసించారు. కన్యాకుమారి వద్ద ఉన్నది ఆదిసేతువనీ, ధనుష్కోటివద్ద ఉన్నది మధ్యసేతువనీ ఆయన నమ్మకం. ఇది సహేతుకంగా ఉన్నట్లు నా అభిప్రాయం. ఎందుకంటే, ప్రాచీన కాలం నుంచీ కన్యాకుమారి పవిత్ర యాత్రా స్థలంగా భావించబడుతుంది. ఇందుకుతమిళ సాహిత్యం సాక్ష్యమిస్తున్నది. పైగా, ఆ సేతు హిమాచలం అన్న సంస్కృత పద బంధానికి సమానార్థక మైన

తమిళ పదబంధం 'కుమరి ముదల్ ఇమయం వరై' ఇక్కడ ప్రయుక్తమైన కుమరి శబ్దానికి సేతు వని అర్థం.

తమిళంలో జైనకవి ఒకరు రామాయణం రచించినట్లు తెలియవస్తున్నది. భక్తకవులైన ఆళ్వారులూ నాయన్మారులూ వెలయించిన భక్తి గీతాలలో రామ ప్రశంస కానవస్తున్నది. వాల్మీకి చిత్రించిన ఆదర్శ మానవుడు రాముడు ఆళ్వారుల కాలంనాటికి విష్ణ్వంశ సంభూతుడుగా వినుతి కెక్కాడు; రసవత్కావ్యమైన రామాయణం శరణాగతి కావ్యంగా రూపుదాల్చింది. 12వ శతాబ్ది వాడయిన పెరియవాచ్చాన్ పిళ్లై అనే వైష్ణవాచార్యుడు పాశురప్పడి రామాయణం అనే ఒక లఘు కృతిని సంకలనం కావించాడు. ఇందులోని విశిష్టత యేమిటంటే: ద్రావిడ వేద మని ప్రసిద్ధికెక్కిన నాలాయిర దివ్య ప్రబంధంలోని పదబంధాలతోనే యీ పాశురప్పడి రామాయణం కూర్చబడింది.

18వ శతాబ్దిలో జీవించిన అరుణాచల కవి 'రామాయణ కీర్తనై' అనే గ్రంథం వెలయించాడు. కీర్తనల రూపంలో వెలసిన రామకథ యిది. ఈ కీర్తనలు నేటికీ ప్రచారంలో ఉన్నవి. ఆధునికులలో కొట్టైయూర్ సుబ్రహ్మణ్య అయ్యర్, ఆళవందార్, వెంకట కృష్ణయ్యంగార్ ప్రభృతులు రామాయణం సంతరించారు. ఇక రామకథా సంబంధములైన జానపదగేయాలు ఎన్నెన్నో. నేటికీ వాల్మీకి రామాయణం, కంబరామాయణం తమిళనాడులో పెక్కుచోట్ల పురాణంగా చెప్పబడుతూ వుండడం, కంబ రామాయణానికి వ్యాఖ్యలూ మొదలైనవి వెలువడుతూ వుండడం రామాయణానికి గల ప్రచారానికి ప్రబల సాక్ష్యములు. కనుక, అతి ప్రాచీన కాలంనుంచీ రామకథ తమిళులకు సుపరిచితమైన కథ అనీ, కంబకవికి పూర్వమే తమిళంలో రామాయణం ఒకటి వెలసి వుండ వచ్చుననీ, అయితే ఆ రచన కంబరామాయణం వెలుగులోకి వచ్చిన తర్వాత మరుగున పడిపోయిందనీ భావించడంలో విప్రతిపత్తి లేదు. అనగా, తమిళనాడులో రామ కథా తంతువు అవిచ్ఛిన్నంగా అనుస్రుతంగా వస్తున్న దనడం నిర్వివాదం.

కంబకవికి పూర్వం తమిళంలో రామాయణం ఒకటి వెలసినట్లుగా, మలయాళంలోనూ అధ్యాత్మరామాయణానికి ముందు రామకథాసాహిత్యం వెలసింది.

మలయాళంలో వెలసిన తొలి రామకథా కావ్యం 'రామచరితం' అన్నది. ఇది సీరామ కవి కృతం. ఇది 13వ శతాబ్దిలో వెలుగులోకి వచ్చింది. కేవలం

యుద్ధకాండ కథనే అభివర్ణిస్తున్న యీ కావ్యానికీ అభినందుని సంస్కృత రామ చరిత కావ్యానికీ సాదృశం ఏమీ లేదు. రామ పట్టాభిషేకంతో ముగిసిన మలయాళ రామ చరిత కావ్యం వాల్మీకమునకు సన్నిహితంగా కనిపిస్తుంది.

15వ శతాబ్దికి చెందిన కణ్ణశ్శ పణిక్కర్ రచించిన రామాయణం మల యాళంలో వెలసిన రెండవ రామకృతి. ఈ కణ్ణశ్శ రామాయణం గరీయః ప్రతిభులైన ఎళుత్తచ్చన్ వంటి మహాకవుల్ని కూడా ప్రభావితుల్ని చేసింది. కణ్ణశ్శ రామాయణంలోని కవిత కమనీయమైనదే కాని, భాష మాత్రం కృతక మైనది. అనగా, అందులో తమిళపు పాలు ఎక్కువ. తొలి రామాయణమైన రామచరితంలోని కవిత అంత ప్రశస్తమైనది కాదనీ, భాష యేమో సంస్కృత పద భూయిష్ఠమనీ పండితుల విశ్వాసం. కాగా, మలయాళంలో వెలసిన యీ రెండు రామాయణాలు కేరళీయుల్ని అంతగా అలరించలేకపోయినవి.

15వ శతాబ్దిలోనే మరి రెండు రామాయణాలు వెలువడ్డాయి. అయ్యప్పిళ్లి ఆశాన్ రామకథాపాట్టు వెలయించాడు. ఇందులోనూ తమిళపు పాలు ఎక్కువ కావడం చేత, దీన్ని మలయాళీలు మలయాళ కృతిగా అంగీకరించడానికి మీన మేషాలు లెక్కిస్తారు. పుణం నంబూదిరి అనే ఆయన రామాయణ చంపు వెల యించాడు. దీనికి మలయాళ సాహిత్యంలో ఉన్నతమైన స్థానం లభించింది. 20 భాగాలుగా వ్రాయబడిన యీ చంపూరచన చక్కని మణిప్రవాళశైలిలో తీర్చిదిద్దబడింది.

ఎళుత్తచ్చన్ రంగంలో ప్రవేశించిన తర్వాత మలయాళ భాషా చరిత్ర జిగిబిగీ సంతరించుకుంది; నవశకంలో అడుగిడింది. అంతవరకూ ఆధిపత్యం చెలాయించిన తమిళభాషా ప్రభావం అంతరించింది. ప్రాచీన ద్రావిడ ఛందస్సు లనూ మనోహరమైన మణిప్రవాళమునూ మేళవించి ఒక నూతన శైలిని సృష్టించిన కవిశేఖరుడు ఎళుత్తచ్చన్. ఆయన శైలి మలయాళీలను బహుధా ఆకర్షించింది. ఆధునిక మలయాళంలో ప్రామాణికమైన శైలిని నెలకొల్పినవాడు ఆయనే. అదే ఆయన శైలిలోని విశిష్టత. ఆయన రామాయణ రచనలోనూ ఒక విశిష్టత లేకపోలేదు.

ఇతర భాషా రామాయణాలకు వాల్మీకం మాతృక. కాని ఎళుత్తచ్చన్ కృతికి మాతృక వాల్మీకానికి చాలా కాలం తరువాత, అనగా పదమూడో పద్నా లుగో శతాబ్దిలోనో, వెలసిన అధ్యాత్మ రామాయణం. ఇలా అధ్యాత్మరామాయ

ణాన్ని మాతృకగా చేసుకొని అద్భుతమైన కృతిని సృష్టించిన ప్రాంతీయ భాషా కవులలో తుంజత్ ఎళు త్తచ్చన్ ప్రముఖుడేకాదు, ప్రథముడు కూడా ! పైగా ఆయన అనువాదం మూలానికి అతి సన్నిహితంగా సాగింది. కాని యుద్ధకాండను మాత్రం వాల్మీకికృతిని అనుసరించి ఆయన రచన కావించాడు. ఆయన రామాయణంలో సుభాషితాలు చుబ్బనచూరలు.

ఎళు త్తచ్చన్ రామాయణం పండిత పామర రంజకమైన రచన. కేక, కాకళి, కళకాంచి మొదలైన దేశిచ్ఛందస్సులలో సాగిన యీరచన సామాన్యుల్ని సైతం బాగా ఆకర్షించింది. నిజం చెప్పవలసివస్తే, ఎళు త్తచ్చన్ రామాయణానికి సామాన్య ప్రజలలో లభించినంత ప్రచారం కంబరామాయణానికి లభించలేదేమో అనిపిస్తుంది. ఎళు త్తచ్చన్ రామాయణం పారాయణ గ్రంథం. ఈ గ్రంథంలోని కొన్ని భాగాలు చదివితే కన్నెలకు మంచి భర్తలు లభిస్తారని కేరళీయుల విశ్వాసం. సాయంకాలం దీపం పెట్టగానే ఎళు త్తచ్చన్ రామాయణంలోంచి కొన్ని పద్యాలు చదవడం మొన్నమొన్నటి వరకూ కేరళలో కనిపించిన ఆచారం. ఈ సందర్భంలో చేల్నాట్ అచ్యుత మీనన్ అన్న మాటలు ఉట్టంకించదగినవి: 'The practice which enjoins on the people the reading of Ezuthaccan's Ramayana everyday as a matter of obligatory religious duty still lingers in the nooks and corners of Malabar, in spite of the temptations of critical thought.'

ఇంత ప్రచారం ఎళు త్తచ్చన్ కృతికి కలగడానికి కారణం ఏమిటి ? ఆయనకి ముందు వెలువడిన రామాయణాలకు ప్రచారం లభించకపోవడానికి కారణం ఏమిటి ? ఇందుకు ఎళు త్తచ్చన్ కమ్మనికవిత ఒక కారణమైతే, మరో కారణం ఆయన తన రచనలో నిక్షిప్తంచేసిన అద్వైతవేదాంతసుధ. ఈవేదాంత సుధ ఇతర మలయాళ రామాయణాలలో కనిపించదు. ఎళు త్తచ్చన్ మాటల లోనే ఈ విషయాన్ని మనవి చేస్తాను.

"పాదసేవకనాయ భక్తనాందాసన్ బ్రహ్మ
పాదజన్ అజ్ఞానినాం ఆద్య నాయుఃళ్లోరు ఞాన్
వేద సమ్మితమాయ్ మున్నుళ్ల శ్రీరామాయణం
బోధహీనన్ మాక్ కరియాంవణ్ణం చొల్లీర్‌టున్నె."

పాదసేవకుడను భక్తదాసుడను బ్రహ్మ పాదజుడను అజ్ఞానులలో

ఆద్యుడను ఆయిన నేను వేదసమ్మతంగా వెలసిన రామాయణమును జ్ఞానహీను లకు తెలిసేలా వివరిస్తాను- అని ఎళు త్తచ్చన్ సహజవినయం తొణికిసలాడగా పేర్కొన్నాడు. అధ్యాత్మరామాయణాంతర్గత మైన జ్ఞానమును, అనగా వేదాంత విజ్ఞానమును, నలుగురికీ తెలిసేలా వివరిస్తానని ఆయన సెలవిచ్చాడు; కృత కృత్యుడయ్యాడు.

ఎళు త్తచ్చన్‌లా కంబకవి కూడా బ్రాహ్మణేతరుడు; మూ ర్తీభవించిన వినయం. వాల్మీకి అంటే కంబనికి కల ఆదరభావం నిరుపమానం. వాల్మీకి రామాయణం వ్యాప్తిలో ఉండగా, తనవంటివాడు రామాయణం వ్రాయడం పాల సముద్రము నంతా తాగివేయాలని తలచిన పిల్లి ఆశవంటి దని ఆయన తన రచన మొదట్లో పేర్కొన్నాడు. ఇది కంబన్ సహజవినయానికి తారకాణ మాత్రమే. నిజానికి కంబరామాయణం తమిళసాహిత్యాకాశంలో ప్రతిభాసించే ధ్రువతార. వి.వి.యస్. అయ్యర్ వంటి ప్రసిద్ధ తమిళ విద్వాంసుల దృష్టిలో కంబని కృతి వాల్మీకి రచనకన్నా గొప్పది. అయ్యరుగారి యీమాటలు అవధరించండి: 'In the Ramayana of Kamban, the world possesses an epic which can challange comparison not merely with the Iliad and the Aeneid, the Paradise Lost and the Maha bharata but with its original itself, namely the **Ramayana** of Valmiki.'

దేవభాష అయిన సంస్కృతంలో ముగ్గురు (వాల్మీకి, వసిష్ఠుడు, బోధా యనుడు- అని కొందరి మతం; వాల్మీకి, వ్యాసుడు, అగస్త్యుడు- అని కొందరి మతం) రామాయణం వెలయించినా, తాను వాల్మీకి కృతిని ఆధారం చేసుకుని రచన చేశానని కంబకవి స్పష్టం చేశాడు. (తేవ పాడై యిన్ ఇక్కదై చెయ్‌ద వర్ మూవర్ ఆనవర్.)

కంబరామాయణంలోని కొన్ని సొగసులను తెలుసుకునేందుకు పూర్వం, మలయాళంలో అధ్యాత్మరామాయణం ఆవిర్భవించిన తీరుని సంగ్రహంగా మనవి చేస్తాను. తెలుగువారమైన మనకు ఇది ఆసక్తిదాయకమైన విషయం.

ఆ నాళ్లలో నేటి అంబలపూళ అనే చంపకశ్శేరిని (కొచ్చినుకి 80 కిలో మీటర్ల దూరంలో ఉన్నది) దేవనారాయణుడనే నంబూద్రి బ్రాహ్మణుడు పరి పాలించే వాడు. కేరళం పరశురామ క్షేత్రం కదా, కనుకనే బ్రాహ్మణప్రభువు.

ఆయన కొలువుకూటానికి ఒకనాడు ఒక ఉత్తరాది బ్రాహ్మణుడు వచ్చాడు. ఆయన రాజుకి సంస్కృతభాషలోని అధ్యాత్మ రామాయణపు తాళపత్ర గ్రంథం బహూకరించాడు. కాని లిపిమాత్రం తెలుగు. అప్పుడు ఆ కొలువుకూటంలోనే ఉన్న మహాపండితుడూ, నారాయణీయం కర్తా అయిన నారాయణ భట్టతిరి ఒక్క ఎళుత్తచ్ఛన్‌కి తప్ప మరెవ్వరికీ తెలుగులిపి తెలియదనీ, కనుక ఆయన చేత అధ్యాత్మ రామాయణాన్ని మలయాళ లిపిలో వ్రాయించడం మంచిదనీ సూచించాడు. ఆ సూచన రాజుగారికి నచ్చింది. ఆ తర్వాత రాజాజ్ఞ ప్రకారం అధ్యాత్మ రామాయణాన్ని లిప్యంతరం చేయడమే కాకుండా అనువదించాడు కూడా ఎళుత్తచ్ఛన్ మహాకవి.

వాల్మీకిని అనుసరించి కంబకవి రచన సాగించినా, ఆయన రామాయణం లో ఆవాల్మీకాంశములు ఎన్నో చోటు చేసుకున్నవి. అయితే ప్రధానకథలో మార్పులు చెయ్యలేదు. పాత్ర చిత్రణలోనే కంబడు చేసిన మార్పులు కొట్ట వచ్చినట్టు కనిపిస్తాయి. అందులోనూ ఆయన స్త్రీ పాత్ర చిత్రణ ఉదాత్తమైనది. కాని ఆ మహాకవి చేసిన కొన్ని వర్ణనలు కొండవీటి చేంతాళ్ళు. రామదర్శనాంతరం సీత చెందిన విరహం కంబరామాయణంలో సుమారు నలభై పద్యాలలో వివరించ బడింది. వాల్మీకంలో ఒకటి రెండు శ్లోకాలలో దశరథుడు మిథిలా ప్రయాణం చెయ్యగా, ఆ మహారాజు ప్రయాణం కంబని కృతిలో సుమారు మున్నూరు పద్యాలలో సాగింది.

కంబరామాయణంలోని వర్ణనలు దీర్ఘము లనక తప్పదు. ఒక్కొక్కసారి యీవర్ణనలు మోతాదును మించినట్లు కనిపిస్తాయి. కనుకనే కాబోలు కంబ రామాయణం 'దీర్ఘమైన వర్ణనకు' పర్యాయపదంగా వాడబడుతున్నది. 'ఏమిరా కంబరామాయణం మాట్లాడుతున్నావు' అని చిత్తూరు జిల్లావారు మాటల మధ్య వ్యవహరించడం గమనించదగిన అంశం.

వివాహాత్పూర్వమే సీతారాములు ఒకరినొకరు ప్రేమించుకొనుట, పిల్లి రూపంలో ఇంద్రుడు గౌతమాశ్రమంనుంచి నిష్క్రమించుట, దశరథుని కోరిక ననుసరించి శత్రుఘ్నుడు ఆయనకు అంత్యక్రియలు జరుపుట, అగస్త్యుని తమిళ విద్వాంసుడుగా చిత్రించుట, పర్ణశాలా సహితంగా సీతను రావణాసురుడు అపహరించుట, కైకేయిని రాముడు దూషణోక్తు లాడకుండుట, వాలి మరణా నంతరం తారను విరక్తమనస్కగా చిత్రించుట, భ్రాతృప్రేమ కల సోదరునిగా

కుంభకర్ణుని అభివర్ణించుట. యుద్ధరంగంలో మృతుడై పడివున్న భర్తనుచూచి మండోదరి అక్కడికక్కడే మరణించుట, విభీషణుడు రావణుడికీ మండోదరికీ అంత్యక్రియలు జరుపుట, మాయాజనక పాత్రను సృష్టించుట, కంబకవి పోషకుడైన శడయప్పముదలి పూర్వులు ఇచ్చిన కిరీటమును వసిష్ఠుడు రాముని శిరసున ఉంచుట- మొదలైనవి కంబరామాయణంలో కానవచ్చే కొన్ని మార్పులు ఇటువంటి మార్పులు ఎళుత్తచ్చన్ రామాయణంలో కనిపించవు.

కంబరామాయణంలోని రమణీయ సన్నివేశములలో ఒకటి సీతారాముల ప్రణమోదంతం. జనకుని అంతఃపురంలోని ఒక మేడమీద నిలబడివున్న సీతను రాముడు చూస్తాడు. ఆ తర్వాత సీత రాముని చూస్తుంది. (అణ్ణయుం నోక్కినాన్ అవళుం నోక్కినాళ్.) అలా యిద్దరూ ఒకరినొకరు చూసుకున్నారు. అవి ప్రేమైకవీక్షణాలు. వియోగానంతరం కలుసుకున్న ప్రేయసీ ప్రియుల ప్రణయం వర్ణనాతీత మనీ, సీతారాములు, లక్ష్మీనారాయణు లనీ కంబకవి వారి వివాహాత్పూర్వ ప్రణయాన్ని సమర్థించాడు. రాముడు కావించిన శివధనుర్భంగమును 'ఎడుత్తదు కండనర్, యిట్రదు కేట్టార్' అని ముక్తసరిగా తెలియజేశాడు. రాముడు వింటిని పైకెత్తుట చూశారు, అది విరుగుట విన్నారు- అని పైదానికి అర్థం. అంత అవలీలగా, కనురెప్పపాటులో, 5,000 మంది బలాఢ్యులు తీసుకు వచ్చిన ధనుస్సుని రాముడు విరిచినాడు- అని అర్థం చేసుకోవాలి.

సీతారాముల వివాహాన్ని వర్ణిస్తూ, సీత రెండు దండలు వేసిందని ఎళుత్తచ్చన్ పేర్కొన్నాడు. ఒకటేమో చూపుల దండ (నేత్రోత్పలమాల); మరొకటేమో పెండ్లిదండ (వరణార్థమాల). సాలంకృత అయిన సీతనూ, ఆమె అర్పించిన దండలనూ మనమీ పద్యంలో దర్శిద్దాము.

"సౌర్ణవర్ణత్తెప్పూండ మైథిలి మనోహరీ
సౌర్ణ భూషణంగళు మణిబు శోభయోటె
సౌర్ణ మాలైయుం ధరిచ్చాదరాల్ మందం మందం
అర్ణోజ నేత్రన్ తున్నిల్ సత్రపం వినీతయాయ్
వన్నుడన్ నేత్రోత్పల మాలైయుం ఇట్టాళ్ మున్నే
పిన్నాలే వరణార్థ మాలైయుం ఇట్టేడినాళ్."

మరొక సన్నివేశం :

శూర్పణఖ తన వికృత రూపంలో రాముడివద్దకు వచ్చినట్లు వాల్మీకంలో పేర్కొనబడింది. కంబమహాకవి శూర్పణఖ అలా రాలేదు. అందాలబరిణగా, లావణ్యలతికగా వచ్చింది. పేరు, కామవల్లి ! ఆ వికృత రూపిణికి కంబడు మనోహరమైన రూపమునే కాక మనోజ్ఞమైన పేరుకూడా ప్రసాదించాడు. ఆ లావణ్యలతికను ఆ మహాకవి ఇలా వర్ణించాడు :

"పంజి ఒళిర్ వింజుకుళిర్ ప్పల్లవం అనుంగ
చెంజెవియ కంజనిమిర్ సీరడియళ్ ఆగి
అంజోల్ యిళమంగై యెన అన్నమెన మిన్నుం
వంజియెన నంజమెన వంజమగళ్ వన్దాళ్-"

(పల్లవమును ఎఱ్ఱ ప్రత్తి సిగ్గుగొనగ. హంస యనగ కేకియ నగ గరళ, మనగ తీగ యనగ అడుగుదమ్ములు వైచి, ఆ పలుకుల కొలికి అరుగుదెంచె.) ఆమె తీగవలె సన్నగా రెపరెప లాడుతూ ఉన్నది. నడక యేమో హంస నడక. సోయగంలో నెమలి వంటిది. పలుకులేమో తియ్యనివి. కాని మనస్సు మాత్రం విష పూరితం. శూర్పణఖను ఇలా బంగారు బొమ్మగా వర్ణించడంలో కంబకవి అంతర్యం స్పష్టమే. వికృతరూపిణిని ఎవ్వరూ ప్రేమించరు. కాగా సుందరుడైన రాముణ్ణి తన వలలో వేసుకునే నిమిత్తం కామరూపిణి అయిన శూర్పణఖ సౌందర్యతిలకగా రూపు దాల్చింది. ఎంత అందాలకొలికి వచ్చినా, రాముని ఏకపత్నీవ్రతానికి భంగం వాటిల్లదని తెలియజేయడానికి కంబకవి కామవల్లిని కల్పించి వుండవచ్చు.

శూర్పణఖ రాముణ్ణి సమీపించడం, తర్వాత లక్ష్మణుణి సమీపించడం, ఆ తర్వాత జరిగిన కథ అందరికీ తెలిసిందే. అయితే, యితర రామాయణాలలో వలెకాక, కంబరామాయణంలోని లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు చెవులతోపాటు ఆమె వక్షోజములు కూడా ఖండించాడు. ఆమెను వికృత స్వరూపిణిగా చేసేందుకే యీ కఠినచర్య అవలంబించబడింది. ఎళుత్తచ్చన్ రామాయణంలో కూడా ఇలాగే చెప్పబడడం గమనించదగిన విషయం. ఆయన అన్నాడు గదా : '...కాదుం ములైయుం మూక్కుం ఎల్లాం ఛేదిచ్చనేరం అవళ్ అలరి.' కంబ రామాయణపు ప్రభావం ఎళుత్తచ్చన్ మీద కనిపించదు. సంస్కృత అధ్యాత్మ రామాయణంలోనూ ఈ విషయం కనిపించదు. మరి, వక్షోజఖండనానికి మూల మేదో తెలియరాలేదు.

ఇక సీతాపహరణం గురించి రెండుమాటలు :

వాల్మీకంలో లేకపోయినప్పటికీ, పర్ణశాలా సహితంగా సీతను రావణుడు అపహరించి తీసుకుపోయినట్లుగా కంబకవి ఎందుకు వ్రాయవలెను ? కావ్యవిమర్శ చేసేటప్పుడు, ఆ కావ్యం వెలుగులోకి వచ్చినప్పటి దేశకాల పరిస్థితుల్ని గుర్తుంచుకోవడం చాలా అవసరం.

కంబకవి కాలంనాటికి సీతారాములు లక్ష్మీనారాయణుల అవతారమనే విశ్వాసం వాడుకలో ఉండేది. ఈ విషయాన్ని ఆయన తన రచనలలో పదేపదే ఉదాహరించాడు. పైగా, ఆయన కావ్యంశాతుం రామావతారం. కాగా, సాక్షాత్ లక్ష్మీదేవి అవతారమైన సీతను రావణుడు, అందులోనూ మలినమనస్కుడై వచ్చిన రావణుడు, స్పృశించడం వాంఛనీయం కాదనుకుని కంబకవి యిలా పేర్కొనివుండవచ్చు. పూర్వపు శాపమును స్ఫురణకు తెచ్చుకొని రావణుడు సీతను స్పృశించలేదని ఆయన ఒక కారణం కూడా చెప్పాడు. అదీకాక, పతివ్రత అయిన సీతను కుటిలచిత్తుడైన పరపురుషుడు తాకడం ఆనాటి ప్రజల దృష్టిలో అవాంఛనీయమే కాక మన్నింపరాని విషయం కూడా. కనుకనే, లోకజ్ఞుడైన కంబన్ బుద్ధిపూర్వకంగానే ఈ మార్పు చేసివుంటాడు. ఆయన చేసిన మార్పులు కథాగౌరవాన్ని ఇనుమడింప జేసేవే కాని అన్యములు కావు. కాగా, ఆ మార్పులు సమర్థనీయము లని నా అభిప్రాయం. ఈ దృష్టితో చూచినప్పుడే తార విషయంలో కంబకవి చేసిన మార్పు సమర్థనీయ మనిపిస్తుంది.

కంబరామాయణం ప్రకారం, వాలి మరణానంతరం అతని భార్య తార సుగ్రీవుని వలపునే స్తం కాక విరక్తమనస్కగా ఉండిపోయింది. ఇది కూడా కంబన్ కాలంనాటి విశ్వాసాలకు అనుగుణంగా ఉన్నది. ఎందుకంటే, పంచకన్యలలో తార ఒకతె. కడమవారు— అహల్య, ద్రౌపది, సీత, మందోదరి ప్రభృతులు. పైగా, తారను ప్రవేశపెట్టిన తీరు హృద్యము. అది కంబకవి పాత్ర పోషణ కౌశలమునకు కర్పూరనీరాజనం పడుతున్నది.

వానరోజులు వెనక పట్టినవి. అయినా అనుకున్న ప్రకారం సుగ్రీవుడు యుద్ధసన్నాహాలకు దిగలేదు. అది రాముడికి కోపకారణ మయింది. లక్ష్మణుడు కిష్కింధకు ప్రయాణమైనాడు. అసలు విషయం తెలుసుకోడానికి. ఉగ్రమూర్తియై వస్తున్న ఆ లక్ష్మణమూర్తిని చూచి వానరవీరులు భయభ్రాంతులైనారు. అప్పుడు సుగ్రీవుడు మద్యపానరక్తుడై మనలోకంలో లేడు. కాగా, స్త్రీజన

పరివృతయై తార రామానుజుని సమీపించింది. వారిని చూచేసరికి అగ్నిపర్వతం వంటి లక్ష్మణుడు శాంతమూర్తియై, లజ్జాభరంతో తలవంచుకున్నాడు. అప్పుడు తార, "మీ రాకతో మా భవనం పునీతమయింది. రాముణ్ణి ఒంటరిగా విడిచి మీరు యిక్కడికి రావడం విడ్డూరంగా ఉంది. మీ కోపాన్ని చూచి మా వానరు లందరూ భయభ్రాంతులైనారు. ఇంతకూ మీ రాకకు కారణం ?" అని అడిగింది. తీయనికంఠంతో తార పలికిన ఆ మృదూక్తులు లక్ష్మణుని ఆశ్చర్యంలో ముంచి వేశాయి. ఎవరా యీ వానరభామిని ? అని లక్ష్మణుడు తల పైకెత్తి చూశాడు. అంతే. అతని హృదయం శోకార్ణవమయింది. ఎదుట నిలపడిన తార శ్వేతవస్త్ర ధారిణి. నుదుట కుంకుమ లేదు. మెడలో మాంగల్యాది పవిత్రభూషణాలు లేవు ఆమెను చూడగానే, అదే అవస్థలో అయోధ్యలో ఉన్న తన తల్లులు గుర్తుకి వచ్చారు, లక్ష్మణుడికి. కనుకనే అతని గుండె దుఃఖంతో నిండిపోయింది.

ఈ సన్నివేశాన్ని పరికించిన తర్వాత, కంబని విమర్శకులు సైతం ఆ మహాకవి ప్రదర్శించిన అనల్పకల్పనా చాతురికి కైమోడ్పు ఘటించక తప్పదు !

కంబకవి వలె, ఎళుత్తచ్చన్ కూడా సీరాతాముల్ని దైవస్వరూపులుగా భావించాడు. ఆయన కవితాప్రతిభ రచన అంతటా కానవస్తున్నప్పటికీ, సుందర కాండలోని ఒక సన్నివేశం ఎళుత్తచ్చన్ ప్రతిభకు దర్పణం పడుతున్నది.

అశోకవనంలో చింతాక్రాంతయై ఉన్న సీతను సమీపించి రావణుడు 20 పాదాలలో రాముణ్ణి గురించి చేసిన నిందాస్తుతి అవశ్యపఠనీయం. కళకాంచి వృత్తంలో సాగిన యీ నిందాస్తుతిలోంచి నాలుగు పాదాలను మాత్రం ప్రస్తుతం పరిశీలిద్దాము :

"భవతి తవ రమణ మపి దశరథ తనూజనె
ప్పార్త్తాల్ చిలర్క్కు కాణాం చిలప్పోళెడో
పలసమయం అఖిలదిశి నన్నాయ్ తిరగిలుం
భాగ్యవతా మపి కణ్డు గిట్టా పరం."

రాముడు నీ భర్త అయినా, దశరథతనూజుడే అయినా, అతనిని కొందరు మాత్రమే కొన్ని వేళల్లో చూడగలుగుతారు. అనగా, రాముడు సన్యాసివలె ఊరూరు తిరుగుతున్నాడు కనుక, అతనిని అందరూ అన్నివేళల్లోనూ చూడ లేరనీ కొందరుమాత్రమే కొన్ని వేళల్లోనే చూడగలుగుతున్నారని భావం. అతడు పరమాత్ముడు కనుక, చివరికి అతని భార్యకాని జనకుడుకాని అతనిని దర్శించ

లేరని అంతరార్థం. రాముడు అన్నిదిక్కులా సంచరిస్తున్నప్పటికీ, సర్వవ్యాపకుడైనాకూడా, కొందరికి మాత్రమే అతని దర్శన భాగ్యం లభిస్తున్నది. ఋషులు కూడా ఆ పరమాత్ముని సందర్శించలేరని అంతరార్థం.

చిట్టచివరికి కామపరవశుడైన రావణునిచేత ఇలా పలికిస్తాడు ఎళుత్తచ్చన్: "సుముఖి! తవ చరణనలిన దాసోస్మ్యహం" అని. నేను నీయందు బద్ధానురాగుడనై వున్నాను; ఇక నీవే నాకు దిక్కు— అన్నది మామూలు అర్థం కాని అసలు అర్థం ఏమిటంటే: ఇక నీ చరణములే నాకు శరణ్యం; నేను నీ చరణదాసుణ్ణి. ఇక్కడ శరణాగతి భావం ధ్వనిస్తున్నదని విజ్ఞుల అభిప్రాయము.

కంబన్; ఎళుత్తచ్చన్ మహాకవుల మాతృభాషాభిమానం బహుధా ప్రశంసార్హం. దేశీ ఛందస్సులలో స్వచ్ఛమైన మణిప్రవాళమును పొందుపరిచి, ఎళుత్తచ్చన్ కేరళీయులకు చక్కని చిక్కని మలయాళ శైలిని ప్రసాదించి చిరస్మరణీయుడైనాడు ఆయన నవయుగ ప్రవక్త!

ఇక కంబన్ మాతృభాషాభిమానం పలుచోట్ల ఆయన రచనలో ప్రదర్శిత మయింది. ఆయన చేసిన అయోధ్యానగర వర్ణన చదువు తుంటే, ఆ నగరం కావేరీ తీరాన ఎక్కడో ఉన్నట్టు అనిపిస్తుంది గోదావరిని కావేరితో సరిపోల్చడం మనం చూడవచ్చు. ఉత్తమ కవిత గౌతమీ ప్రవాహంవలె ఉంటుందని ఆయన అభిప్రాయం. తమిళభాషా స్వభావం అనుసరించి కొన్ని పేర్లలో కొద్దిపాటి మార్పులు చేయబడినవి. కౌసల్య-కౌచలై; దశరథుడు-దయరతన్; మహాపార్శ్వుడు—పెరుం పాక్కన్; ధూమ్రాక్షుడు-పుగై నిరక్కణ్ణన్— మొదలైనవి యిందుకు ఉదాహరణాలు. ఇందువల్ల కంబన్ సంస్కృత భాషాభిమాని కాడని అనుకున్నట్లయితే, అది పొరపాటు తప్ప మరొకటి కాదు. అయన సంస్కృత భాషాభిజ్ఞుడు, వాల్మీకి అన్నా, రామకథ అన్నా ఆయనకి గల భక్తిప్రపత్తులు అనిర్వచనీయములు.

కంబరామాయణంలో వర్ణించబడిన సర్వమానవ సౌభ్రాత్రం ముఖ్యంగా పేర్కొనదగిన విషయం. ఇదే కంబకవి మనకు ప్రసాదించిన సందేశ మని అభిజ్ఞుల అభిప్రాయం. ఆటవికుడైన గుహుడు ప్రదర్శించిన భక్తికి మెచ్చుకుని, "అయోధ్యలో మేము నలుగురం అన్నదమ్ములం; కాని యిప్పుడు అయిదుమంది అయినాము" అది రాముడు అంటాడు. అలాగే వానరుడైన సుగ్రీవుని చూచి "యిప్పుడు మేము ఆరుగురము" అని రాముడు అన్నాడు. రాక్షసుడైన

విభీషణునితో చెలిమి యేర్పడిన తర్వాత, "యిప్పుడు మేము ఏడుగురం అన్న దమ్ములం" అని తన హర్షం ప్రకటిస్తాడు రాముడు. ఈవిధంగా కంబరామాయణంలో వివిధ వర్గములవారి నడుమ సోదరభావం స్థాపించబడింది.

ఎళు త్తచ్చన్ సహజంగా భక్తిభావం కల మహాకవి. ఒక్కొక్కసారి భక్తి పారవశ్యంతో ఆయన ప్రతికాండం మొదట్లోనూ రాముని గురించి కాని కృష్ణుని గురించి కాని కవితాగానం చేశాడు అద్వైత వేదాంత సౌరభమునూ ఆత్మవిచార ప్రాముఖ్యమునూ కేరళీయులకు వ్యక్తంచేసిన మహనీయుడు ఎళు త్తచ్చన్ ! ఆయన రామాయణం మలయాళీలమీద చెరగని ముద్రవేసింది. అందుకు నిదర్శనం "భారతం చదివితే ఉమ్మడి కుటుంబం నశిస్తుంది, రామాయణం చదివితే మోక్షం లభిస్తుంది" (భారతం వాయిచ్చాల్ తరవాడి ముడియం, రామాయణం వాయిచ్చాల్ మోక్షం కిట్టుం) అనే నమ్మకం వారిలో కలగడమే.

మొత్తంమీద కంబరామాయణం, ఎళు త్తచ్చన్ అధ్యాత్మ రామాయణం ఒక్క తమిళులకూ మలయాళీలకే కాక సహృదయులైన సాహితీవేత్తల కందరికీ రసగుళికలు ! రసవత్తరము నైన యీ రచనలు నేటికీ ప్రచుర ప్రచారంలో ఉండడం గమనించదగింది. ఇవి ప్రజల కావ్యములు !

—:o:—

# కన్నడ రామాయణాలు

## - డాక్టర్ బాడాల రామయ్య

మనము వేదములను పఠింపక పోయినను, స్మృతులను చూడక పోయినను, పురాణములను త్రిప్పక పోయినను, రామాయణ భారత మహా భాగవతములే మనకు మన సంస్కృతిని వేనోళ్ళ నెలుగెత్తి చాటుచున్నవి. వ్యక్తిని తీర్చిదిద్దెడి రామకథ, సంఘమును సంస్కరించెడి భారతము, ఆత్మతత్త్వమును ప్రతిపాదించు మహాభాగవతము భరతఖండమునందే గాక ఖండాంతరములయందును ప్రాచీన కాలమునుండి ప్రచారమునందున్నవి. తన జాతి ఆచార వ్యవహారములతోపాటు విశ్వతత్త్వమునే సాహిత్యము ధ్వనింప చేయునో దానిని ఉత్తమ సాహిత్య మనవచ్చును. అప్పుడే అది సార్వకాలికమై సార్వజనీనమై యుండును. రాము డెప్పటివాడో, రామాయణ మెప్పటిదో, కడకు రాముడు కాల్పనిక వ్యక్తియో, ఐతిహాసిక పురుషుడో, తేల్చుకొనలేక ఎందరో తర్జన భర్జనలు పడుచుండగా అవతారపురుషుడై అఖండభారతమున నేటికిని రాము డారాధ్యమూర్తి యగు చున్నాడు. చెట్టులో గుట్టలో ఏటి పట్టులో నెటు చూచినను రాముని పేరే వినబడు చున్నది. ఇది రాముని మహిమయో, యీ జాతి సంస్కృతియో, వాల్మీకి కవితా ప్రభావమో, లేక యీ మూడింటిని ముడిపెట్టిన కాలకర్మ సంయోగమో చెప్పలేము.

రాము డన్న ఆస్తికులకే కాదు నాస్తికులకును గౌరవమే. శైవవైష్ణవ శాక్తములే గాక బౌద్ధ జైనములుకూడ రామకథను తమ సిద్ధాంతములకు అనుగుణముగా చిత్రించుకొన్నవి. దేశకాల పరిస్థితులను బట్టి కథా స్వరూపము మారుచుండునే గాని రామునిపై గల భక్తి నాటికిని నేటికిని మారలేదు మారదు కూడ. జాతక కథలయందు రాముని సత్యవ్రతునిగ; ధర్మమూర్తిగ, వైరాగ్య సంపన్నునిగా చిత్రించుటయే గాక బుద్ధునితో సాటివచ్చెడి మహాపురుషునిగా నాతనిని బౌద్ధులు భావించిరి. రాముడు లక్ష్మణుడు సీత యీ ముగ్గురు నొక తల్లిబిడ్డలు.

పితృ వాక్య పరిపాలనార్థమై రాముడు అడవులకు బోయి గడువు తీరిన వెంటనే మరల రాజ్యమునకు తిరిగి వచ్చును. సీతను పెండ్లి చేసుకొనును. నాడు శాక్యులలో చెల్లెలను వివాహ మాడెడి సంప్రదాయ ముండె నట. రావణుని మాటే ఇట లేదు. లంకావతార సూత్ర మనే బౌద్ధ గ్రంథమున రావణుడు మహాతపస్వి, ధార్మికుడు.

కన్నడమున బౌద్ధ సాహిత్యము లేదు. కాని జైన సాహిత్యము నేటికిని జీవంతమై యున్నది. వారి దృష్టిలో రావణుడు విధిచేతిలోని కీలుబొమ్మ. సమస్త సద్గుణములకు స్థానమై యున్న రావణుడు, సీతాసౌందర్యమును చూచి, చలించి, తపించి తుద కా సౌందర్య తేజో దవానలమున దగ్ధుడై పోయిన దౌర్భాగ్యుడు. వాని పాత్రను పరిశీలించినచో పాఠకునిలో నేదో తెలియని వేదన కలుగును. ఈ లక్షణము పాశ్చాత్యుల దురంత నాయకులలో చూతుము. జైనులు, బ్రాహ్మణులు, భక్తులు తమకు తోచినట్లు రామకథను కన్నడమున వ్రాసిరి. క్రీ.శ. 1400 నాటి కుమార వ్యాసుడు భారతమును వ్రాయుచు నీ క్రింది విధముగ చెప్పెను.

"వంకె నాఫణిరాజు రామాయణ మహా రచయితల

భారం బున నడుగిడ≡ గాదు నాకు నా పుణ్యకథలోన్(సం. 1. ప 17)

పై షట్పదిచే నాటికి కన్నడమున రామాయణములు కొల్లలుగా నుండె ననవచ్చును. నాటినుండి నేటివఱకు పెరిగిన రామాయణముల పేర్కొని పుటల పెంచి మిమ్ము విసుగించుటకంటె ప్రసిద్ధములైన మూడు రామాయణములు మాత్రము స్థూలముగా పరిచయము చేసి నాపై మీరు మోపిన భారమును దించుకుందును.

కన్నడమున జైన కవులు తమ కవితా శక్తిచే నేటికిని బ్రతుకుచున్నారు. వారిలో రత్నత్రయ మనగా పంప పొన్న రన్నలు సుప్రసిద్ధులు. పంపనితోనే వారి సాహిత్యము సర్వాంగ సుందరముగ ప్రత్యక్ష మగుచున్నది పొన్నని భువనైక రామాభ్యుదయము నామమాత్రావశిష్ట మైనది. ఎన్నియో గ్రంథములు కాలగర్భమున మరుగై యున్నవి. ఇటులనే మన కవిత్రయములోని ఎర్రన్న గారి రామాయణమును వినుటయే గాని చూచినవాడు లేడు. క్రీ.శ. 1140 ప్రాంతమం దుండిన నాగచంద్రుని రామచంద్ర చరిత పురాణమే కన్నడమున లభించు రామాయణములందు మొదటిది. కుముదేందువు షట్పదులలోను, దేవప్ప రామ విజయ కావ్యమును సాంగత్య ఛందస్సునను, పద్మనాభుడు, చంద్రశేఖరులను జైన కవులు రామచంద్ర చరితమును వ్రాసిరి. పై జైనకవులందరి

యందును మొదట పుట్టిన రామచంద్ర చరిత పురాణమే కవితా గుణముల యందు ప్రథమ శ్రేణికి చెందుచున్నది. మహారాష్ట్రీ ప్రాకృతమున విమలసూరి రచించిన "పఉమ చర్య" నాధారముగ చేసి కొన్ని కన్నడమున నాగచంద్రుడీ కావ్యమును వ్రాసెను. ఇది చంపూ గ్రంథము. 16 ఆశ్వాసముల పరిమితి కల ఉత్తమ కావ్యము. నాగచంద్రుని గురువు బాలచంద్రముని. "అభినవ పంప" డను బిరుద మీ కవికి గలదు. కనుకనే దీనికి పంప రామాయణ మని నామాంతరము. జైనుల సిద్ధాంతము ననుసరించి యీ కావ్యమున రావణుని చంపెడివాడు లక్ష్మణుడు. రాముడు చరమ జీవి. ఈ సిద్ధాంత మెట్లుండినను ఇతని కవిత మాత్రము మృదు మధురమై అడుగడుగున పంపని తలపించు చుండును. కాని పంపనిలో నున్న గాంభీర్యము, కవితా శిల్ప మీ కవియందు తక్కువ. ఇతడు "విజయ పుర"మున మల్లి నాథ దేవాలయమును కట్టించెనట. ఇది యెక్కడ ఉన్నదో యింకను స్థిరముకాలేదు. ఇతడు రచియించిన మరియొక గ్రంథము దొరకుచున్నది. అది "మల్లి నాథ పురాణము" ఇతని రామాయణమే ప్రసిద్ధియం దున్నది. జైనుల మత ధర్మ మెట్లుండినను సాహిత్య దృష్టితో చూచిన నాగచంద్రుని పాత్రలు, సన్నివేశములు, వస్త్వైక్యము, రమణీయముగ నుండును. కాని జన్మలతా పరంపరా పరివేష్టితమైన పాత్రలతో వ్యక్తావ్యక్త మగు కథాసరిత్తు కవితాతటిల్లతలతో దుర్గమంబగు నీ కావ్యమందు తొంగితొంగిచక దోబూచులాడుచుండును. మెలకువతో రసజ్ఞులమై మన మీ కథా సరిత్తులబట్టి పోయిన కవితామృతము తప్పక మనకు లభియింపగలదు.

సంస్కృత ప్రాకృతములయందే జైనపరమగు రామాయణము లున్నవి. త్రిషష్టి శలాకాపురుషులయందు జైన సిద్ధాంత మభి వ్యక్తమగుచున్నది. 24 మంది తీర్థంకరులు 12 మంది చక్రవర్తులు 9 మంది బలభద్రులు 9 మంది వాసుదేవులు 9 మంది ప్రతివాసుదేవులు వారిలో గలరు. అహింసయే వీరి సిద్ధాంతమునకు వెన్నెముక. అహింసావ్రతమున కర్మ నశించును. కర్మక్షయమున నిర్వాణ మేర్పడును. నిర్వాణ స్థితినిగూర్చి గాని, కర్మబద్ధమగు జన్మ పరంపరల మూల కారణమునుగూర్చిగాని ఇత్యర్థము చేయరు. ఆద్యంతముల త్యజించి యీ ఆత్మవాదులు వర్తమానమును మాత్రము చక్కని తర్కముతో సహజముగ చిత్రింతురు. కర్మక్షయ మగుచున్న రాముడు చరమజీవి. ఆతనిలో స్థితప్రజ్ఞ లక్షణములు భాసించును. ప్రతివాసుదేవు డగు రావణుని బలభద్రస్థానమునం

దున్న యీతడు చంపడు. హింసాకర్మచే నరకము ప్రాప్తించు నని వారి సిద్ధాంతము. వాసుదేవు డగు లక్ష్మణుడు మాత్రమే రావణుని చంపి కడపట నరకమునకు పోవును. ఈ జీవకోటిని ఆడించు విధిసూత్ర మొకటి కలదు. అదియే వాసుదేవ ప్రతివాసుదేవుల అనిరీక్షిత ఘటనలచే పైకెత్తుచు, క్రిందికి పడవేయుచు జగద్విలాసమును చిత్ర విచిత్రగతుల త్రిప్పుచున్నదట.

కనుకనే ప్రతివాసుదేవు డగు రావణుని జైనకవులు ఉదాత్తముగ చిత్రింతురు. వారి పాత్రలు సహజగంభీర ప్రవర్తనల ప్రవర్తింతురు. తర్కమునకు చక్కని ఆత్మతత్త్వము లోకమున విరుద్ధముగ వారికి కన్పించును. అట్టిపాత్రల వారు సృజింపరు, క్రీ.శ. 3వ సంవత్సరము నాటికే ప్రాకృతమున విమలసూరి వ్రాసిన పఉమచర్య వాల్మీకిరామాయణముపై ప్రశ్నపరంపరల గురిపించినది. బలవంతు లగు రాక్షసులను కోతులు జయించు టెట్లు ? జైనధర్మ పరాయణుడైన రావణుని మాంసాహారిగను పదితలలు ఇరవై చేతులుగలభయంకరమూర్తిగను చిత్రించుట కవుల అభూతకల్పన. ఆరునెలలు నిద్రించుట ఆరునెలలు మేల్కొనుట ఎవ్వరికైనా సాధ్యమగునా ? ఇది లోకవిరుద్ధము కాదా ? నిద్రించునప్పు డేనుగులు త్రొక్కినను, చెవుల సీసము కాచి పోసినను మెలకువ రాకుండుటయే గాక మేల్కొనినంతనే ఎదుటబడు ఎనుముల ఏనుగుల గావుకొనువ్యక్తి యెట నైన గలడా ? కోతులు సముద్రమును దాటగలవా ? దేవేంద్రుని బంధింప నెవ్వరికి సాధ్య మగు నని విమలసూరి పాత్రలు ప్రశ్నించి వాల్మీకిని పరోక్షముగ ఎత్తిపొడుచుచున్నవి. లోకవిరుద్ధముగా కాని జైన సిద్ధాంతమునకు తగినట్లు రామ కథను చెప్పెద నని విమలసూరి పఉమచర్యను రచియించెను. తదనుగుణముగ కన్నడమున నాగచంద్రుడు వ్రాసెను. నాగచంద్రుడు యథాతథముగ విమల సూరి ననుసరించినను అచ్చటచ్చట కాలానుగుణముగ కొన్నిమార్పులు చేసెను. రవిసేనుడు సంస్కృతమున వ్రాసిన జైన రామాయణమును కన్నడమున కుముదేందువు షట్పదులలో 13వ శతాబ్దమున వ్రాసెను. ఈ సంస్కృత జైన రామాయణమున సీత రావణుని కూతురు. మాయలేడి వృత్తాంతము వచ్చును. కాని లక్ష్మణుడే ఇటకూడ రావణుని చంపును. కన్నడమున గల జైనరామాయణములే గాక వాల్మీకి మతమున నడచిన రామాయణము లందును నాగచంద్రుని రామాయణమే నేడికిని కవితా బలముచే బ్రతుకుచున్న దని మొదటనే చెప్పి

యుంటిని. స్థూలముగా నా కథాస్వరూపము తెలుసుకొనుట మనకు అప్రస్తుతము కాదు.

రావణుడు దక్షిణ భారతమున సింహ పరాక్రముడై లంకను రాజధానిగా చేసుకొని పాలించుచుండెను. ఉత్తర భారతఖండమున దశరథుడు అయోధ్యను జనకుడు మిథిలను పాలించుచుండిరి. ఉత్తర దక్షిణములకు మధ్య గల కిష్కింధకు సుగ్రీవుడు ప్రభువై యుండెను. వీరు కపిధ్వజులే గాని కపులు గారు. ఖేచర వంశీయులు. గగనమున సంచరించెడి శక్తి కలవారు. రావణుడు రాక్షస వంశీయుడే గాని రాక్షసుడు కాడు. తోయదవాహన వంశమున పుట్టినవాడు. కైశికి తల్లి. రత్నశ్రవసుడు తండ్రి. ఈ దంపతులయందు రావణుడు, భానుకర్ణుడు (భానుకర్ణునికి కుంభకర్ణుడని బిరుదము గలదు.) విభీషణుడు చంద్రనఖి యను వారు కల్గిరి రావణుడు తపస్సుచే ఖేచరీ విద్యను సంపాదించెను. చంద్రహాసమును పొందెను. అపూర్వశక్తుల నార్జించెను. మయుడు తనకుమార్తె యగు మండోదరిని ఆతని కిచ్చి వివాహము చేసెను. తన ముత్తాత యగు మాలియను వానిని చంపి లంకను ఆక్రమించిన వైశ్రవణుని రావణుడు మరల జయించి ఆతని కున్న పుష్పకవిమానమును, చక్రమును, స్వాధీనము చేసికొనెను. లంక నాక్రమించి చైత్రయాత్రకు పోయెను. పరరాజులను యుద్ధమున జయించినను చంపలేదు. దయతో వదలివైచెను. జినమునుల సేవించెను. చెఱగొన్న పరరాజుల ఇంద్ర సహస్రబాహుల జినమునుల ఆజ్ఞమేరకు విడచి వారిరాజ్యముల వారికే వదలివేయును. ప్రజల బాధల చూచి వరుణుని యుద్ధమున జయించినను విడిచి పెట్టును. పరనారీవిరతివ్రతమును స్వీకరించి తన్ను గోరి వచ్చిన ఉపరంభను తల్లివలె రావణుడు గౌరవించును చుట్టు పట్టుల జయించినను వారితో సంబంధ బాంధవ్యముల పెంచుకొనెను. వరుణుని జయించుటకు తోడ్పడిన హనుమంతునికి తన చెల్లెలిబిడ్డ నిచ్చి వివాహము చేసెను. సుగ్రీవుని చెల్లెలగు శ్రీప్రభను పెండ్లియాడి కిష్కింధావాసులతో రావణుడు బంధుత్వము నెరపెను. పరాక్రమము, రాజనీతి, దయ, త్యాగము, సౌజన్యము, క్షమ, ధర్మరతి కలవాడు రావణుడు. దశాస్యు డనుట ఆతనికి గల బిరుదము. రావణుడు పుట్టిన 11వ నా డొకరు రత్నపదక మాతనికి బహుమతి యిత్తురు. రావణుని తల తక్కిన తొమ్మిది రత్నములందు ప్రతిఫలింప అతనికి దశాస్యుడని నామకరణము చేతురు. పురాకృత పుణ్యవిశేషముచే భరతఖండమున అజేయుడై యున్న రావణుడు సీతా

సౌందర్యమును చూచి విధిప్రభావముచే మోహించి తపించి, పరనారీ విరతివ్రత మును కూడ త్యజించి ఆమెకై అర్రులు చాచి దురంతమరణమును పొందును. విధి ప్రభావమును చక్కగా నాగచంద్రుడు తన కావ్యమున సూత్రీకరించును.

ఉత్తరభారతమును నరవరశ్రేష్ఠులగు దశరథజనకాదులు పాలించుచుండిరి. ఒకనాడు నారదుడు వారిచెంతకు వచ్చి రావణుని మరణము జానకీదాశరథులచే విధినిశ్చితమై యుండినట్లు లంకలో నైమిత్తికులు చెప్పి రనియు; విభీషణుడు అగ్రజసంరక్షణార్థమై దశరథుని, జనకుని సంహరింప యత్నించుచున్నా డనియు తగినరీతి మీరు జాగ్రత్తగా నుండతగు నని వారిని హెచ్చరించెను.

దశరథుడు జనకుడు లక్కయంత్రములతో తమ బొమ్మలను తయారు చేయించిరి. అవియే ఆ రాజ్యములను పాలింపుచుండ గుట్టుగ పరదేశములకు వారు పయనించి విలాసయాత్రల కాలము గడుపుచుండిరి. విభీషణుని సేవకు లారాజ్యముల ప్రవేశింపలేక పోయిరి. అంత విభీషణుడే వచ్చి గవాక్షులనుండి ప్రవేశించి, యంత్రనిర్మితము లగు లక్కబొమ్మల తలల ఖండించి లంకకు వెడలి నిశ్చింతగ నుండెను. కాని కవి యిట "లలాటదోళ్ విధియు బరెద లిపి జలలిపియే" (లలాటమున విధి లిఖించు లిపి జలలిపియే) అని హెచ్చరించి దశరథుని స్వయంవరమంటపమునకు తీసికొని పోయెను. ఆస్వయంవరమున కైక ఆతనిని వరించును. తనపై బడిన రాజులనెల్ల దశరథుడు జయించును. ఆ సందర్భమున కైక సారథ్యము చేసి దశరథునికి తోడ్పడును. భర్త వరములను ప్రసాదించును. వలసినప్పుడు స్వీకరింతు నని కైక చెప్పెను. దశరథుడు అయోధ్యకు వచ్చి మహావైభవముగ కైకను వివాహము చేసికొనెను. కైకకు ముందే దశరథునికి ముగ్గురు భార్య లుండిరి. కౌసల్య పేరు అపరాజిత మొదటిది. సుమిత్ర రెండవది, సుప్రభ మూడవది. ఇప్పుడు నాల్గవది కైక. నైమిత్తికులు సూచించినటులే దశరథునికి పైనల్గురియందును క్రమముగా రాముడు, లక్ష్మణుడు. శత్రుఘ్నుడు, భరతుడు జన్మించిరి. వారు సకల శస్త్ర శాస్త్ర పారంగతులైరి.

దశరథుని మిత్రుడు జనకుడు. ఆతని భార్య వైదేహి. వారికి కవల పిల్లలు పుట్టెదరు. వారిలో సీత ఒకతె. రెండవ మగబిడ్డను నిశాచరు డొక్కడు పుట్టిన వెంటనే పురుటింటినుండి ఎత్తుకొనిపోయి చక్రవాళ పురమున రాజాంతః పురమున పడవైచెను. ఆ రాజు ఇందుగతి. అనాలోచితముగ ప్రాప్తిగొన ఆ

బిడ్డను పెంచి పెద్దచేయును. ఆతడే ప్రభామండలుడు. ఒకనాడు జనకుని పట్టణముపై ఆటవికులు వచ్చి పడెదరు. వారిని జయింప దశరథుని సహాయ మాతడు కోరెను. మిత్రుని సహాయమునకై దశరథుడు పోనుండగా, రామ లక్ష్మణులు తండ్రిని వారించి జనకుని పట్టణమునకు పోయి ఆటవికుల పరి మార్తురు. రామలక్ష్మణుల టంకార ధ్వనిని కవి సొగసుగా వర్ణించెను.

"మారణమంత్రనాద మనిపించె విరోధికి, శాంతికక్రియా
కారణమంత్రనాద మనిపించె ధరిత్రికి, మృత్యువంచనో
చ్చారణమంత్రనాద మనిపించెను మాకు, భవద్గుణోగ్ర టం
కారము మోద మందరికి నన్నివిధంబుల గూర్చి యెట్టులో"

యని జనకుడు రాముని కీర్తించును. నాగచంద్రుని పద్యము నే కొలది మార్పు లతో తెలుగున వ్రాసితిని. రసజ్ఞులు ఇందలి సొగసుల గ్రహింప వచ్చును. రామునిశక్తి సామర్థ్యముల గ్రహించి ఆతనికి తనబిడ్డ యగు సీత నిచ్చుట కప్పుడే జనకుడు మదిలో నిశ్చయించుకొనెను. అతడు రామ లక్ష్మణుల తగురీతి గౌరవించి అయోధ్యకు బంపెను.

చక్కనిచుక్క యగు జానకి మదనదేవుని జయించు డిండిమమై యున్న దట. ఆ సౌందర్యమునకు నారదుడు కూడ భ్రమించి నవ్వులపాలయ్యెను. రథ నూపుర చక్రవాళపురమున ప్రభామండలుడును చూచునట్లు జానకీదేవి చిత్రమును నారదుడు పడవేయును. ఆ చిత్రగతసౌందర్యమునకు ప్రభామండలుడు వలచి వగపుల మూర్ఛపోవును. ఇందుగతి యీ విషయమును దెలిసి జానకిని తెప్పించి పెండ్లిచేతు నని కుమారునికి మాట యిచ్చెను.

అంత నాతడు వంచనచే జనకుని తనపురమునకు రప్పించుకొనెను. ఆతనికి అతిథిమర్యాదల రాజగౌరవముల నెరపి, జానకిని తన పుత్రునికి నీయ వలె నని ఇందుగతి ఆతనిని ప్రార్థించును. కాని జనకుడు తన బిడ్డను రామునికి ఇచ్చునట్లు ముందే నిశ్చయించితి ననియు, రామలక్ష్మణులు కారణపురుషు లగు బలాచ్యుతులనియు చెప్పెను. అంత ఇందుగతి తనచెంత నున్న వజ్రావర్తమును రాము డెక్కువెట్టినచో నాతనికి సీత నిచ్చి పెండ్లి చేయుము. లేనిచో తనకుమా రునికే యీయవలె నని జనకునిచెంత నాతడు మాట తీసికొనెను. ఆమాటకు కట్టువడి జనకుడు మిథిలానగరమునకు వజ్రావర్తసాగరావర్తము లను దివ్య

చాపములతో వచ్చి చేరెను. స్వయంవరము చాటించెను. వజ్రావర్తము నెత్తి యెక్కువెట్టినవానికే సీత నిత్తునని చాటెను. రాముడా పరీక్షలో నెగ్గును. రాజులాతనిపై బడిరి. లక్ష్మణుడు సాగరావర్తమను చాపమును పట్టి ఎదిరించి రాజలోకముల నిర్మూలము చేసెను. హతాశుడై ప్రభామండలుడు మూర్ఛపోవును, కాని అవధిజ్ఞానముచే సీత తన కీజన్మమున చెల్లె లనియు క్రిందటిజన్మమున ప్రియురాలై యుండె నని తెలిసి ప్రభామండలుడు మనసు మార్చుకొనెను. రామలక్ష్మణులే ఆ కాలమునకు బలాచ్యుతు లని గ్రహించి ఇందుగతి జినదీక్ష బూనును. అయోధ్యలో సీతారాములవివాహము వైభవముగా జరుగును. రామలక్ష్మణుల పరాక్రమ భాగ్యములను చూచి "భరతుడు లోభరతుడై జినదీక్ష బూన సంకల్పించును. ఈ విషయము దెలిసి కైక దశరథునితో చెప్పి జనకుని తమ్ముడగు కనకునికూతును దెప్పించి వివాహము జరిపించును. దశరథుడు జిన దీక్ష బూన యత్నించి రామునికి పట్టముగట్ట సిద్ధపడును. కైక తనబిడ్డ యగు భరతుని ప్రకృతి దెలిసి తనభర్త తనకు ముందిచ్చియుండిన వరమును గోరి భరతునికి 14 సంవత్సరముల రాజ్య మీయవలె నని అడుగును. రాముడా మాటలకు సమ్మతించి తమ్మునికే ఆరాజ్యమును వదలి తాను 14 సంవత్సరముల చైత్రయాత్ర గావింతు నని సీతాసౌమిత్రులతో వెడలిపోయెను. దశరథుడు జినదీక్ష పొందెను. భరతుడు రాజయ్యెను.

ఎదిరించిన రాజుల జయించుచు, జయించిన రాజ్యముల ధర్మసంస్థాపన గావించుచు, దుష్టుల శిక్షించుచు; శిష్టుల రక్షించుచు, రామలక్ష్మణులు వింధ్యను దాటి దండకారణ్యమున ప్రవేశింతురు. ఈ చైత్రయాత్రలో రామలక్ష్మణులు కారణపురుషు లనియు నాటి బలభద్రవాసుదేవులనియు లోకము గ్రహించును జయించిన రామలక్ష్మణులకు పేరు ప్రతిష్ఠలతో పాటు పెక్కు సుందరీమణులతో పెండ్లిండ్లు జరుగును, రాముడు చిత్రకూటమునం దుండగా భరతుడు కైకతో వచ్చి రాముని దర్శించి తనకారాజ్యము వలదనియు రాముడే యేలవలె ననియు ప్రార్థించును భరతునిలో నీగుణము సహజముగా పుట్టినది కాదు. పెదతల్లి యగు అపరాజితాదేవి సీతారాముల వియోగమునకై దుఃఖించుచుండెను. ఆమెదుఃఖమును చూడలేక కైక భరతునితో వచ్చి రాముని చూచెను. రాముడు తల్లికి నమస్కరించెను. తమ్ముడగు భరతుడు కోరినట్లే 14 సంవత్సరములైనతరువాత అయోధ్యకు

వచ్చెద ననియు రాజ్యమును సేకరింతు ననియు మాట యిచ్చెను. చిత్రకూటము నుండి దక్షిణమునకు పయనించి కడపట వారు పాతాళలంకకు చేరెదరు.

పాతాళలంక ఖరుని అధీనమునం దుండెను. ఖరునిభార్య చంద్రనఖి. ఈయిరువురికి పుట్టినవాడే శంబూకుడు. శంబూకుని మేనమామ రావణుడు. మేనమామ యగు రావణుడు చంద్రహాసమును పొందినటులే తానుకూడ సూర్యహాస మను దివ్యఖడ్గమును పొంద 12 సంవత్సరములు శంబూకుడు తపస్సు చేయుచుండెను. తపస్సు ఫలించుకాలమునకు రామలక్ష్మణు లచ్చటికి వచ్చిరి. ప్రకృతిసౌందర్యమును చూచుచు లక్ష్మణు డాపరిసరారణ్యముల చరించుచుండగ మందారపుష్పములవాసన లక్ష్మణుని నీడ్చి తపోభూమికి తీసికొనిపోయెను. శంబూకునితపస్సు ఫలింపనున్నది గనుక మందారపుష్పార్చితమైన సూర్యహాస మావెదురుపొదలలో నిక్షిప్తమై యుండెను. వెదురుపొదలమధ్య శంబూకుడు నిశ్చలతపస్థితుడై యుండెను. మందారపుష్పపరిమళములబట్టి వచ్చినలక్ష్మణునకు దివ్యఖడ్గము కనుపించెను. ఆ కత్తిని గ్రహించి దానిపదును పరీక్షింప ఇటునటు త్రిప్పగా వెదురుపొదల తపసుచేయు శంబూకునితల నిమిషమున ఎగిరిపడెను. నిరపరాధిని చంపితినే అని లక్ష్మణుడు అన్నగారిచెంత జరిగినది చెప్పి చింతించును. ఇది విధివిలాస మని రాముడు చెప్పెను. పాతాళలంకకు రాకమునుపే క్షేమాంజలిపురమున లక్ష్మణుడు శక్తిని స్వాధీనముచేసికొని, ఆపురవరాధీశ్వరుడగు శత్రుందమునికూతురు జితపద్మను వరించియుండెను. జితపద్మను చేపట్టినవాడే దక్షిణభారతఖండమునకు ప్రభు వగునని ముందే సూచింపబడియుండెను. అనాయాసముగ లక్ష్మణునికి విజయపరంపర ప్రాప్తించినది. సాగరావర్త మను దివ్యచాపము మిథిలలో నితనికి దక్కెను. ఇప్పుడు శంబూకుడు 12 ఏండ్లు శ్రమింపగ సిద్ధించిన సూర్యహాసము లక్ష్మణుని కైవశ మయ్యెను. అంతే కాదు, దేనికై శంబూకుడు తపస్సుచేసెనో ఆ దివ్యఖడ్గముచేతనే అతడు మరణించెను. అతడే కాదు అతని తండ్రియగు ఖరుడుకూడ సూర్యహాసముచే ఖండింపబడును. ఇదే విధివిలాసము.

తన బిడ్డయగు శంబూకుని తపస్సు నేటికి ఫలించు నని తల్లి యగు చంద్రనఖి పేరాసతో నటకు వచ్చెను. వచ్చి కొడుకును చూచి

'తనయునితల యొక వైపున
తను వాకవైపున తెగిపడు దారుణముకనన్
జనని భయం బెగసెను ఇం
ధనమై ఘనశోకశిఖల తప్తంబగుచున్.'

హతాశయై; భయాందోళనలతో

'ఖరనందనునిన్ దశకం
ధరుమేనల్లుని మదీయతనయుని శంబున్
తరిగిరి శిర మెవరో' యని
కరముల తలబాదుకొంచు కదలె జననియున్॥ 1

అడుగడుగున శంబూకుని గూర్చి ఆ చంద్రనఖి ఆక్రందించుచు తనకెంత బలగ ముండిన తన బిడ్డను రక్షించువారు లేకపోయిరే యని దుఃఖించినది. ఆశ నిరాశయై, నిరాశ దుఃఖమును కల్గింప దుఃఖ మాతల్లిలో క్రోధమును రేపినది.

వెడవెడ శోకరసంబున
కడుకోపము పెచ్చుపెరిగి కనకన యగుచున్
సిడిలున్ ప్రిపిమలగ కల్పపు
కడగాలపు కణముట్లు కామిని రేగెన్॥

క్రోధానలజ్వాలయై ఆ కామిని పుత్రహంతకుని వెదకుచు పోయి రామలక్ష్మణుల చూచినది. లక్ష్మణుని సౌందర్యములో పుత్రవ్యధ మరుగయ్యెను. మన్మథ పీడితయైన ఆమె మనసుతోపాటు ఆమె రూపముమారిపోయెను.

రూపాంతరముం గనె వి
ద్యాపరిణతచే వియచ్చరాంగన కన్యా
రూపము భావింపగ తా
రాపతి తారుణ్య లక్ష్మి రాజిల్లెననన్॥

మాతృశోకముతో కల్పాంత శిఖియైన కాంతామతల్లి కన్నెపిల్లగా మారినది. ఇది జైనుల సిద్ధాంతమో కవితా దేవత పన్నిన ఇంద్రజాలమో కాని పాఠకులకు మాత్రము కుతూహలకారియై యున్నది.

---

1. ఈ వ్యాసమున సూచించిన పద్యములు కన్నడ పద్యములకు నాతెలిగింపు.

తారాపతి తారుణ్య లక్ష్మితో విలసిల్లు ఆమాయలాడి రామలక్ష్మణుల చేరి తా ననాథననియు తన్ను వారిలో నొక్కరు గాంధర్వ విధి పెండ్లి యాడవలె ననియు ప్రార్థించెను. దాని చాలకము చూచి జానకి చిరునవ్వు నవ్వెను. ఆ నవ్వునకు చంద్రనఖి మండిపడి కనుచూపుమేర దూరము నడచి మరల అదృశ్యమై గగనయానమున ఖరుని సమీపించి రామలక్ష్మణులే శంబూకుని చంపిరని యేడ్చినది. ఖరుడు 14 వేల సైన్యముతో వారిపై బడెను. కాని లక్ష్మణు డొక్కడే వారిని హతమార్చునని చెప్పి వెడలిపోయెను. ఇంతలో శంబూకుని మరణవార్త విని రావణుడు పాతాళలంకకు పుష్పకముపై వచ్చెను. వచ్చి రామునితో నున్న సీతను చూచెను. ఇటనుండి రావణుని పతనము ప్రారంభమయ్యెను.

జానకి సౌందర్యము వాని ''చూపులకు వల'' హృదయమునకు ''వజ్రపు సంకెల'' పద్మ పత్రజల బిందువువలె వాని మనస్సు చంచలించెను. కనుచూపు మేరలో నిలిచిన రావణు డామెను చూచి

హారమరీచి మంజరి సుధారసధార సుధాంశు
లేఖ కర్పూరసలాక నేత్రసుఖదాయక మౌనివి
కాని యీమె శృంగార సముద్రమున్ తరచుగా
మది నుద్భవమందె నంచు కన్నార దశాస్యు
డుం గనె గనంగని మన్మథు డార్భటించెచో!

ఆమె మరీచి మంజరి సుధారసధారలనుచు కర్పూర సలాక యనుటచేతనే రావణుని అంత్యమును కవి ధ్వనింపచేసెను. సీతనుకన్నార చూచురావణునిగాంచి మన్మథుడు ఆర్భటించెనట. ఇంతవఱకు ఎందరో సుందరీమణులు అతని గోరి వచ్చివిఫలలై పోయిరి. మన్మథుడు నిస్సహాయుడై యుండెను. ఇంత కాలమునకు తాను రావణుని గెల్వకలిగితినని మన్మథుని ఆర్భాటము. అంతే తలంచినంతనే అవలోకిత విద్య రావణునికి ప్రత్యక్షమయ్యెను. ఆ దంపతు లెవ్వ రని రావణుడా దేవతను ప్రశ్నించెను. ఈ కాలమున బలాచ్యుతులైన రామలక్ష్మణులయం దీతడు రాముడు వీరు దశరథుని పుత్రులు. ఈమె యీతని భార్య. పేరు సీత జనకుని కూతురు రథనూపుర చక్రవాళపురమును పాలించు ప్రభామండలు డీమెకు సోదరుడు. అన నీ జంటను విడదీయు ఉపాయ మాత డడుగగా ఆ దేవత చకితురాలై వీరు

సామాన్యులు గారు "అధిక బలుల్‌కారణ పురుషుల్ వీరితో నిష్కారణముగ విరోధము తగునే"? ధర్మమును శాసించు నీవే ధర్మమును తప్పతగునే? 14 వేల మందితో కూడిన ఖరుని ఆ సహాయుడై లక్ష్మణు డొక్కడే పరిమార్చ సీతఁకీ కాంతామణితో వీతశంకుడై వినోదముగ నిట కాలము గడుపుచున్నా డనెను.

ఏ నొక్కటి ప్రశ్నించిన
చో నీ వొక్కటి వచింప చూచెదవేరా!
మానవమాత్రులె యీలం
కానాథుని చంపువారు? కాదని కినిసెన్.

గద్దించిన రావణుని చూచి కోపించి ఆ దేవత వీనికి వీరిచే మరణము తప్పదు. ఇది కర్మాధీన మని నిర్ణయించి వాడు కోరినటులే ఆమె సింహ నాదము చేసెను. ఆ ధ్వని లక్ష్మణుని దని వెరచి రాము డామెను విడిచి యుద్ధ భూమికి పోయెను. రావణు డా సీతను చేరి కాలాహిని పసికందు పట్టినట్లు పక్షి పుష్పకముపై పెట్టుకొని లంకాభిముఖుడై పోయెను. రసికుడగు రావణు డామెన లాలింప యత్నించెను. ఇంతలో నెదిరించిన జటాయువును పక్షచ్ఛేదముకావించి దాని తండ్రిపై గల అభిమానముతో దానిని రావణుడు ప్రాణములతో వదలెను సంభోగ సుఖంబునకై తహతహలాడుచున్న వాని కన్నులు ఆమె సర్వాంగ ముల కౌగిలించెను; మాటలు మదనరాగోన్మాదమున వెలువడెను. చేరదీయ చాచిన చేతులు చాచినట్లే నిలుచినవట. దర్పకుడు దండించిన రావణుని రూపమ తిక్కనగారు చిత్రించిన కీచకుని తలపించును. "మహాసతి" యగు సీత వాని వికృతాకారమును చూచి "నీవు నన్ను ముట్టినచో నాల్కపెరకికొని చత్తు" నని పల్కెను. కాలమే ఆమెను సరిదిద్దగలదని కార్యవాది యగు రావణుడు హద్ద మీరలేదు. ఆమెను దేవీ యని గౌరవించెను. కాని, కవి దుఃఖించుచున్న జానకిని వర్ణించుచు

స్తనయుగ్మంబున ముత్తెపు
మణిహారము బాష్పబిందుమండలి నిడె; లో
చనయుగ్మ మరుణ మణిమం
డనమున్ చెవి కిడెనన అరుణప్రభ లెగసెన్॥

పైరీతిగ చెప్పెను. స్తనములపై ముత్తెపు హారమువలె భాష్పము లున్నవి. ఆహారమును వేయువానిని, చెవిలో కుండలముల పెట్టువానిని కూడ కవి యిట ధ్వనింపచేయుచున్నాడు. కాని, వాని యీ కృత్యము దుఃఖప్రదమన ఆమె కన్నీటిచే సూచించుచున్నాడు. కంటికి కట్టునట్టు లీ దృశ్యముల దీర్ఘ భావాంత రముల ధ్వనింపచేయు ఉత్తమ రచన నాగచంద్రునిది. అప్పుడు "క్రూరుండు వంచకుండు నవిచారి దురాచారి నన్ను సరగున గొనియెన్ హారామా! హా రామా! వారించెడి వా రెవ రని వనితయునేడ్చెన్" అంత రావణు డామెను బెద రింపక ఆరాధించు ప్రణయోపాసకునిగా కవి చిత్రించును. యుద్ధభూమినుండి తిరిగివచ్చిన రాముడు సీతను చూడలేక దిక్కులచూచుచు "హా హా జనకసుతా! వైదేహీ! వైదేహి యంచు త్రెళ్ళగ మనసున్ మోహతమోదీపము వాతాహతిచే సారి నటు లతడు మూర్ఛిల్లెన్॥" కొంతకాలమునకు మేల్కొని పిచ్చివానివలె పసిపాపవలె రాముడు సీతకై ఏడ్చెను. ఇంతలో లక్ష్మణుడు వచ్చి కలసికొని జరిగినకథను విని బాధపడెను. సీతను రావణుడు లంకానగరికి తీసికునిపోయెను. అంతవరకు వాడు రావణుడని ఆమెకు తెలియలేదు.

పాతాళలంకను విరాధునికి స్వాధీనము చేసి లక్ష్మణుడు అన్నతోపాటు సీతాన్వేషణలోబడెను. జటాయువు సీతను రక్షింపతలచి తానే చచ్చితినని వారికి చెప్పి మరణించును. రాముడు దానికి దహనసంస్కారము చేయును. ఇట లంకలో రావణుడు సీతకు తన వైభవముల చూపి మురిపింప యత్నించి విఫలు డగును. ఖరదూషణాదుల మరణవార్త విని రావణుడు చింతించెను. పుత్రశోక ముతో తపించు చెల్లెలకు సంసారసుఖ మింతే యని వైరాగ్యమును బోధించును. మనసు మార్చుకొనలేని మగని మన్మధవ్యధకు చింతించి, తానే మారి మండోదరి సీతను రావణుని పట్టమహిషను చేయ యత్నించును. కాని సీత కులసతికి యిది మర్యాదకా దని మందలించెను. రావణుడు అచ్చటికి వచ్చెను. ఆమె దుఃఖమును రావణుని చర్యను చూచి విభీషణుడు పతివ్రతలు బాధింపతగరని అన్నకు చెప్పెను. అవలోకితాదేవి వాక్కులనే పెడచెవిని పెట్టిన కాముకున కీతమ్ముని మాటలు నచ్చునే?

రామలక్ష్మణులు పాతాళ ప్రభు వగు విరాధుని సాహాయ్యమున సుగ్రీవుని చూతురు. కిష్కింధకు పోయి మాయాసుగ్రీవుని చంపి సుగ్రీవుని రక్షింతురు. సుగ్రీవుడు సీతను రావణుడు హరించె నని తెలుసుకొనెను. కాని అతడు బలవం

తుడు. నయముగా రావణుని సాధింపతగును. విభీషణుడు సత్వసంపన్నుడు. ఆతనిచే మన మా రావణుని మనసు మార్చతగునని జాంబవదాదులు సూచించిరి. సముద్రమునుదాటి సీతాస్థితిని తెలిసి రాగలవాడు హనుమంతు డొక్కడే యని వారు చెప్పగా హనుమద్వీపము నుండి హనుమంతుని సుగ్రీవుడు బిలిపించును. ఇంతలో లక్ష్మణుడు రావణు డంత బలవంతుడైనచో వంచనతో సీతను హరింప నేల? ఆతనిని తప్పక తాను జయింతు నని చెప్పెను. రావణుని చంపగలవాడు సమీపమునగల ఒక పర్వతము నెత్తగల రని వారు చెప్పిరి. లక్ష్మణుడు దానికి సమ్మతించెను. అందరు విమానమున అచటికిపోయిరి. లక్ష్మణు డా పర్వతము నవలీలగా ఎత్తి భుజములపై పెట్టుకొనెను. దేవతలు పూలవాన కురిపించిరి. రావణుని చావు నితని చేతిలో నిశ్చయమని వారందరు విశ్వసింతురు. ఈ విషయమును హనుమంతుడు విని తాము జయింపలేని మాయాసుగ్రీవుని జయించి మరల సుతారను సుగ్రీవునికి కూర్చిన రామలక్ష్మణులు కారణపురుషులని భావించెను. భావించి వచ్చి వారిని భక్తితో చూచి హనుమంతుడు నమస్కరించెను ఆంజనేయుని భక్తిప్రపత్తులచూచి యితడే సీతావార్తను తెల్పగలడని నమ్మి తన ఉంగరము నాతని కిచ్చెను. ఆతడు లంకకు పోయి సీతాస్థితిని దెలిసి వచ్చి రామునికి దెల్పెను. రామలక్ష్మణులు సుగ్రీవాదులతో కూడి లంకపై దండెత్తి పోదురు. రావణుని బిడ్డలు తమ్ములు రామునికి చిక్కి బందీలయ్యెదరు. రావణుడు బహురూపిణీ విద్యను సాధించును. సీతకు తన అసాధారణ బహురూపిణి విద్యను తెలియజెప్పెను. దానితో ఆమె మూర్ఛపోవును. ఆమె శీలమునకు పాతివ్రత్యనిష్ఠావ్రతమునకు రావణుడే ఆశ్చర్యచకితుడై ఆమెను అభినందించును. రణమున రామలక్ష్మణుల జయించి సీతకు కానుకగా నిత్తునని ఆ శూరుడు యుద్ధమునకు పోయెను. లక్ష్మణుని ఎదిరించెను. తనశక్తితో ఆతనిని మూర్ఛిల్లచేసెను. కాని మూర్ఛాన్వితుడైన ఆతనికి హానితలపెట్టని ధర్మవీరు డాతడు. లక్ష్మణుడు విశల్యా సుందరిచే మేల్కొని రావణునితో తలపడెను. రావణుని బహురూపిణి విద్యచే లక్ష్మణుడు చంపిన కొలది అతనిలో పలువురు రావణులు పుట్టుచుండిరి. రావణుని చంద్రహాసము లక్ష్మణుని సూర్యహాసముచే విఫలమయ్యెను. కడపట రావణుడు చక్రమును ప్రయోగించెను. అది లక్ష్మణుని ముమ్మారు ప్రదక్షిణము చేసి వానిచేతిలో నిల్చెను. అప్పటికిని రావణుడు చలింపలేదు. లక్ష్మణుడు సీతను తమ కప్పగించి. రణమునుండి తొలగిపొమ్మనెను దానికి ఆ యభిమాని

సమ్మతింపక యుద్ధమునే మరింత రోషముతో చేసెను. లక్ష్మణుని చక్రముచే రావణుడు మరణించెను. విభీషణుడు విలపించెను. తరువాత రాముడు విభీష ణున కారాజ్యము నిచ్చి సీతాసమేతుడై పుష్పకమున అయోధ్యకు చేరి ఆ రాజ్యము నేలుచుండెను. పల్లెప్రజలు రాముడు కాముకుడై దశాస్యుని యింట నున్న సీతను దెచ్చి యేలుకొన తగదని చెప్పిరి. రాముడు గర్భవతియగు సీతను త్యజించెను. ఆమె అరణ్యములం దుండగా ఆమె దాయాదివర్గములోని వజ్రజంఘు డనువాడు ఆమెను రక్షించును. ఆమెకు లవకుశులు పుట్టి పేరులై ఖ్యాతిదెచ్చిరి. పతివ్రతను త్యజించిన రామునిపై లవకుశులు యుద్ధమునకు పోయెదరు. రామలక్ష్మణులకు వారు అజేయులైరి. అంత నారదు డాకవలపిల్లలు రామునిబిడ్డలేయని దెలిపెను. రాముడు వారిని గ్రహించును. కాని సీతను రాముడు పరిగ్రహింపడు. ఆమె పుండరీకపురమునకు పోయెను. విభీషణుడు సుగ్రీవాదులు వచ్చి సీతను పరిగ్ర హింపవలెనని రాముని ప్రార్థింతురు. సీత పతివ్రత యనుట తనకు తెలియును కాని ప్రజాభిప్రాయములకు తాను వెరచితి ననియు, ఆమె అగ్నిప్రవేశము చేసి తన యపవాదమును బాపుకొనవలెననియు రాముడు చెప్పెను. ఆతని యభిప్రా యము ననుసరించియే ఆమె అగ్నిప్రవేశముచేసి పవిత్రయై బయల్వెడెను. దేవతలు పూలవాన కురిపింతురు. రాముడు ప్రజాభిప్రాయమును పాటించిన ధర్మప్రభు వగును. తన తప్పులు క్షమించి తనతో రాజభోగము లనుభవింపవలెనని రాముడు వేడుకొనెను. ఆమె యీ సంసారము నిస్సారమని తన కేశముల తొలగించి విరాగిణియై పోయెను. రాముడు లవకుశులతో అయోధ్యకు వచ్చి సుఖముగా నుండెను.

దేవతల మాయచే రాముడు మరణించెనని విని లక్ష్మణుడు మరణించెను. లక్ష్మణుడు మరణించిన వార్త విని రాముడు మూర్ఛిల్లెను. లేచి పలువిధముల దుఃఖించెను. లక్ష్మణుని శవమునకు దహనసంస్కారము గావింప సుగ్రీవాదులు యత్నింపగా దానికి రాము డంగీకరింపక లక్ష్మణుని శవమునకు చందనపుష్ప ముల నలంకరించి తనచెంతే ఆరునెలలకాలము కనిపెట్టుకొని యుండెను. రాజ్య పాలనయందును ఆసక్తిచూపలేదు. లవకుశులు జినదీక్షను పొందిరి. లంకనుండి ఇందగి కుమారుడు వజ్రమాలి అయోధ్యపై దండెత్తివచ్చెను. దేవగతియందున్న జటాయువు, కృతాంతవక్త్రు లిరువురు అవధిబోధచే అయోధ్యానగర పరిస్థితుల గ్రహించివచ్చి శత్రుసైన్యముల నిర్మూలింతురు. రామునికి కొన్ని దృష్టాంతముల

చూపి ఆతని మోహాంధకారమును వారు తొలగింతురు. రాముడు సరయూనదీ తీరమున లక్ష్మణుని శవమును సంస్కరించి, లవుని పెద్దకుమారునికి రాజ్యమప్ప గించి ఉగ్రతపస్సునకై వెడలిపోయెను. సుగ్రీవాదులు, వారి స్త్రీలుకూడ జినదీక్ష పొంది తపస్సునకై వెడలిపోయిరి. నిశ్చలచిత్తుడై రాము డెట్టి విఘ్నములకు లోనుగాక మాఘశుద్ధ ద్వాదశినాడు ప్రాతఃకాలమున కేవలబోధను పొందెను. 25 సంవత్సరముల కాలము దేవమర్త్యఖేచర రాజులచే పూజలపొంది రాముడు శాశ్వతముక్తిశ్రీని పొందెను. ఇది జైన రామాయణము.

కవితాశక్తిచే నాగచంద్రుని రామాయణము పండితు లనురంజింపచేయగా, భక్తిప్రపత్తులచే తొరవెరామాయణము ప్రజాహృదయములయందు నేటికిని నిలచి యున్నది. తొరవె రామాయణము కావ్యనామమే కాని దీని రచయిత నరహరి యను బ్రాహ్మణుడుగ కనపడుచున్నాడు. ఈతనికి కుమారవాల్మీకి యను బిరుద మున్నది. ఇతడు బిజాపురమునకు సమీపమున గల తొరవె యను గ్రామమునం దుండి, అందున్న నరసింహస్వామికి భక్తుడై యుండెను. ఇతనికాల మెప్పటిదో స్థిరము కాలేదు. కుమారవ్యాసుని నీతడు తన కావ్యమున స్తుతించుటచేతను, మోహనతరంగిణియం దీకవిని కనకదాసు కీర్తించుటచేతను కుమారవ్యాసుని తర్వాత, కనకదాసువెనుక ఈతడు జీవించియుండె ననవచ్చును. ఈతని కాలము క్రీ.శ. 1500నుండి 1650 మధ్య నుండునని కవిచరిత్రకారుల ఊహ. కుమార వాల్మీకి వాల్మీకిరామాయణము ననుసరించియే కన్నడమున 6 కాండలు షట్పదుల యందు వ్రాసెను. మొదటి ఐదుకాండలు ఒకయెత్తు. కడపటి యుద్ధకాండము ఒకఎత్తు. మొదటి ఐదుకాండలు కలిపిన ఎంతఉద్గ్రంథ మగునో అంత బృహద్గ్రం థముగా కడపటిది పెరిగినది. విస్తారమగు యుద్ధవర్ణనలతో నిండి పాఠకుల విసిగింపగలదు. ఇతనిలో కవిత్వముకంటె భక్తియే గొప్పది. ఈ భక్తిచేతనే యితడు ప్రజలలో బ్రతుకుచున్నాడు. వాల్మీకిమార్గమును త్రొక్కి భక్తితో కన్నడమున రామాయణములు వ్రాసినకవులు లేకపోలేదు. వార్ధకషట్పదిలో తిమ్మరసు మార్కండేయరామాయణము, శంకరరామాయణము, హరిదాసన మధ్యకవి మూలబలరామాయణము, వెంకామాత్యుని శ్రీమద్రామాయణము నింకను ఎందరో రామాయణములు వ్రాసి తమ భక్తిని ప్రదర్శించిరి. కాని యీయందరి యందును తొరవె నరహరి రచియించిన రామాయణమే ప్రసిద్ధమై యున్నది. ఇతడు ఉత్తరకాండను వ్రాయలేదు. ఇతని దృష్టిలో నిరువురే కవులు. భారత

మును వ్రాసిన కుమారవ్యాసు డను బిరుదముగల నారణప్ప. రెండవవాడు తాను. కన్నడమునకు మనపోతనవంటివాడు నారణప్ప. ఇతని భక్తి కవితాశక్తిని మీరి ఉరకలు వేయుచుండును. పంపనితో సాటిరా దగు మహాకవి యీతడు. ఈతని ఆవేశమే ఒక్కొక్కసారి యితని కావ్యశిల్పమునకు భంగము తెచ్చుచుండును. ఈవిమర్శ ఎట్లుండిన రసవత్తరమైన భక్తికవితను చెప్పి నేటికిని కన్నడిగుల యింటింట ఆరాధింపబడుచున్న కృష్ణభక్తుడు నారణప్ప. ఇతనిలో నున్న కవితా శక్తి నరహరి కావ్యములో కానరాదు. కాని సహజ కవి. సామాన్యుడు. వాల్మీకిపై నున్న గౌరవము ఇతనిభక్తికి తోడ్పడ, సీతని రామాయణము ప్రజా గౌరవము పొందినది.

కథయం దీతడు వాల్మీకి మార్గమునే త్రొక్కినను, తనవే అయిన కొన్ని కూర్పులు చేర్పులు లేక పోలేదు. రాము డన్న అతనికి అపారమైన భక్తి. అతడు సాక్షాత్ శ్రీ మహావిష్ణువే. నారాయణుడే నరుడై పుట్టెనట. కౌసల్యా గర్భమున "భవస్థితిలయ వివర్జితు" డుద్భవించెను. అవతారపురుషుడు కనుకనే రాముడు పిన్నవయస్సుననే విశ్వామిత్రునివెంట పోయి రాక్షసుల జంపెను. రాతిని నాతిగా మార్చెను. అనితరసాధ్యమైన చాపము నెక్కువెట్టి సీతను పరిగ్రహించెను. దివ్య శక్తుల నీరీతి చూపుటయే గాక దక్కనున్న సింహాసనమును తృణముగ త్యజించి నారచీరలు గట్టి తండ్రిమాటను నిలుప రాముడు భయంకరారణ్యములకు పోయెను. రాముని యీ త్యాగమునకు, సత్యసంధతకు వశిష్ఠుడే కాదు దేవలోకమే స్తుతించును. జగత్కల్యాణమునకై రాముడు రావణాదుల సంహరించెను. రామకథ ప్రారంభమున పార్వతీపరమేశ్వరుల సంభాషణ వచ్చును. సంజీవని తెచ్చుటకు హనుమంతుడు పోవుచుండగా మధ్య కాలనేమి అడ్డుపడును. ఈవిషయము లందు మన మీగ్రంథము రంగనాథ రామాయణమునకు పోల్పదగును. రావణుడు ఇంద్రజిత్తువలెనే రాముని చంప అభిచారిక హోమము గావించును. ఇటు లనే నరహరి అనేకములగు మార్పులు గావించెను. రావణుడు సీతను చేపట్ట ప్రయత్నించినట్లు బాలకాండలో గలదు. పట్టాభిషేకమునాటిరాత్రి భయంకరాట విలో చరించుచున్నట్లు కలగంటి నని రాముడు వశిష్ఠునితో చెప్పును. లక్ష్మణు డరణ్యమున శంబుకాసురుని చంపును. హనుమంతుని జన్మవృత్తాంతమును సుగ్రీవుడు శ్రీరామునికి దెల్పును. రావణుడు సీత నపహరించె నని శతావళి భరతునికి చెప్పెను. భరతుడు సైన్యములతో లంకపై నడువనుండగా నారదుడు వచ్చి

భరతుని వారించును. రాముడే రావణుని చంపగల డని చెప్పును. సీతాదేవి తన చూడామణిని రాముని కిమ్మని ఆంజనేయుని కిచ్చునే గాని కాకాసురుని వృత్తాంతము నెత్తదు. ప్రహస్తుని సలహా మేరకు హనుమంతుని తోకకు రక్కసులు నిప్పుపెట్టెదరు. ఇటులనే కావ్యమునం దనేకములగు మార్పుల చూడవచ్చును.

దాసియైన మంథరను వాల్మీకి పాపదర్శిని యనెను. నరహరి "పూర్వ మాయా తరుణి మంథరి" యని మార్చి మాయాప్రేరితయై రాముని అరణ్యములకు బంప సహకరించిన దని చెప్పును. దీనిచే మనకు కైకలోగాని మంథరలో గాని తప్పుతోచదు. రావణుడు తనబంధువులందరు యుద్ధమున మరణింప పశ్చాత్తాపచిత్తుడగును. విభీషణునిమాటలు వినలేదే యని చింతించును. తన కిప్పుడు రెండేమార్గములు. ఒకటి సర్వసంగపరిత్యాగియై ముండనమొనరించుకొని ఊరూరు తిరుగుట లేదా క్షాత్రశక్తితో శత్రువు నెదిరించుట యని తలచి రెండవమార్గమే తనకు తగిన దని యుద్ధమునకు పోయెను. మండోదరి రావణుని వారింపగా అప్పుడాతడు "లక్ష్మీవల్లభుడే రాముడు; లక్ష్మియే సీత; మర్కటములే సుర లనుట నాకు తెలియును."ఎదిరించి రాముని చేరుటకు రణమే నాకు శరణ్య" మని దృఢముగ పల్కెను. కుమారవ్యాసుని దుర్యోధనుని ప్రవృత్తియే మన మిట రావణునిలో జూడగలము. రావణుని పశ్చాత్తాపమును చూచి నప్పుడు మనకు నరహరిపై జైనకవుల దురంత రావణునిప్రభావ మున్న దని తెలియగలదు. ఒక వేళ యుద్ధమున తాను మరణించినచో తమ్ము డగు విభీషణుని లంక కాపాడింపు డని రావణుడే తన బంధువర్గమునకు చెప్పి యుద్ధమునకు పోయెను. ఈ మార్పు లెట్లుండినను నరహరి కవిత సరళముగా దొరలిపోవును. సందర్భమునకు తగినట్టులె అలంకారములు వచ్చి పడుచుండును. కొన్నిపట్ల పాత్రల స్థితి మనోజ్ఞముగ చిత్రించును. రావణుడు మారణయజ్ఞమున నిశ్చల దీక్షితుడై యుండెను. అతని యజ్ఞమును వికలమొనరింప అంగదుడు మండోదరి కొప్పును బట్టి యీడ్చి అవమానము సేయును. అప్పు డామె పల్కిన పలుకులు,

అకట లోకులభార్య నటు న
ప్రకటితంబుగ నీవు వెచ్చితి
ప్రకటితంబుగ నీదుభార్యను పట్టి యీడ్చి భవ
న్నికటమున భంగపరచె విట
ప్రకర మీ కబరీభరంబుల

సకితి గల్గిన కావుమా నీసతులమాన మనెన్॥ సంధి 17 ప. 32

ఇటులనే నెమరువేసినకొలది అమృత మూరించెడి షట్పదులు తనగ్రంథము నం దక్కడక్కడ జల్లులు జల్లులుగా కురిపించినాడు.

అర్వాచీనులయందు రామాయణములు కొల్లలుగా పుట్టినవి. అందులో నీమధ్య వచ్చిన పుట్టప్పగారి రామాయణదర్శనము కన్నడమున నింతవఱకు వచ్చిన రామాయణముల అన్నింటిని అధిగమించిన దనవచ్చును. వాల్మీకి తత్వ్వమును జైనకవులకవితా శిల్పముతో మేళవించి, ప్రాక్ప్రతీచీ సాహిత్యములలోని మధురధ్వనుల నాలించి యీయుగమునకు తగినట్టుల తన ప్రతిభ నడిపించినట్టుల రామాయణమును దర్శనగ్రంథముగా పుట్టప్పగారు రచియించిరి. ఛందస్సులో, సన్నివేశకల్పనలో, నవసందేశ మందించుటలో క్రొంగొత్త పోకడలు పోయిన వారికలము రసామృతవర్షమును కురిపించినది. సమన్వయము, సర్వోదయము, సంపూర్ణదృష్టియే తనదర్శనకావ్యమునకు ప్రాతిపదికయైయున్నదని నాముందే గాక మాటిమాటికి సభలలో వారు చాటుచుండిరి. నాటకములు, నవలలు, గేయములు, విమర్శవ్యాసములు, గీతిప్రబంధములు వ్రాసిరి. వీరి ''రామాయణ దర్శన'' మహాకావ్యమునకు జ్ఞానపీఠమువారి బహుమతియు లభించినది.

మైసూరు విశ్వవిద్యాలయమున కన్నడశాఖాధ్యక్షులై యుండి క్రమముగా కులపతి స్థానము నాక్రమించిరి. పదవినుండి నివృత్తిచెందిన నేటికిని వారు నిరంతర సరస్వతీసేవాసక్తులై యున్నారు.

రామాయణ దర్శనములోని ఛందస్సు విలక్షణమైనది. తెలుగువారి సీస పద్యములోని పాదార్ధమే వీరిఛందమునం దొకపాదముగా మారినదవచ్చును. ఐదుమాత్రలు గల నాలుగుగణములతో రసానుగుణమైన పదప్రయోగముతో సన్నివేశములకు తగినట్టు చిత్రవిచిత్రమగు లయవిన్యాసములతో నీతని రచన యురకలు దీయుచుండును. దీనిని మహాఛంద స్సని వారు చెప్పుచుందురు. కచ్చితమగు కొలతబద్దలు లేవు. కన్నడములోని వచన సాహిత్య లయ కొక నియమము కల్పింపయత్నించి నట్టులున్నది వీరి మహా ఛందస్సు. కాలమే యిందలి సత్యాసత్యముల నిర్ణయింపగలదు.

రామకృష్ణ వివేకానంద అరవిందాది మహాత్ముల ప్రభావ మీతనిపై ప్రబలముగా నున్నది. పరంపరను విడువక భవిష్యత్తును మఱువక వర్తమానములో బ్రతికెడి కళాతపస్వి పుట్టప్ప. తదనుగుణముగా రామాయణ రచన

సాగినది. "రామాయణం విరామాయణం కణా" అని గ్రంథమున మొట్టమొదటనే సూచించును. రామాయణ మనగా విరతిలేనిది. యుగయుగాంతరములనుండి విరతి లేక వచ్చు రామకథ నేటి ప్రపంచసమస్యల విడదీయుటకు తోడ్పడుచున్న దని వారివిశ్వాసము. పూర్వాపరముల సమన్వయించుటయందే కవి ప్రతిభ దీపించును. ఉదాహరణమునకు ఒక సన్నివేశమును చూడుడు. పరశురాముడు రాముడు ఇరువురును మహాత్ములే అవతార పురుషులే. సంధియుగమున నీ యిరువురు నొకరికొక్కరు తటస్థింతురు. వాల్మీకిలో నీయిరువురికిని ఘోరసంగ్రామమే ప్రాప్తించును. కాని పుట్టప్పగారి ముగ్ధమోహనుడైన రాముడు ''శరత్కాల సుప్రసన్నత'' అలమిననటుల భృగువంశ శైరవుని పరశురాముని సమీపించును. అంత పరశురాముని ముఖముపై లేనవ్వు మెరసెను. బాల్య సరళశాంతిసౌందర్య ములకు లోకములో లొంగనివారు గలరే? వైష్ణవ చాపమును జామదగ్ని రామునికిచ్చి వెడలిపోయెనట. పుట్టప్పగారి యీ మార్పులో ఇరువురి పాత్రలు ఉదాత్తములైనవి. పాఠకుల సంశయములు తీరినవి.

ఇట్టి సమన్వయాత్మక దృష్టితో రామకథను పుట్టప్పగారు నడిపింతురు. వారి యీ పాత్రచిత్రణలో వాల్మీకి ఆత్మకు గాని భారతీయ సంస్కృతికి గాని కొఱత లేదు. రాముని సన్నిధానములో ప్రతియొక్కనికి అభ్యుదయ మున్నది. ఎదిరించిన రావణుడు, దరిచేరిన విభీషణుడు, సేవించెడి హనుమంతునికే కాదు కడకు మంథరకును ఈ కావ్యమున ముక్తి కలదు. మంథర యనగా ప్రపంచ ముచే ఛీ యని దూరముగా త్రోసి వేయబడిన కుబ్జావతారము. ప్రపంచమునే త్యజించి, ప్రాణములకు ప్రాణముగా నేభరతుని పెంచి పెద్దచేసెనో, ఆతడే తన్ను తిరస్కరించినపుడు కార్చిచ్చులో బడి రామా రామా యని కాలిపోయిన మంథర కడకు హోమగుండమున దివ్యరూపిణిగా భరతునికి ప్రత్యక్షమైనది. సర్వ జనాభ్యుదయమునకు ఇంతకు మించిన నిదర్శన మింకొక్కటి చూప నవసరము లేదు.

అఖండ భరతఖండముగ రామాయణ మీకవికి ప్రత్యక్ష మయ్యెను. వీరి కావ్యమున అయోధ్య, కిష్కింధ, లంక, శ్రీ సంపుటము లని నాల్గుఖండములు గలవు. ఉత్తరమధ్య దక్షిణ భారతఖండముల గల సమస్తజీవకోటికి కడపట ముక్తిని ప్రసాదింపగల దర్శనగ్రంథ మని యీ కావ్యము సూచించును. మానవుని త్యాగములో కుటుంబమే గాదు రాజ్యమే స్వారాజ్యము కాగల దని అయోధ్య

రాముడు "పాదుకాకిరీటి" యగు భరతుడు నిరూపింతురు. కిష్కింధలోని వారు కపిధ్వజులే గాని కపులుగారు. చిన్ననాటి అన్నదమ్ముల ఆటపాటలు స్మరించిన వాలితమ్మునిపై గల దాయాదిమాత్సర్యమును విస్మరించి; మరదలితో గూర్చ తమ్మునిబట్టి దెచ్చుటకు ముందు బడినట్లు కవి చిత్రించును.

కిష్కింధలో నున్న రుమ, తారలు పతివ్రతాశిరోమణులు. వాలిమరణానంతరము తార సహగమనము సేయును. యోగశక్తులు పండిన పరిపక్వమూర్తి ఆంజనేయుడు. లంకానగరపు నాగరికతను చూచి పల్లెవానివలె ఆతడు ముగ్ధుడై పోవును. లంకిణి "దశశిరసుని కనకలక్ష్మి" యట. బుద్ధిశక్తిచే భూమిని స్వర్గముగా మార్చినవాడు రావణుడు. యోగమూర్తియగు ఆంజనేయుడు ఆ భౌతిక శక్తిని ప్రతిఘటించి జయించినను, నాగరికతాకేంద్ర మగు లంకను దహనము చేయలేదు. ఇది యే రామాయణముననను లేదు.

రావణుడు రాక్షసుడు కాడు. బహువిద్యాబలసంపన్నుడు. రాజనీతి కోవిదుడు. దశకంధరబిరుదాంకితుడు. ఎందరో సుందరీమణుల వలచి వలపింప జేసిన రసికుడు. వెదకి వెదకి కడకు పతివ్రతాగుణమును జానకిలో చూచి మనసారా ఆమెకునమస్కరించిన మహాత్ము డాతడు. ధర్మనిర్ణయమున విభీషణునితో విరోధము వచ్చి ఆ తమ్ముని త్యజించినా, తమ్ముని బిడ్డయగు "అనలను" వదలలేని వాత్సల్యమూర్తి. నవవైధవ్యముతో పసికందును రొమ్మున కదుము కొని ఏడ్చుచున్న కోడలిని చూచి ఆ పసికందులో తన పుత్రుడగు ఇంద్రజిత్తునే కాదు కడకు భవిష్యద్రాజ్యరమను చూచిన ఆశావాది, రావణుడు. మఱుపురాని మఱియొకపాత్ర మండోదరి. ఇంకొక్కరావణుడే యుండియుండిన తనపాతివ్రత్య మెట్టిదో తెలిసియుండెడి దని చెప్పుటయే గాదు జానకిచేతనే మెప్పులు పొందిన పతివ్రతామతల్లి మండోదరి. స్త్రీలే కాదు పురుషులుకూడా ఈ దర్శనగ్రంథమున ఉత్తమస్థానము నాక్రమించిరి. అగ్నిప్రవేశమున సీతయే కాదు రాముడును దీపించును. అగ్నిలో ప్రవేశించి సీత తన పతివ్రతాధర్మమును రూపింప రాముడు తన యేకపత్నీవ్రతమును దీపింపచేయ అగ్నిలో ప్రవేశించును.

రావణునికామము దివ్యము కాగా జానకిదేవి జగదంబగా గోచరించును. అప్పుడు రావణకుంభకర్ణులు లవకుశులై పుట్టి జానకీమాతృవాత్సల్యమున పెరిగెదరని కవి సూచించును.

ఇంత సుందరమైన పుట్టప్పగారి రామాయణవర్ణనమున తప్పులే లేవా యని నిలదీసి అడిగినచో లే వని చెప్పలేము. రసావేశములో ఎన్నియో పర్యాయములు కవియే కావ్యమున ముందుకు వచ్చి తనవైయక్తిక లక్షణములు ప్రదర్శించును. కొన్నిపట్ల పారిభాషికపదపుంజముచే పుటలు పెంచునే కాని శాస్త్రధర్మమును రసముతో మేళవింపడు. ఎన్నియోపట్ల శ్రవణశుభమైన పదలాలిత్యమునకు పోయి సూక్ష్మ మగు కవితాశిల్పమును జారవిడుచును. అల్పములగు ఈ దోషములన్నియు ఆ ప్రతిభాశక్తిలో మరుగై ఆధునిక యుగసందేశమును చాటుటలో ఈతని కావ్యము అనన్యసదృశ మనియే చెప్పవలెను.

శాంతి శ్శాంతి శ్శాంతిః

—: ० :—

# హిందీ రామాయణాలు

## -శ్రీ వారణాసి రామమూర్తి 'రేణు'

భద్రో భద్రయా సచమాన ఆగాత్
స్వసారం జారో అభ్యేతి పశ్చాత్ ।
సుప్రకేతై ర్ద్యుభి రగ్ని ర్వితిష్ఠన్
రుశద్భిర్వర్ణై రభిరామ మస్థాత్ ॥
(ఋ॥ 10 మం॥ 3-3; సామం 1548)

ఋగ్వేదంలోని ఈమంత్రంలో మొట్టమొదటి పర్యాయంగా బీజరూపంలో శ్రీరామకథ కనిపిస్తుంది. ఇందలి నాలుగుచరణాల్లో ఆకథలోని నాలుగు ప్రధానఘట్టాలు సంకేతింపబడినాయి. మొదటి పంక్తిలో భద్రుడు అంటే సర్వ మంగళస్వరూపు డైన రామభద్రుడు, భద్రతో అనగా సర్వమంగళస్వరూపిణి సీతతో వనమునకు వచ్చాడని, రెండవపంక్తిలో జారుడైన రావణుడు సోదరిని దుష్టబుద్ధితో సమీపించాడనీ, మూడోపంక్తిలో ఆకాశాన్నంటే హర్మ్యాలు అగ్నికాహుతి అయ్యాయనీ, కడపటి పాదంలో తనభయంకరమైన వాహినులతో (రావణుడు) రాముని ఎదుర్కొన్నాడనీ నిరుక్తకారులు ఈమంత్రాన్ని నిర్వచించారు.

బీజరూపంలో సంహితలో కనిపించే దాశరథిగాథ, శ్రీరామపూర్వోత్తర తాపిన్యుపనిషత్తులలోను శ్రీరామరహస్యోపనిషత్తు సీతోపనిషత్తులలోను మరి కొంత విపులంగా పల్లవింపబడింది.

చిన్మయేఽస్మి న్మహావిష్ణౌ జాతే దశరథే హరౌ ।
రఘోఃకులేఽఖిలం రాతిరాజతేయో మహీస్థితః॥
సరామ ఇతి లోకేషు విద్వద్భిః ప్రకటీకృతః ॥
(రామపూర్వతాపినీ ఉపనిషత్ 1-1,2)

చిన్మయుడగు మహావిష్ణువు. శ్రీహరి రఘుకులంలో దశరథునింట వెలసి నాడు; అతడు కామితప్రదాత; మహీతలాన గొప్పశోభతో వెలుగుతున్నాడు; అతడే రాము డని విద్వాంసులు ప్రవచించారు.

"రమంతే యోగినోஉనంతే, నిత్యానందే చిదాత్మని
ఇతి రామపదేనాసౌ పరం బ్రహ్మాభిధీయతే॥"

యోగులు ఏచిన్మయ, అనంత నిత్యానందమయపరతత్వంలో రమిస్తూ (ఆనందం అనుభవిస్తూ) ఉంటారో ఆతత్వమే రాము డని పిలువబడుతోంది.

ఇలా ఉపనిషత్సాహిత్యంలో పల్లవితమైన రామకథక కాంతాసమ్మితమైన కవివాణి నాశ్రయించి పుష్పఫలభరితమైన మహాకల్పశాఖిగ విస్తరించింది.

"వేదవేద్యే పరేపుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసాదాసీ త్సాక్షాద్రామాయణాత్మనా."

ఆరామకథాకల్పకం శతకోటిశ్లోకపరిమితమై ముల్లోకాలలోను వ్యాపించి, భవతాపసంతప్తమైన ప్రాణకోటికంతకూ చల్లనినీడ ప్రసాదిస్తోంది యుగయుగాలుగా.

ఒకే సూర్యుణ్ణి ప్రతిభామండితులైన పలువురుకవులు తమతమ అనుభూతి వైవిధ్యాన్నిబట్టి పలురీతుల వర్ణించినట్లు ఒకేరామకథ అనేకమందివాఙ్మయ తాపస్వుల దర్శనభేదాన్నీ, కల్పభేదాన్నీ అనుసరించి, స్థూలంగా కథావస్తు వొకటే అయినప్పటికీ, కొన్నికొన్ని మార్పులను చేర్పులను సంతరించుకొని ఇంద్రధనుస్సువలె సర్వజనానందసంధాయకమై వెలుగుతోంది. శ్రీతులసీదాసు ఈ విషయమే ఈపంక్తుల్లో స్పష్టంచేస్తారు.

నానాభాంతి రామఅవతారా రామాయన సతకోటి అపారా।
కల్పభేద హరిచరిత సుహాయే-భాంతిఅనేకమునీసన్హగాయే॥
కరియ, న, సంసయ అసఉరజానీ-సునియ కథా సాదరరతిమానీ॥

"దర్శనములువేరు తత్వంబదొక్కటే" అన్నవేమన్నసూక్తినిమానసించు కొన్నచో రామకథాద్రష్టలైన ఋషిపుంగవుల రచనలను స్వస్థసుందరమైనదృష్టితో అవలోకించి ఆనందించడం సుగమమౌతుంది.

శ్రీ రామచంద్రునకు సమకాలికుడుగా పరిగణించబడే వాల్మీకి మహర్షి కృత రామాయణంతో ప్రారంభమైన రామకథా భాగీరథి, సంస్కృతంలోనే కాక యితరా లైన అనేక భాషలలో అనేక ముఖాల ప్రవహించి లోక జీవనాన్ని సశ్యశ్యామలం గావిస్తోంది. ఒక్క హిందువులే గాక బౌద్ధులు, జైనులుగూడ దీనిని ఆదరించి ఆరాధించారు. ఈ కథానాయకుడు తన్నెరిగి పట్టిన ప్రతి రచయితనూ కవితాసింహాసనాన కూర్చుండ బెట్టినాడు. ఆధునిక హిందీ కవి, కీర్తిశేషులు శ్రీ మైథిలీశరణ్ గుప్త తమ 'సాకేత్' అనే రచనలో ఈ తథ్యాన్నే స్పష్టంచేశారు.

రామ ! తుమ్హారా చరిత్ర స్వయంహీ కావ్య హై
కోయీ కవి బన్ జాయ్ సహజ సంభావ్య హై ।

రామప్రభూ! నీ చరిత్రయే కావ్యమయ్యా. దానిని ఆశ్రయించి ఎటువంటి వాడైనా సరే 'కవి' కావడం సహజమైన పరిణామ మయ్యా।

ఇలా రామకథను ఆశ్రయించి తాము తరించి ఎందరకో తరణోపాయం ప్రసాదించిన మహా భక్త కవులలో ప్రాతఃస్మరణీయులు శ్రీ గోస్వామి తులసీదాసు గారొకరు. వీరు హిందీ ఉపభాషల్లో ఒకటైన 'అవధీ' లో 'రామ చరిత మానస' మనేపేర శ్రీరామకథాగానం చేశారు నేటికి 400 ఏండ్ల క్రిందట. వీరేగాక కేశవదా సనే మరొక కవికూడ 'రామచంద్రికా' అనే గ్రంథంలో రామకథ వర్ణించాడు. అయితే దానికి జనాదరణ లభించలేదు.

వీరిర్వురే కాక మధ్యయుగంలో ఎందరో హిందీ కవులు రామకథాగానం చేసియున్నారు. క్రీ.శ. 1523 ప్రాంతాన మాధవదాస్ జగన్నాథ కవి రచించిన 'రఘునాథ లీల', అగ్రదాసస్వామి వ్రజభాషా రచన 'కుండలియారామాయణ్', విష్ణుస్వామి వ్రాసిన 'రామ చంద్ర చరిత్ర', సేనాపతి కవి (1589) వ్రాసిన 'కవిత్తరత్నాకర్', హృదయరాంభల్లా (1623) ప్రసిద్ధకృతి 'హనుమన్నాటక్', సూరదాసు కవి తన పదావళి, నవమస్కంధంలో, 158 పదాల్లో గానంచేసిన 'శ్రీరామచరిత్ర'; ప్రాణచందచౌహాన్ నాటకీయ శైలిలో వ్రాసిన(1610) 'రామాయణ మహానాటకం', మానదాసు వాల్మీకి రామాయణాన్ని అనుకరిస్తూ రచించిన 'రామ చరిత్రం', సిక్కుల తొమ్మిదవ గురువైన శ్రీ గోవిందసింహజీ (1666-1708) వ్రాసిన 'గోవింద రామాయణం', సహజ రామ కవి కృతి

రఘు వంశదీపకం', మధుసూదన కవి రచించిన 'రామాశ్వమేధము', రామానుజదాసశరణ కవి ధోహా చౌపాయీ శైలిలో వ్రాసిన బృహత్కావ్యము, 'శ్రీ రామచంద్ర విలాసము', బుందేలు ఖండనివాసి, తెలుగు భట్ట బ్రాహ్మణుడు పద్మాకరుడు రచించిన 'రామ రసాయనము', విశ్వనాథ సింహ కవి కృతి 'ఆనంద రామాయణము' మొదలయిన రచన లెన్నియో వెలసినవి.

అయితే వీటన్నింటిలోను శ్రీ గోస్వామి తులసీదాసు రచించిన రామాయణ మొక్కటే హిందీ సాహిత్యాకాశాన్ని గడచిన నాలుగు శతాబ్దాలుగా తేజో దీప్తం కావిస్తున్న ఏకైక రచన. కోట్లాది భవతాపతప్తులైన అర్తులకు శారీరిక మానసిక అధ్యాత్మిక శైతల్యాన్ని ప్రసాదించే అక్షర కల్పశాఖిగా వెలుగుతోంది. పవిత్రములైన మంత్రాక్షరములవలె ఆ గ్రంథంలోని దోహా, చౌపాయీ, సోరఠేత్యాది ఛందముల పంక్తులు తమ్ముపాసించే శ్రద్ధాళువులకు ఈ నాటికీ అమోఘమైన ఫలితాలు ప్రసాదిస్తున్నాయి. అన్ని విధాలైన రుగ్మతలను పోద్రోలే భవౌషధిగా పారాయణ గ్రంథంగా ఉత్తర భారతావని నంతనూ పరిపాలిస్తోంది శ్రీరామ చరిత మానసం.

తులసీ క్రీ. శ. 1526 ప్రాంతాల జన్మించి 1626లో శ్రీరామసాయుజ్యం పొందారు. ఇక తమ రామాయణ గ్రంథ రచన వి. సం. 1681 చైత్ర శుద్ధ నవమి భౌమవారం ప్రారంభించారు అయోధ్యలో. తను అనర్ఘ రచనను మూడేండ్లలో పూర్తిచేశారు.

కారణ జన్ముడు, కుశాగ్రబుద్ధి, లోకజ్ఞుడు, సకలశాస్త్ర నిష్ణాతుడు, మహాభక్తుడు అయినందున తులసీదాసు తన సమకాలపు పరిస్థితులను చూచి ఉదాసీనత్వం వహించి ఉండలేకపోయినాడు. క్రీ. శకం 16వ శతాబ్దినాటికి ఉత్తర భారతదేశమంతా మొగలాయీ ప్రభువుల ఏలుబడిలోకి వచ్చింది. అంతకు ముందు విదేశీదండయాత్రలను తిప్పికొట్టగలిగిన హమ్మీరుదేవుడులాంటి స్వాతంత్ర్యయోధులు కరువైపోవడంతోబాటు, క్షత్రియు లెందరో తమ బలపౌరుషాలు మరచి పరపాలకుల అడుగులకు మడుగులొత్త మొదలుపెట్టారు. రాణా ప్రతాప సింహుడులాంటి వారొకరిద్దరు వేగు చుక్కల్లాగ ప్రకాశిస్తూ ఉన్నా మత్సర గ్రస్తులైన దాయాదిశృగాలాలు కుట్రలు పన్నుతూ వారలకు ప్రక్కలో బల్లెములై కూర్చున్నారు. జాత్యభిమానం నశించింది. సహోదర ప్రేమ శుష్కించిపోయింది. నీతి నియమాలు, సదాచరణం నీట గలసిపోయాయి. పెద్దల పట్ల అవిధేయత గురుధిక్కారమూ పెచ్చరిల్లినవి. వర్ణసాంకర్యం విజృంభించింది.

ధర్మ భీతి, దైవభక్తి దగ్ధమై పోయాయి. మహమ్మదీయులు దేశంలో స్థిరపడి పోవడంతో రెండు సంస్కృతుల మధ్య సంఘర్షణం ప్రారంభమైంది. ఏకేశ్వర వాదులు, నిర్గుణోపాసకులు సంఘంలో ప్రబలి అనేక సంప్రదాయాలు లేవ దీశారు. భారతీయ సంస్కృతికి పునాదులైన సగుణోపాసన, గురుభక్తి, వర్ణాశ్రమ నియమ పరిపాలన కొనఊపిరితో నిలచిపోయాయి. పులిమీద పుట్ర యన్నట్లు సగుణోపాసనలోనే విష్ణుభక్తి, శివభక్తి శాఖ లేర్పడి తీవ్రవాదులైన శైవవైష్ణవు లొకరి మొగము లొకరు చూచుటకే యిచ్చగింపక తమలో తాము కొట్లాడు చుండిరి. రాజకీయంగా పరాభవానికి గురియైన జాతికి సాంఘికంగా పరిణమించిన ఆ ధర్మగ్లాని గొడ్డలిపెట్టయింది. సంఘంలో నిరాశ, నిస్పృహ, నిస్సహాయస్థితులు పెరిగిపోయి, జనమానసం, లోలోపల కుమిలిపోతూ, ఆ సాంస్కృతిక ఉపప్లవాన్నుంచి జాతిని రక్షించగల లోకకల్యాణకరశక్తి కోసం మొరబెట్ట సాగింది. పదియల నీరు త్రాగనొల్లని జాతి చాతకం, శుష్కించి పోతూన్న కంఠంతో స్వాతి చినుకులకోసం శ్రీరామ శ్యామ మేఘాన్ని అర్థించ సాగింది-

"ఏక్ భరో సో ఏక్ బల, ఏక్ ఆస్ విస్వాస్
స్వాతి సలిల రఘునాథ జన, చాతకతులసీదాస్!"

జాతికంతకు ప్రతినిధిగా ఆ భక్త చాతకం తులసీ చేసిన అభ్యర్థన, ఆ దివ్యఘనం ఆలకించింది. రామ చరిత మానస రూపాన శ్రీ రఘునాథుని యశోగాన మనే స్వాతి సలిలాన్ని ప్రసాదించింది. ఇదీ తులసీదాస రామాయణావతరణానికి దోహదం చేసిన ఆనాటి పూర్వరంగం. ఈ దృశ్యాన్ని మానసించుకొననిదే "మానస" రచనాసౌందర్యాన్ని ఆస్వాదించి ఆమోదించడం, ఆనందించడం సుగమం కాజాలదు.

ప్రాచేతసమహర్షి రచనతో ప్రారంభమై ఎన్నో రామాయణాలు వెలసినాయి. వీటిలో ఆదికావ్యమైన వాల్మీకి రచన శ్రీరాముని మానవుడుగా చిత్రీకరించింది. "ఆత్మానం మానుషం మన్యే" అంటూ శ్రీరాముడే అనేక చోట్ల చెప్పుకున్నాడు. లోకసంగ్రహదృష్టినీ, జాత్యుద్ధరణ లక్ష్యాన్ని సాధించ దలచుకొనిన యుగకవితులసీ, వాల్మీకిని మాత్రమే అనుసరించడం ప్రయోజనకారి కాజాలదు. మానవశక్తియందలి నిర్వీర్యత్వం నిరూపితమైన ఆనాటి వాతావరణంలో మళ్ళీ ఒక మానవమాత్రునిగా రాముని చిత్రించినందువల్ల జాతికి

ఆశించిన ఓదార్పు విశ్వాసం ఊరట ధైర్యం లభించవు. ఆ మానవత్వానికి, దివ్యత్వాన్ని జోడించి, అఘటనఘటనా సామర్థ్యాన్ని తోడుచేసి, ఆదర్శ మానవత్వమే కాక అలౌకికా లయిన శక్తులతో కూడిన పరబ్రహ్మతత్వమే రాముని రూపాన అవతరించిం దనీ అది అనంతశీలం, అనంత బలం, అనంత సౌందర్యాల విలక్షణ సంపుటి యనీ, కాగా ఆ శక్తి కసాధ్యమంటూ ఏదీ ఉండదనీ జాతి మానసంలో విశ్వాసం కలిగించడమే తులసీదాసు నెరవేర్చ వలసిన, నెరవేర్చిన మహత్కార్యం. అందుచేతనే ఆయన ఏ ఒక్క రామాయణాన్నీ పూర్తిగా అనుసరించలేదు. మధుకరవృత్తి నవలంబించి సంస్కృత కాననంలో పరిమళించిన విభిన్న రామాయణ తదితర గ్రంథకుసుమాలనుంచి తనకు అనుకూలించినట్లు భావమకరందాన్ని సంగ్రహించి తన మానస మధుకోశంలో నిక్షిప్తం గావించుకున్నారు.

"నానా పురాణ నిగమాగమ సమ్మతం, యద్
రామాయణే నిగదితం క్వచి దన్యతోఽపి
స్వాంత స్సుఖాయ తులసీ రఘునాథ గాథా
భాషానిబంధ మతిమంజుల మాతనోతి".

తన అనర్ఘ రచనకు విషయసేకరణ చేసేందుకు తులసీ పురాణాలను, నిగమాగమాలను, రామాయణాన్ని తరచి చూచారు. అవేగాక అనేకాలయిన ఇతరచోట్ల నుంచి గూడ వస్తుసంగ్రహణం చేశారు. తన ఆత్మ సంతృప్తికి, సుఖానికీ మాత్రమే ఈ వస్తు సంపదనంతా మేళవించి దేశభాషలలో శ్రీరఘునాథుని గాథగా మధుర మంజుల మంగళకరమైన రీతిలో నిబద్ధించారు. ఈ శ్లోకం తులసీదాసు యొక్క వైవిధ్యంతో కూడుకొన్న అగాధమైన పాండిత్యాన్ని. స్వాంతస్సుఖంకోసమే అంటూ ఆయన ప్రదర్శించిన వినయసౌశీల్యాన్ని ప్రజలభాషలో అనడంలో ఆయనలో ఉద్వేలిత మౌతున్న లోకోద్ధరణాసక్తిని స్పష్టం చేస్తుంది. అయితే ఇందులో 'యద్రామాయణే నిగదితం' అంటూ ఆయన అభిమానించిన రామాయణ మేది? అనే సందేహం కలుగుతుంది. ఆ రామాయణం వాల్మీకి రామాయణం కాదనే విషయం ఇంతకు ముందే తెలుసుకున్నాం. ఇకపోతే ఏ రామాయణం ఆయనకు ప్రీతిపాత్ర మైంది? ఈ ప్రశ్నకు సమాధానం తన 'మానస' గ్రంథాంతాన ఒక సంస్కృత శ్లోకంలో సూచించారు ఆయనే.

"యత్పూర్వం ప్రభుణాకృతం సుకవినా శ్రీశంభునా దుర్గమం
శ్రీమద్రామపదాబ్జ భక్తిమనిశం ప్రాప్త్యైతు రామాయణం
మత్వా తద్రఘునాథనామ నిరతం, స్వాంత స్తమశ్శాంతయే
భాషాబద్ధ మిదం చకార, తులసీ దాస స్తథా మానసం."

శ్రీరామ కథను ప్రారంభంలో పరమశివుడు రచించి తన మానసంలో నిక్షేపించుకొని, అవకాశం చూచుకొని ఉమాదేవికి వినిపించాడు. అది అధ్యాత్మ రామాయణం. దానిని తనకు ఆదర్శంగా స్వీకరించి తులసీదాసు, తనలోని అజ్ఞానాంధకారాన్ని శమింపజేసి కొనుటకు, దేశభాషలో మానసమనే పేర రచించాడు.

కాబట్టి 'యద్రామాయణే నిగదితం' అన్నప్పుడు కవిదృష్టి శివపార్వతీ సంవాదమైన అధ్యాత్మరామాయణం మీద ఉన్నదన్న మాట. అందులో శ్రీరాముని పరబ్రహ్మరూపాన ప్రతిపాదించడం జరిగింది. అయితే తులసీ ఆ గ్రంథాన్ని అనువదించలేదు. తన రచనకు గావలసిన సామాగ్రిలో ఎక్కువ భాగం అందులోనుంచి తీసికున్నారు. ఆధ్యాత్మిక రామాయణమే గాక సంస్కృతంలోని హనుమన్నాటకం, ఆనంద రామాయణం, అనర్ఘ రాఘవం, ప్రసన్న రాఘవం, భుశుండి రామాయణం, కౌశిక రామాయణం, యోగవాసిష్ఠం, రఘు వంశం, వాల్మీకి రామాయణం, శ్రీమద్భాగవతం, స్కాందపురాణం, భగవద్గీత భృగుసంహిత మొదలయిన గ్రంథా లెన్నింటి నుండియో తనకు నచ్చి, తన పథకానికి దోహదం చేయగల విషయాలను స్వీకరించి, సర్వదా వినూత్నమైన స్వతంత్ర రచన సాగించారు.

శ్రీ తులసీదాసు జీవితకాలంలోనే ఆయన శిష్యుడు రామూద్వివేది రామచరితమానసానికి ప్రేమరామాయణ మనేపేర సంస్కృతంలో టీక రచించాడు. ఆ రామాయణావతారికలో చాలా చిత్రమైన సంగతి ద్వివేది ఉల్లే ఖిస్తాడు. దాని ప్రకారం తులసీ, శ్రీహనుమంతుని అవతార మనీ త్రేతాయు గంలో హనుమంతుడు తాను నాటకరూపంలో రచించిన బృహత్ రామాయ ణాన్ని వాల్మీకి మహాముని, విని అభినందించని కారణాన కొండలమీద, గండ శిలలమీద వ్రాసిన ఆ మహాగ్రంథాన్ని సముద్రంలో పారవేశాడనీ, ఆ హను మంతుడే ఈ కవియుగాన తులసీ రూపాన అవతరించి దానిని దేశభాషలో

వ్రాశాడనీ పరంపర (Tradition) చెబుతుంది. ఆ శ్లోకాలు చాలా ఆసక్తి దాయకాలుగా ఉంటాయి. చూడండి.

"ప్రేమ రామాయణం పూర్వం, యత్కృతం వాయుసూనునా
లిఖిత్వా నఖటంకైస్తత్కటకేషు మహీభృతాం
నాటకం శ్రావయామాస, మునిం ప్రాచేతసం ముదా!
నాభినందిత దాతేన, నిజగ్రంథ విలోపనాత్
న్యక్షిప న్మారుతిః సింధౌ, పర్వతాన్ గర్వవర్జితః
తదేవ, తులసీదాస రూపిణా వాయుసూనునా,
సుదేశ భాషయా సర్వం నిబద్ధం, పునరద్భుతం!
శ్రీరామచరణాంభోజప్రేమదం క్షేమదం నృణాం."

ఇక తులసీదాసు తన రామాయణానికి శ్రీరామచరితమానస మని పేరు పెట్టడంలో గలవిశేషం తెలుసుకుందాం. తన గ్రంథావతారికలో ఆయన-

"రచిమహేస నిజమానసరాఖా-పాయిసుసమఉ సివాసనభాఖా !
తాతేఁరామ చరితమానసవర,ధరెవునామ, హియహేరి, హరషిహర॥"

"మహేశ్వరుడు తాను రచించి తన మానసంలో నిక్షేపించుకున్నందున రామకథను 'రామచరితమానస'మని కీర్తించి పార్వతికి ఉపదేశించాడు." అని వ్రాసి అందుచేత తాను తన గ్రంథానికి రామచరితమానస మని నామకరణంచేసి నట్లు వెల్లడించారు.

అద్వితీయమైన ప్రతిభాశాలి కావడంతో తులసీ తన గ్రంథానికి ఒక చక్కని కళాత్మకమైన స్వరూపం యిచ్చారు. శ్లిష్టసుందరమైన 'మానస' శబ్దాన్ని మానస సరోవరంగా అన్వయించుకొని సప్తకాండ పరిమితమైన తన గ్రంథాన్ని సప్తసోపానాలంకృతమైన శ్రీరామకీర్తి సరోవరంగా చిత్రించారు. ఒక సుదీర్ఘమైన రూపకాలంకారంలో. అది 'మానసరూపక'మనే పేర హిందీ సాహిత్యంలో ఒక ప్రత్యేకతను సంతరించుకుంది. ఈ గ్రంథాన్ని నాలుగు సంవాదాల రూపంలో తులసీ వ్రాశారు - శివపార్వతి సంవాదం, కాక భుశుండి గరుడ సంవాదం, యాజ్ఞవల్క్య భరద్వాజ సంవాదం, తులసీదాసూ ఆయన శిష్యుల సంవాదం- ఈ సంవాద చతుష్టయం ఆ సరోవరానికి నాలుగు ఘట్టాలు- రేవులు.

"సుమతి భూమిథల, హృదయ అగాధూ-వేదపురాన ఉదధి, ఘనసాధూః
బరషహింరామసుయశవరవారీ-మధురమనోహరమంగళకారీ !
లీలాసగున జొకహహిఃబఖానీ-సోఇస్వచ్ఛతా, కరైమలహానీ ;
ప్రేమభక్తి, జోబరనినజాయీ-సోఇమధురతా, సుసీతలతాయీ-
సోజల సుకృతసాలిహితహోయీ-రామభగతజనజీవనసోయీ
మేధామహిగతసోజలపావన-సకిలిశ్రవనమగచలెవు సుహావన.
సుఠిసుందర సంవాదవర, విరచే బుద్ధివిచారి,
తెఇ ఎహి పావన సుభగసర, ఘాట మనోహర చారి॥

హృదయధర్మ మనే లోతుగల సన్మతి అనే భూమిలో, వేదపురాణాలనే సముద్రసారాన్ని ఆకర్షించి సాధుజను లనే మేఘాలు శ్రీరాముని సత్కీర్తి అనే మంగళకరమైన మనోహర మధురజలాన్ని వర్షిస్తాయి. సగుణలీలావర్ణనమే ఆ జలగతమైన స్వచ్ఛత. అది సకల కలుషహారి. అవర్ణనీయమైన ప్రేమ భక్తియే ఆ నీటియందలి మధుర శైతల్యం. ఆ సరోవరపు నీరు సుకృతాలనే వరిచేలకు, శ్రీరామ భక్తుల జీవితాలకు జీవనం. కర్ణకుల్యలద్వారా, మేధ అనే భూమిని తడిపి, ఆ పావన జలం, మానసాన్ని చక్కని రుచులతో నింపి స్థిరంగా ఉంచుతుంది. నాలుగు సంవాదాలు దానికి నాలుగు అందమైన ఘట్టాలు. విమల సంతోష, విజ్ఞాన వైరాగ్య, విశుద్ధసంతోష, జ్ఞాన, అవిరలభక్తిసంపాదన లనేవి సప్తసోపానాలుగా, సప్తకాండలుగా ఉపమించబడినాయి. యింకా సరోవరంలో ఉండే జలవిహంగ, కమల, పత్ర పుష్పాదులను, వీచీవిలాసాలను, ప్రబంధగతాలయిన అలంకార ఛంద శ్శైలీ ధ్వనివక్రోక్తి శయ్యాదులతోను ధర్మార్థకామాది పురుషార్థాలతోను పోలుస్తూ సుదీర్ఘంగా నడుస్తుం దా మానసరూపకం. సాంగోపాంగంగా దానిని చదివి అర్థం చేసుకున్నప్పుడు మనకు గలిగే ఆనందం ఇంతింతనలేము. అలాంటి అర్థసౌందర్యగర్భితా లయిన రూపకాలు దజనుల కొలదీ తులసీరామాయణంలో కనిపిస్తాయి. అందుకే ఆయనకు "రూపకోంకే స్మ్రాట్" అని మానసమర్మజ్ఞులు జోహారు లర్పిస్తారు.

నిర్వీర్యమై శీలరహితమై వికృతాకారం ధరించిన సమకాలిక సంఘాన్ని సంస్కరించి నూత్నశకస్థాపనకు అవతరించిన వ్యక్తి కావడంతో, తులసీదాసు, తన గ్రంథనాయకుడైన శ్రీరాముని శక్తి, సౌశీల్య సౌందర్యాలు రూపుకట్టిన అద్వితీయ వ్యక్తిగా చిత్రించారు. మానవ ప్రకృతి, రూపసౌందర్యాన్ని చూచి

ఇట్టే ఆకర్షింపబడుతుంది. ఆ సౌందర్యానికి తోడు బలం కూడా ఉంది, ఆ శక్తిని సద్వినియోగపరచే శీలంకూడ లభ్యమయితే, అలాంటి వ్యక్తిని ఎటువంటి వారు కూడా ప్రేమించి ఆరాధిస్తారు. ఆనాటి సంఘంలో లోపించిన సచ్ఛీలం, శక్తి, ఆత్మవిశ్వాసాలను పునః ప్రతిష్ఠించేందుకు శ్రీరామునిలో అనంత సౌందర్యం, అనంతశక్తి, అద్వితీయ శీలం నింపి ఆయన్నొక మహాచుంబకం లాగా తీర్చి దిద్దారు తులసీ. అలాంటి వ్యక్తిత్వాన్ని ఆరాధిస్తే తమకు గల సకలబాధలు తొలగిపోగలవనే గట్టి నమ్మకం, జాతిలో కలుగజేశారు.

శ్రీరాముని సౌందర్యం స్త్రీపురుషాదులనే గాక స్థలచర, జలచర, ఖేచరాలను గూడ సమ్మోహింపజేస్తుంది. జనకాదివిరాగులు ఖరదూషణాది రాక్షస శత్రువులు సర్పవృశ్చికాది క్రూరప్రాణులు సైతం ఆ రూపం చూచి చేష్టలు మాని నిలబడిపోయేవి. తాత్కాలికంగానైనా సరే తమ ప్రవృత్తులు మాని ఒకానొక సాత్వికానందాన్ని అనుభవించేవి. సోదరి శూర్పణఖను విరూపను గావించినందుకు ప్రతీకారభావంతో రాముని సమీపించిన ఖరుడు అనుచరులతో అంటాడూ-

"హమ భరిజనమ, సునహుసబభాయీ
దేఖీనహిఁ అసిసుందరతాయీ !
జద్యపి భగినీ కీన్హి కురూపా
వధలాయక నహిఁ పురుషఅనూపా ।

"భాయీ! జీవితంలో ఇలాంటి సౌందర్యం నే నెక్కడా చూడలేదయ్యా! చెల్లెల్ని విరూపను చేసినా ఇతణ్ణి వధించేందుకు చేతులు రావడంలేదు. ఎంతటి అద్వితీయమూర్తి!

సేతుబంధనం జరిగింది. పర్వతాకారులైన కపులు అసంఖ్యాకులుగా సముద్రం దాటుతున్నారు. ఆ సంరంభానికి సముద్రంలోని బ్రహ్మాండమైన జలచరాలన్నీ పైకివచ్చాయి. వాటికంట మేఘశ్యాముని దివ్యసుందరమూర్తి పడ్డది. అంతే.

"దేఖనకహుఁ ప్రభు కరుణాకందా,
ప్రగటభయే సబ జలచరవృందా ।

ప్రభుహిఁ విలోకహిఁ టరహిఁ నటారే
మనహరషిత సఖభయేసుఖారే !
సేతుబంధభఝుభీరఅతి – కపినభపంథఉడాహిఁ
అపరజలచరన్హిఊపర – చఢిచఢిపారహిజాహిఁ ॥"

'కరుణామయుడైన ప్రభువు దర్శనంకోసం జలచరాలన్నీ పైకి వచ్చి, వంతెనమీద చేరి కన్నార్పక ఆయన అందాన్ని త్రాగుతున్నాయి. కొందరుకపులు ఆకాశమార్గాన లంఘించిపోతోంటే మరికొందరాజలచరాలమీదనేనడిచిపోతున్నారు. అయినా అవి కదలకమెదలక ఆ పర్వతాకారుల పదఘట్టనలను సహిస్తూ స్వామిని చూస్తూనే ఉండిపోయాయట !' అదీ శ్రీరామునిరూపం వెదజల్లేచొక్కపొడి ! మోహనచూర్ణం !

పోతే సార్థకనాముడు విదేహుడు జనకమహారాజు స్థితియేమిటి ? ఆయన గొడవ వినండి.

"ఇనవాహిఁ విలోకత అతిఅనురాగా,
బరబసబ్రహ్మసుఖహి, మనత్యాగా ॥"

'ఎప్పుడూ పరబ్రహ్మసుఖంలో తలమునకలుగా ఉండే నామనస్సు, ఈ కుమారులను చూడగానే విధిలేక ఆబ్రహ్మసుఖాన్నే వదిలిందే ! వైరాగ్యశుష్కమైన నాఎదలో ఏదో అనురాగం ఊటలూరుతోంది. ఆహా ! ఏమిరూపం !" అని తన్నుతానే మరచాడు.

ఇక మిథిలలోని స్త్రీ పురుషుల విషయం చెప్పవలెనా? అరణ్యంలోని భిల్లులు, శబరులు సీతారామలక్ష్మణులను చూస్తూ అలాగే క్రోసులదూరం వెంట వెళ్ళేవారట. అరణ్యమార్గంలో వెళ్తూన్న ఆ కుసుమకోమలశరీరులు సూర్యరశ్మికి ఎక్కడకందిపోతారోఅని మేఘాలు ఆతపత్రాలుగా నీడకావించేవట వారలమీద !

"జహఁ జహఁ జాహిఁ దేవ రఘురాయా
తహఁ తహఁ మేఘకరహిఁ నభఛాయా ॥"

పురుషుడైన రాముని అందమే యిలా ఉంటే, ఇక, ఆతల్లి సీతమ్మ సౌందర్యమో ! ఆపట్టున తులసీభావనాబలం, వర్ణనాపటిమ కుంఠితమై పోతాయి. ఆమెతో పోల్చగల ఉపమాద్రవ్యం లోకంలో ఏదీ? ఏవైనా ఉంటే వాటిని ఈవరకే

కవులు ఎంగిలిపరచారు. కౌశికునితో మిథిలానగరానికి చేరిన మరునాడుదయం గురువుగారికి పూలు తెచ్చేందుకు రామలక్ష్మణులు జనకమహారాజు పుష్పవనం లోకి వెళ్తారు. దైవయోగంచేత, అదేసమయాన ఆ తోటలో ఉన్న గౌరీదేవి ఆల యానికి చెలులతో జానకమ్మ పూజకై వస్తుంది. అకస్మాత్తుగా ఇరువురు ఎదురు పడతారు. సహజంగా పరస్త్రీ విముఖమైన రామునిమనస్సు, ఆమెనుచూచి ఏలనో అనురక్తమౌతుంది. అపుడు రాముడు తనలో తాను అనుకుంటాడు ఆమె అందాన్ని చూచి.

"సబ ఉపమాకవి రహే జుఠారీ,
కెహి పటతరౌఁ విదేహకుమారీ!
జను విరించి సబ నిజనిపునాయీ.
విరచి విశ్వకహఁ ప్రగట దెఖాయీ.
సుందరతా కహఁ సుందరకరయీ,
ఛవిగృహ దీపసిఖాజనుబరయీ!"

'ఈ అందాన్ని పోల్చి చెప్పేందుకు ఉపమానమే లేదు. బ్రహ్మ తన సృష్టి నైపుణ్యాన్నంతా ఒకచోట రాశిపోసి ప్రపంచానికి ప్రదర్శించినట్టుంది. అందానికే అందాన్ని చేకూర్చుతూ 'రూపజ్యోతి' అనే యింటిలో దీపకళికలాగ వెలుగుతోందిగదా ఈ విదేహకుమారి!'

ఈ పంక్తులలో తులసీదాసు ఉక్తివైచిత్రి, అర్థగాంభీర్యం, ధ్వనిపూర్ణ మైన విదగ్ధ భంగీభణితి పరకాష్ఠ నందుకుంటాయి. సీతమ్మ సౌందర్యాన్ని బ్రహ్మ తన శక్తినంతా వినియోగించి సృష్టించి తాను చూచుకోవడమే కాక ప్రపంచానికీ చూపెట్టాడట!

ఇక్కడ 'విశ్వం' అనే మాటలో ఎంతో ధ్వని ఉంది. 'విశ్వం' అంటే విష్ణువని అర్థం. "విశ్వం విష్ణుర్వషట్కారః" అని విష్ణు సహస్రనామావళి చెబుతుంది. "ప్రపంచానికి చూపేందుక"నే వాచ్యార్థమైనప్పటికీ బ్రహ్మ, విష్ణ్వవతారంగా రామరూపంలో నిలబడ్డ ఆ పరాత్పరుడికే మహాలక్ష్మి స్వరూ పిణి సీతను చూపెట్టాడనే చక్కని అర్థాంతరమూ స్ఫురిస్తుంది! ఇది తులసీ యొక్క మర్యాదా విలసితమైన ఉక్తివైచిత్రి. అంతేకాదు. రూపసౌందర్యం అనే యింటిలో దీపశిఖలాగ సీతమ్మ ఉందనడంలో మరొక దార్శనిక తథ్యం ధ్వన్య

మానమౌతూంది. దీప ప్రకాశంతో తప్ప ఎంతటి అందమైన చిత్రశాల అయినా మనం చూడలేము. చిత్రశాలలోని చిత్తరువులను దీపం ప్రకాశింప జేస్తుంది. చూపెడుతుంది. అంటే ప్రపంచంలో ఉన్న అందాన్నంతటినీ, చీకటి లోని వస్తువును కనుపింపజేసే దీపశిఖలాగ సీతమ్మ సౌందర్యం వెలిగిస్తోందన్న మాట! "య స్యభాసా సర్వ మిదం విభాతి" అనే శ్రుతి వచనం దృష్టిలో ఉంచు కొని 'సమస్తాలయిన వెలుగులను వెలిగించే దొడ్డవెలుగు, పరాశక్తి, సీతమ్మ' అనే సత్యాన్ని సూచించాడా మహా భక్త కవి! ఇలా 'విశ్వం' 'దీపశిఖ' అనే పదముల ప్రయోగంతో సీతారాముల పరబ్రహ్మ తత్వాన్ని అద్వితీయమైన వ్యంగ్య మర్యాదతో వివరించాడు.

అందాన్ని మరింత ఆకర్షణీయంగా చేసేది శక్తి. శ్రీరామచంద్రునిలో ఆశక్తి పరాకాష్ఠ నందుకున్నది. వందలాది బలశాలురు మోసుకొని తెచ్చిన శివుని ధనుస్సును అవలీలగా విరిచినప్పుడు రాముడు ప్రదర్శించిన లాఘవం అచ్చెరువు గొలుపుతుంది.

గురహి ప్రనాము మనహిమనకీన్హా
అతిలాఘవ ఉఠాయి ధనులీన్హా
దమకెవు దామిని జిమి, జబ, లయవూ
లేత చఢావత ఖైంచతగాఢే
కాహు నలఖాదేఖ సబుతాఢే
తెహిఛనరామ మధ్యధనుతోరా
భరే భువనధుని ఘోర కఠోరా !

"గురువుకు మనస్సులో ప్రణామం చేసి అలవోకగా రాముడు ధనువు తీసికొన్నాడు. చూపరుల కండ్లు ఎన్నో మెరుపులు మెరిసినట్లు జిగేలుమన్నాయి. అందరూ చూస్తూ నిలబడినప్పటికీ ధనువు తీసికొనడం పైకి ఎత్తడం వంచడం ఎవరూ గమనించనేలేదు. భువన భయంకరమైన ధ్వనితో క్షణకాలంలో ధనువు నడిమికి రెండు ముక్కలై పడిపోయింది."

ఊనషోడశ వర్షప్రాయుడూ, శిరీష కుసుమ కోమల శరీరి అయిన తరుణుడింతటి ఘనకార్యం చేశాడు. అంతకుముందు రావణుడు బాణాసురుడు వచ్చి, ఆ పినాకాన్ని కదపలేకపోయారు. మరొకచోట తులసీ అంటారూ—

"లవ, నిమేష, పరమానుజుగ, బరష, కల్ప, సరచండ
భజసిన మన తెహిరామకో, కాలజాసు కోదండ !"
"భువనేస్వర, కాలహు కరకాలా !"

"శ్రీరాముని కోదండం కాలుడే ! క్షణాలు, నిముషాలు, ఏండ్లు యుగాలు కల్పాలు ఇవి ఆయన సంధించే బాణాలు. ఆయన మిత్తికి మిత్తి ; భువనేశ్వరుడు. ఆ ప్రభువు నెందుకు స్మరించరు ?" మరి సీతామాతయో -

"ఉద్భవస్థితి సంహారకారిణీం క్లేశహారిణీం
సర్వ శ్రేయస్కరీం సీతాం నతోఽహం రామవల్లభాం"

అంటూ ఆమె అఘటన ఘటనా పటీయసి అయిన, పరాశక్తి యని అంజలి ఘటిస్తారు తులసీ.

ఇక ముల్లోకాలనూ మోహింపజేసే మూడో గుణం సచ్ఛీలానికి, శ్రీరాముని జీవితం బాల్యంనుంచీ కడదాకా అద్భుతమైన ఉదాహరణమే. సీతాపతి శీలస్వభావాన్ని విని ఆనందంతో తనువు పులకరించక, కండ్లవెంట జలధారలు స్రవించనివాని జీవితం బూడిదతో సమానమైనదంటారు, ఆ మహాకవి. భరతుడు అంటాడూ -

"మైఁజానివుఁ నిజనాథ సుభావూ- అపరాధిహుఁ పరకోహన పావూ
మైఁ ప్రభుకృపారీతి జియఁజోహీ- హారెహు ఖేల జితావహిమోహీ !"

'నా ప్రభువు స్వభావం నేను చిన్నప్పటినుంచీ ఎరుగుదును. ఎన్ని పర్యాయాలో నేను ఆటలో ఓడిపోతే మళ్ళీ మళ్ళీ నాకు అవకాశం యిచ్చి తను ఓడినట్టు నటించి నన్ను గెలిపించేవాడు. మహాపరాధిని కూడ కోపించేవాడు కాడు.'

"సిలా, సాప సంతాప విగతభఇ, పరసత పావనపావు
దయీా సుగత, సొనహేరి హరషహియ- చరనఛుఎకా, పఛితావు."
"కేవటమీతక హేసుఖమానత- వానర బంధు బడాయీా."
"హింసారత నిషాద తామసవపు- పసుసమా నవనచారి.
భేంట్యో హృదయలగాయి ప్రేమబస- నహికుల జాతి విచారి"
"జటాయు కీధూరి జటాన సొర్యూరీ !"

"ప్రభుతరుతరకపిడారపర, తేకియ ఆపు సమాన్
తులసీకహూఁన రామసో, సాహిబ సీలనిధాన్."

గౌతమపత్ని తన పాదస్పర్శవల్ల శాపవిముక్తి చెందితే, సంతోషించ డానికి బదులు, ఆ ఋషిపత్నిని కాలితో తాకితినే యని బాధపడేవాడు. జాలరి గుహుడు మీ స్నేహితుడన్నాగాని, వానరులంతా మీ చుట్టాలన్నాగాని ఎంతో ఆనందించేవాడు శ్రీరాముడు. అడవుల్లో మృగాలను చంపుతూ, మాంసాదులు తింటూ, పశువుల్లాగా తిరిగే నిషాదులను శబరులను, జాతికుల విచక్షణ లేకుండా ఆప్యాయతతో ఆలింగనం చేసుకునేవాడు. అంతేకాదు మాంసం తినే పక్షి, జటా యువును ఒళ్లో పెట్టుకుని అ రెక్కల కంటిన ధూళిని తన జడలు గట్టిన కేశా లతో తుడిచాడు. చెట్టుక్రింద సుఖాసనాసీనుడైన తనతో సమానస్థాయి యిచ్చి, చెట్ల కొమ్మలమీద గంతులు వేసే వానరులను, చపలురను సమ్మా నించాడు. రాముడిలాంటి శీలసముద్రు డెవరున్నారు?' పోతే ఇక కృతజ్ఞతా గుణంలోగూడ ఆయన కాయనే సాటి. సీతాసమాచారం చెప్పిన హనుమంతుని గాఢాలింగనం గావించుకొని "నాయనా! ఎన్ని జన్మలెత్తి నీకు సేవ చేసినా నీ ఋణం తీర్చుకోలేనోయి! నీవు మహాసంపన్నుడివి. ఋణపత్రం వ్రాసి ఇచ్చుట మినహా నేను చేయగలిగింది లే"దని కన్నీరు విడుస్తాడా శీలసింధువు!

చంద్రుని రోహిణిలాగ, శరీరాన్ని నీడలాగ రాముని వెంబడించినసీతమ్మ సాక్షాత్తు రూపుకట్టిన శీలమే. చిత్రకూటంలో జనకుడు, ఆయన భార్య సునయన తమ ప్రియ పుత్రిక నార చీరలు ధరించి ఉండటం చూచి కళవళపడిపోతారు. మహాజ్ఞానివేదాంతి జనకు డామె శిరస్సు దువ్వుతూ ఆనందబాష్పాలు రాల్చుతూ అంటాడు.

"పుత్రి పవిత్రకియేకుల దోవూ, సుజసధవల, జగు, కహసబకోవూఁ
జితి సురసరి కీరతిసరితోరీ, గవనుకీన్హ విధి అండ కరోరీ!"

"బిడ్డా! పుట్టినింటినీ మెట్టినయింటినీ పవిత్రం చేశావు తల్లీ. నీ యశో ధావళ్యమే జగత్తులో నిండి ఉంది. నీ కీర్తి నది దేవనదిని మించి అనేక కోట్ల బ్రహ్మాండాలను అధిగమించి విశ్వంలో సర్వత్రా నిండింది తల్లీ! మేము ధన్యుల మయ్యాం.

గురుజనులు చేసిన ఆ ప్రశంసకు సీతమ్మ సంకోచంతో ముడుచుకొని

పోతుంది. తల్లిదండ్రులతో మాటాడుతుండగానే చీకటిపడుతుంది. వారల పట కుటీరంనుంచి తను తన పర్ణశాలకు వెళ్ళాలి. ఆమె మనస్సులో బాధపడుతుంది.

"కహతి నసీయ సకుచిమనమాహీం, ఇహాం బసబ రజనీ భలనాహీం.
లఖిరుఖ, రాని జనాఎవు రావూ, హృదయంసరాహతసీల సుభావూ".

ఎన్నాళ్ళ తర్వాతనో కలిసిన తల్లిదండ్రులతో నేను వెళ్ళాలి అని చెప్పేందుకు సీత బాధపడుతుంది. అయితే అక్కడ రాత్రి గడపటం భావ్యం కాదని నిశ్చయించుకుంది. బిడ్డ సంకోచాన్ని గుర్తించిన తల్లి, భర్త జనకున కావిషయం సూచిస్తుంది. ఆ విదేహుడు తన కుమార్తె శీలానికి లోలోన మురిసి పోతాడు.

తులసీదాసు రామాయణం వ్రాయడానికి ముఖ్యమైన కారణం, ఆనాడు దేశంలో లోపించిన సదాచారం శీలసంపదలను మరల ప్రతిష్ఠింప చేయడమే. రామాయణంలో ఆయన చిత్రించిన పాత్రలలో ఎక్కువగా ఈ శీల నిరూపణా నికే సర్వత్రా ప్రాధాన్యం యిచ్చారు, అన్ని కాండల్లోను బాల, అయోధ్యా కాండలు పెద్దవి. అయోధ్య కాండలో మొదటనుంచి చివరిదాకా శీలసౌందర్యమే రాజ్యంచేస్తుంది.

ఆ రాజ్యానికి అధినేతగా నిలుస్తాడు. భద్రగుణ సముద్రుడు భరతుడు. నిజానికి కొన్ని కొన్నిచోట్ల భరతుని పాత్రయే రామునికన్న మిన్నయనిపిస్తుంది. ఏ అధికారం, రాజ్య సంపదకోసం మహాభారతంలో రక్తపుటేరులు ప్రవహిం చాయో. వాలి సుగ్రీవులు, రావణాదులు తమలో తాము కుమ్ములాడుకున్నారో అలాంటి రాజ్యాధికారం రామభరతు లిద్దరకూ తలనొప్పి అయి కూర్చుంది. "భాయపభగతి" భాతృ ప్రేమలో రామ భరతు లిద్దరూ ఒకరితో నొకరు పోటీ పడతారు. చిత్రకూట వాతావరణమంతా ఆ సౌభ్రాత్ర సౌరభంతో నిండిపో తుంది. తులసీ రామాయణంలోని ఆఘట్టం వేయి ప్రయాగల కన్న పవిత్రమైంది.

శ్రీ సీతారాముల పాత్రలను అనంతశీల, బల, సౌందర్య సంపదతో నింపి తులసీదాసు, మానవ సమాజానికి ఒక మహోజ్జ్వలమైన ఆదర్శం, సుఖమయ జీవితానికి తిరుగులేని సాధనం ప్రసాదించారు. తులసీ రచనలోని ఈ శీల నిరూ

పణానికి ముచ్చటపడి, మన త్యాగరాజస్వామి తన కృతుల్లోగూడ, శ్రీరాముని శీల, శక్తి, సౌందర్యాలనే ముఖ్యంగా కొనియాడారు.

'అతిలావణ్యరాము కనులార జూడరే' అనే కృతిలో -

'నీ మనసు, నీ సొగసు, నీ దినుసు వేరే' అంటూ ఆ మూడు గుణాలకే ప్రాధాన్యం ఇచ్చారు. త్యాగరాజు తులసీదాసునూ, ఆయన రచనలనూ బాగా అధ్యయనం చేశారు. ఆయన కృతుల్లో తులసీదాసు భావాలు అనేకచోట్ల స్పష్టంగా గోచరిస్తాయి. అది వేరే స్వతంత్రమైన ప్రసంగ విషయమే అవుతుంది.

తులసీదాసు తన మానస రచన, దోహా చౌపాయీ పద్ధతిలో గావించారు. దోహా మన ద్విపదలాంటిది. చౌపాయీలో నాలుగుపాదా లుంటాయి. రెండేసి దోహాల మధ్య నాలుగేసి చౌపాయీ లుంటవి. ఇవి ప్రధానంగా గ్రంథంలో ఆద్యంతమూ నడిచే వృత్తాలు. ఇవిగాక నాలుగు పంక్తుల "ఛంద"మనే మరొక వృత్తం, రెండు పంక్తుల సోరఠ అనే లఘువృత్తం గూడ మధ్య మధ్య ఉపయోగించారు. ప్రతికాండకు ప్రారంభంలో, ప్రార్థనాపరమైన సంస్కృతశ్లోకా లుంటాయి. వాటిలో కవి ప్రయోగించిన భాషాభావాలు చాలా సరళంగా మనోహరంగా ఉంటాయి.

నాలుగు చౌపాయీలు ఒక దోహా కలిసి ఒక దోహా క్రింద పరిగణింపబడ తాయి. అలాంటి దోహాలు, ప్రక్షిప్తాలు మినహాయిస్తే, బాలకాండలో 361, అయోధ్య కాండలో 325, అరణ్యకాండలో 46, కిష్కింధాకాండలో 30, సుందరకాండలో 60, లంకాకాండ, అంటే యుద్ధకాండలో 121. ఉత్తరకాండలో 130 ఉన్నాయి. ఈ కాండలకు వరుసగా విమల సంతోష సంపాదన సోపానం, విమల విజ్ఞాన వైరాగ్య సంపాదన సోపానం, విమల వైరాగ్య సంపాదనం, విశుద్ధ సంతోష సంపాదనం, జ్ఞాన సంపాదనం, విమల విజ్ఞాన సంపాదనం, అవిరల హరిభక్తి సంపాదన సోపానం అనే పేర్లు కాండాంత పుష్పికల్లో కనిపిస్తాయి. ఉదాహరణకు ఉత్తరకాండ పుష్పిక చూడండి.

"ఇతి శ్రీరామచరితమానసే సకల కలికలుష
విధ్వంసనే అవిరలభక్తి సంపాదనోనామ
సప్తమసోపానః సమాప్తః"

ఈ కాండలలో అరణ్య, కిష్కింధ, సుందరకాండలు చాలా చిన్నవి. తులసీదాసు తన ఉత్సాహశక్తి యుక్తులన్నీ మొదటి రెండు కాండల్లోను

యుద్ధ, ఉత్తర కాండల్లోను ప్రదర్శించారు. అరణ్య, కిష్కింధలమాట అటుంచి రామాయణానికి ప్రాణంగా పరిగణించబడే సుందరకాండ కేవలం 60 దోహాల లోనే ముగించడం విచిత్రంగా కనిపిస్తుంది. ఇందులకు కారణం ఆస్తికులైన విజ్ఞులు ఈ విధంగా చెబుతారు: త్రేతాయుగంలోనే హనుమంతుడు హనుమన్నాటక మనే పేరుతో రామాయణాన్ని వ్రాసి వాల్మీకికి చదివి వినిపించినాడట. ఆ అద్భుతమైన రచన గద్దను నష్టే తన గ్రంథం మూలబడుతుందని భయపడి వాల్మీకి, ఆయనను అభినందించకపోగా, సుందరకాండలో ఆత్మశ్లాఘ, స్వోత్కర్ష ప్రదర్శించావని ఆంజనేయుని విమర్శించాడట. దాంతో ఆ వినయశీలి తన గ్రంథాన్ని సముద్రంలో పారవేశాడట. ఆ హనుమంతుడే తులసీదాసుగా అవత రించి దేశ భాషలో ఆ రామాయణం వ్రాశాడనీ, వాల్మీకి అధిక్షేపణకు అవకాశం లేకుండా సుందరకాండ కథ సంక్షేపంగా రచించాడని వీరల సమాధానము. ఇది సబబుగానే కనిపిస్తుంది. లేకపోతే 'రామాయణ మహామాలారత్న'మన దగిన తులసీదాసు, "సుందరే కిం న సుందరం" అని కీర్తించబడే ఆ కథా భాగంలోని రసవద్ ఘట్టాలను ఉపేక్షించడానికి మరొక కారణం కనిపించదు. అయిననూ గత నాలుగు శతాబ్దాలుగా ఉత్తర భారతావనిలో తులసీరామాయ ణానికి గల ప్రచారము, జనాదరణ వాల్మీకి రామాయణానికి లేకపోయినవి బహుశా త్రేతాయుగంలో వాల్మీకికి గలిగిన భయం సహేతుక మైనదే నేమో! ఈనాడు ఉత్తరాదిన రామాయణ మంటే తులసీరామాయణ మనే సాధారణ జనుల విశ్వాసము.

ఉత్తమ శ్రేణికి జెందిన కవి కగాధ మగు హృదయమూ, మానవ, మానవేతర ప్రకృతుల నిరీక్షింపగల సునిశితమగు దృష్టి ఉండి తీరాలి. అవి లేనినాడు గ్రంథలక్షణములలో జెప్పబడిన ఛందోలంకారపద్ధతులన్నింటిని కలిగియున్ననూ ఆ రచన నిర్జీవప్రతిమవలె నిరుపయోగ మౌతుంది. గోస్వామి తులసీ కేవలము భక్తులు మాత్రమేగాక యుత్కృష్టమైన కవిహృదయము భావనాబలము గల వారు. తమ రామాయణంలో ప్రభావోత్పాదకములగు స్థలముల వెదకి విపులముగ వర్ణించినారు. రామాయణమే గాక వారు రచించిన గీతావళీ, కవితావళీ, వినయపత్రికలలో గూడ వారి గంభీర హృదయ సాగరంలో తరంగితాలయ్యే ప్రేమ, విరహము, వాత్సల్యము, ఆత్మసమర్పణము, ఆశ్చర్యము, అనుతాపము, మహత్వాకాంక్ష, ఆశ, నిరాశ, దైన్యం, విరక్తి, సందే హము, భక్తి, యుగసందేశము మొదలయిన భావాలు దర్శించగలం.

వివాహానికి పూర్వమే వధూవరుల కన్యోన్యానురాగ మున్నచో వారల దాంపత్య జీవితం ప్రేమమయమై సుఖావహం కాగలుగును. ఈ తథ్యం గుర్తించి ఆ మహాకవి తన మానసంలో వాల్మీకి రచనలో లేని పుష్పవాటికలో సీతారాముల ఆకస్మిక సమావేశాన్ని చేర్చి, ధనుర్భంగమునకు పూర్వమే వారలకు పరస్పరాను రాగం గలదని, అది యుగయుగాలుగా వస్తూన్న దివ్య దాంపత్య బంధన మని సూచించారు.

అదే ఘట్టంలో తాను వరించిన ఆ మధురశ్యామలాకారుని సౌకుమార్యాన్ని, కులిశకఠోరమైన ధనువునూ, తన తండ్రి చేసిన ప్రతిజ్ఞనూ చూచి సీతమ్మ తనలో తాను తల్లడిల్లి పోతుంది.

"కహఁధనుకులిసహుచాహి కఠోరా, కహఁస్యామలమృదుగాతకిసోరా?
అహహతాతదారున హఠఠానీ, సముఝ తనహిఁకఛులాభనహానీ:
విధికె హిఛాంతి ధరౌఁ ఉరధీరా-సిరిస సుమన కన భేది యహీరా:"

వజ్రంకన్న కఠోరమైన ఈ ధనుస్సు ఎక్కడ, మృదులశ్యామగాత్రుడైన ఆ కిశోరు డెక్కడ! అయ్యో! మా తండ్రి హానిలాభాలు విచారించకుండా ఎంతటి కఠోరమైన హఠం పూనినాడు! శిరీషకుసుమకణంతో వజ్రాన్ని భేదించాలని సంకల్పించినాడు గదా!

హనుమన్నాటకంలోని శ్లోకంగూడ ఇదేభావం ప్రదర్శిస్తుంది.

"కమఠపృష్ఠ కఠోరమిదంధనుః, మధురమూర్తిరసౌ రఘునందనః
కథమధిజ్యమనేన విధీయతాం-అహహ తాతః పణ స్తవ దారుణః"

సీతమ్మ మనస్సులో చెలరేగే తుపాను, స్వామి గుర్తించక పోలేదు. ఆమెకు, మర్యాదాభంగం కానివిధంగా ఊరట కలిగించాలి. ఎలా? క్రియా వైదగ్ధ్యనిపుణుడైన శ్రీరాముడు ఒక్క పర్యాయం సభనంతా కలయ జూచినట్లు దృష్టులు సారించి, ఎదురుగా గవాక్షంలో నిలబడిన సీతమ్మను చూచి వెంటనే ఆ బ్రహ్మాండమైన పినాకాన్ని, గరుత్మంతుడు పాముపిల్లను చూచినట్టుగ చూస్తాడు! దానితో ఆమెకు ఊరట కలుగుతుంది.

"కృపానిధాన రామ సబుజానా
సియహిఁవిలోకితకెవుధనుకైసే, చితవగరుడలఘు వ్యాలహిఁజైసే!"

ఆ విధంగా ఆ దివ్య దంపతుల హృదయాలు సంవాదించుకుంటాయి. తులసీరామాయణంలోని ఈ అద్భుత ఘట్టం త్యాగరాజ స్వామిగారి కెంతో

నచ్చింది. ఆయన "దయ సేయవయ్యా సదయ! రామచంద్ర! దయను కొంచె మైన నాడు సీతాకాంతకు కల్గిన సుఖము" అనే కృతిలో ఈ భావాన్నే వివరించారు. ఇలాంటి రసవత్తర ఘట్టాలు రామచరితమానసంలో కోకొల్లలు. వ్రాసినది ప్రబంధశైలిలో నైనా తులసీరామాయణంలో నాటకీయరమణీయత్వం అనేక సందర్భాలలో గోచరిస్తుంది.

మానవ స్వభావ చిత్రణంలో తులసీ ప్రదర్శించిన అద్వితీయమైన ప్రజ్ఞ బాహ్య ప్రకృతి వర్ణనంలో దెబ్బతింటుంది. బాహ్యప్రకృతిలో ఆయన మన స్సంతగా రమించదు. జడప్రకృతి, సూర్యోదయ. ఋతువర్ణనలను గూడ ఆయన, సమాజ సంస్కరణ అనే తన ప్రధాన లక్ష్యానికి అనుకూలంగా ఉప దేశాత్మకమైన పద్ధతిలో చిత్రిస్తారు.

తులసీదాసు సమయాన దేశంలోని అల్లకల్లోలానికి గల అనేక కారణాలలో శైవవైష్ణవ భేద ప్రవృత్తి యొకటని ఇంతకుముందు సూచించ బడినది. తులసీ తన మానసంలో శ్రీరామ నామజపితగా శంకరునీ, శ్రీరామ లింగేశ్వర ప్రతిష్ఠాపకుడుగా శ్రీరామచంద్రుని చిత్రించి, శివకేశవాద్వైత భావాన్ని ప్రజా మానసంలో ప్రతిష్ఠించారు. శ్రీరాముడు స్వయంగా "శివ ద్రోహి నాదాసు డని చెప్పేవాడు స్వప్నంలోకూడ నాకు ఇష్టుడు కాజాలడని" కంఠోక్తి కావిస్తాడు.

"శివద్రోహీ మమ దాస కహావై
సోనరసపనెహుమోహిన భావై"

తులసీరామాయణానికి ఓఢ్ర భాషలో నాలుగు, వంగభాషలో మూడు అనువాదా లున్నాయి. గుజరాతీలో టీక యొకటి కనిపిస్తుంది. సంస్కృతంలోనూ అనువాదం వెలసినది. దాని సర్గాంత గద్య ఇలా ఉంటుంది:

"ఇతి శ్రీమద్రామాయణే రామచరితమానసే మహాకావ్యే సకల కలుష విధ్వంసిని ఉమామహేశ్వర సంవాదే......కాండ......సర్గః."

ఇందులో అరణ్య సుందర కాండలు మాత్రమే ముద్రింప బడినవి. ఆంగ్లంలో కూడ F. S. Grouse దీనిని అనువదించాడు. 1875 నాటికే ఆ అనువాదం ఆరవ ముద్రణ పొందింది. ఇటీవల రష్యాభాషలో గూడ తులసీ రామాయణానువాదం జరిగింది. చరిత్రకారుడు విన్సెంట్ స్మిత్, 'తన సమకా

లీన కవులందరలోను తులసీ గొప్పవా'డనీ, ఆయనను బోలిన సాహిత్యవేత్త మరొకడు లేడని వ్రాశారు. ప్రసిద్ధ బాషా శాస్త్రజ్ఞుడు డాక్టర్ గ్రియర్‌సన్ ఈ రామాయణాన్ని గురించి యిలా వ్రాశారు:

"రామచరితమానసం కవియొక్క సర్వోత్కృష్ట రచన. అది 9 కోట్ల ప్రజలకు బైబిలులాంటిది. ఉత్తర భారతంలో ప్రతి హిందువునకు ఈ గ్రంథాన్ని గురించి తెలిసినంత, మధ్యమ శ్రేణికి జెందిన ఆంగ్లేయునకు బైబిలును గురించి తెలియదు."

ఇంతవరకూ హిందీలో అత్యంత ప్రజాదరణను బొంది గడచిన నాలుగు దశాబ్దాలుగా కోట్లాది ప్రజలచేత ఆరాధింపడుతున్న తులసీ రామాయణాన్ని గురించి సంక్షేపంగా తెలుసుకున్నాం. శ్రీ కేశవ దాసనే మరొక కవి గూడ రామచంద్రిక అనే పేరు మరొక రామాయణం హిందీలో వ్రాశా డని చెప్పుకున్నాము. ఆ గ్రంథాన్ని గురించి కొంచెంగా వివరిస్తాను. ఈ కేశవదాసు తులసీదాసునకు సమకాలికుడు. బుందేలుఖండంలోని 'ఓరఛా' నివాసి. సనాఢ్య బ్రాహ్మణుడు. ఈయన కుటుంబం వారు సంస్కృతంలో గొప్ప విద్వాంసులు. కేశవదాసు సాహిత్య శాస్త్రానికి హిందీలో పునాది వేసిన ప్రథామాచార్యుడు. కవిప్రియ, రసికప్రియ అనే పేర్లతో రెండు లక్షణ గ్రంథాలు రచించాడు. 'ఓరఛా' నరేశుడైన ఇంద్రజీత సింహుని ఆస్థాన విద్వాంసుడు. తెలుగులో శ్రీనాథ మహాకవిలాగ సకలరాజ మర్యాదలు అనుభవించిన భోగి. ఈయన తన రచనల్లో ప్రాకృతమానవులను ప్రశంసించాడు. వి.శకం 1612 లో జన్మించి, 1672 లో పరమ పదించాడు. ఈయన రామ చంద్రిక అనే పేరిట వ్రాసిన గ్రంథంలో 39 ప్రకాశాలు అంటే సర్గ లున్నాయి. గ్రంథం ఆద్యంతమూ నారికేళ పాకం. వర్ణనలలో ఔచిత్యం, భావగాంభీర్యం కనిపించవు. ఆ గ్రంథాన్ని రామాయణం అనడంకన్న ఛందోలంకార శాస్త్రానికి లక్ష్యగ్రంథం అంటే బాగుంటుందేమో.

కేశవదాసు తన రచన బాలకాండలో విశ్వామిత్రుని ఆగమనంతో ప్రారంభిస్తాడు. అడుగడుగునకూ ఛందములు మార్చుతూ, ఔచిత్యరహితాలయిన ఉపమలు ఉత్ప్రేక్షలు కురిపిస్తూ రచన సాగిస్తాడు. కథాసూత్రం కొన్ని చోట్ల లోపిస్తుంది. అయితే సంవాదాలు మాత్రం-లక్ష్మణ పరశురామ సంవాదం, సీతా ఆంజనేయుల సంవాదం లాంటివి వచ్చినచోట్ల చక్కగా నడుస్తుంది రచన.

సీతతో హనుమంతుడు సంభాషించిన సందర్భాన, మొదట హనుమ శ్రీరామ ముద్రిక యిస్తాడు, అదిచూచి భావాతిరేకంలో సీతమ్మ. జడచేతన వివక్ష మరచిపోయి ఆ ముద్రికను సంబోధించి యిలా ప్రశ్నిస్తుంది:

"శ్రీపురమే, బనమధ్యహౌ, తూమ గకరీ అనీతి
కహి ముందరీః అబతియనకీ, కోకరిహైపరతీతిః"

'ఓ ముద్రికాః లక్ష్మి పురం (అయోధ్య)లో, అరణ్యంలో నేను, మార్గ మధ్యంలో నీవు అనీతి గావించాము. (అంటే శ్రీరాముని వదిలిపెట్టాము). అలాంటప్పుడు స్త్రీ జాతిని ఎవడు విశ్వసిస్తాడు చెప్పవేః' అంటుంది. అందుకు ముద్రిక మాటాడక పోయేసరికి ఆ తల్లి అమాయకంగా హనుమంతుణ్ణి చూచి ఇలా ప్రశ్నిస్తుంది:

"యహ ఉత్తర దేతి న బుద్ధిమంత,
కెహి కారన ధౌ హనుమంత సంతః"

"బుద్ధిమంతుడవైన హనుమంతా! నా ప్రశ్నకు ఈ ముద్రిక ఎందుకు జవాబు చెప్పదయ్యాః" కరుణగంభీరమైన ఆ పరిస్థితిని గ్రహించిన పవన కుమారుడు, చక్కని సమయస్ఫూర్తితో, ముద్రిక మౌనానికి కారణం ఇలా చెబుతాడు:

"తుమపూఛతి కహి ముద్రికేః మౌనహోతియహినామ్.
కంగనకీ పదవీ దయీ, తుమబిన యాకహ రామ్ః"

'తల్లీః నీవు ఉంగరమా! అని సంబోధించావమ్మా దీనిని. ఈ ఆభరణం ఇప్పుడు ముద్రిక గాదు. నీ వియోగంలో శ్రీరామ ప్రభువు దీని పదవిని పెంచాడు. దీనికి కంకణపు హోదా యిచ్చాడు తల్లీ! కంకణాన్ని ముద్రికా అని పిలిస్తే ఎలా పలుకుతుంది ?'

ఎంతటి ధ్వనిపూర్ణమైన సమాధానంః శ్రీరాముని శరీర కార్శ్యాన్ని ఎంత సున్నితంగా ఎంతటి భావతీవ్రతతో సూచించాడు కేశవదాసుః

ఆయితే యిలాంటి ఘట్టాలు ఎడారిలో జలాశయాల్లాగ అత్యల్పమైన సంఖ్యలో ఉంటాయి రామచంద్రికలో.

భావాలకు వలెనే రామచంద్రికలోని భాషకూడ అస్తవ్యస్తంగా, కలగా పులగంగా ఉంటుంది. కేశవదాసాగ్రంథాన్ని వ్రజభాషలో ప్రారంభించి వ్రాసినా, మధ్య మధ్య తన బుందేల్ ఖండీ భాషాపదాలు విచ్చలవిడిగా ప్రయో

గించాడు. సంస్కృత సమాసాలూ, ప్రత్యయాంత పదాలు పొందిక, ఔచిత్యం లేకుండా చొప్పించాడు. దానితో భాష అర్థం కావడమే గొప్ప సమస్య అవుతుంది. ఇక రసాస్వాదనకు అవకాశం అంటూ ఎక్కడ? ప్రజలలో దానికి ఏనాడు ప్రచారం ఉండలేదు. విశ్వవిద్యాలయ తరగతుల్లో ఎం. ఏ. పరీక్షారులకు పాఠ్యగ్రంథంగా, ఏ కొలది మందికో దాని యునికి మనుకులు తెలుసు. అంతే.

ఆధునిక హిందీ సాహిత్యంలో స్వర్గీయులు శ్రీ మైథిలీశరణ్ గుప్త వ్రాసిన 'సాకేత్' కావ్యం గణనీయమైనది. శ్రీ గుప్త ప్రకృత్యా రామభక్తులు. రామకథాగానం చేసి తన వాణిని పవిత్రం చేసుకోవాలనేది ఆయన అభిలాష, జీవిత లక్ష్యం. విశ్వకవి రవీంద్రనాథ టాగూర్ వ్యాసం 'కావ్యేకీ ఉపేక్షితా' 'సాహిత్యంలో ఉపేక్షితులయిన నాయికలు' ఆయన్ని బాగా ఆకర్షించింది. అందులో రామాయణంలో వాల్మీక్యాదులచే విస్మరించబడిన మూక తపస్విని ఊర్మిళాదేవి త్యాగోజ్జీవితమైన శీలం బహుథా ప్రశంసింప బడింది. దానికి తోడు శ్రీ గుప్తగారి కవితాగురువు కీ॥ శే॥ శ్రీ మహావీర ప్రసాద ద్వివేది కూడ ఊర్మిళ విషయంలో కవులు చేసిన పొరబాటును ఒక వ్యాసరూపంలో ప్రకటించారు. దానితో కవిలోకానికి ఆపాదించబడిన ఆ మచ్చను తుడిచివేయాలనే సంకల్పంతో శ్రీ గుప్తజీ తమ రచన సాగించారు. అందులో రామాయణ కథ వర్ణింప బడినప్పటికీ అందలి సంఘటనలన్నీ ఊర్మిళను కేంద్ర బిందువుగా చేసుకోని ఆమె చుట్టూ పరిభ్రమిస్తూ ఉంటాయి. కథాప్రారంభం వివాహానంతరం అయోధ్యలో ఊర్మిళా లక్ష్మణుల ప్రేమ సల్లాపంతో ప్రారంభమై శ్రీరాముని యువరాజ్యాభిషేకం, కైకేయీ వరప్రదానం, రామవనగమనం, భరతుడు తిరిగి వచ్చిన తర్వాత అయోధ్యవాసులందరతో చిత్రకూటానికి వెళ్లడం, పాదుకా ప్రదానానంతరం తిరిగి సాకేతానికి రావడం వరకు నడుస్తుంది ఆ తర్వాత కవి సీతారామలక్ష్మణులను అడవిలో వదలి సాకేతంలో ఊర్మిళను కనిపెట్టుకొని కూర్చుంటాడు. చివరదాకా- శూర్పణఖోదంతం, ఖర దూషణ వధ మొదలయిన కథా సన్నివేశాలు అయోధ్యలోనే శత్రుఘ్నుని చేత చెప్పిస్తాడు ఆ శత్రుఘ్నునకావిషయాలు ఒక సార్థవాహుని ద్వారా తెలుస్తాయి. తర్వాత సంభవించే పరిణామాలన్నీ-యుద్ధంలో లక్ష్మణుని మూర్ఛవరకు, సంజీవికోసం వచ్చిన హనుమంతునిద్వారా సాకేతంలో వివరింప బడతాయి.

సంజీవ నౌషధి అయోధ్యలోనే భరతుని ద్వారా సేకరించి మారుతి లంకకు వెళ్లిపోతాడు. రావణవధాది తదనంతర యుద్ధక్రమమంతా అయోధ్యలోనే ఊర్మిళ భరతాదులకు వశిష్ఠముని తన యోగదృష్టిద్వారా దూరదర్శినిలో వలె దర్శింప జేస్తాడు. రఘువంశీయుల చరిత్ర, దశరథ శ్రీరామాదుల జన్మ, జనకుని వృత్తాంతం, సీతాప్రాప్తి బాలలీలలు, తాటక వధ, శివధను ర్భంగం, సీతాకళ్యాణం వరకు గల ప్రారంభిక వృత్తాంత మంతా ఊర్మిళయే వివరిస్తుంది. ఇలా రామకథ ఆద్యంతాలు ఊర్మిళ సన్నిధిలో సాకేతంలోనే పాఠకులకు వివరింప బడతాయి. రామాయణ కథాకథనంలో శ్రీ గుప్తగా రనుసరించిన ఈ విధానం సర్వథా వినూత్నమైనది. ఇందులో ఊర్మిళ త్యాగం, తపస్సు ప్రధానంగా విపులంగా వర్ణించ బడినాయి. కైకేయి పాత్ర, భరతుని శీలం చక్కగా పోషించారు శ్రీ మైథిలీబాబు. ఖడీబోలీ హిందీ భాషలో రచించబడిన ఈ కావ్యంలో నుంచి భరతుని నిర్వేదం, కైకేయి పశ్చాత్తాపం, ఊర్మిళ విరహాన్ని సూచించే ఒకటి రెండు ఉదాహరణలు చూపి ఈ వ్యాసం ముగిస్తాను.

భరతుడు చిత్రకూటంలో కన్నీరు కార్చుచూ శ్రీరాముని ఉపాలంభిస్తాడు.

"ఉసజడ జననీకా, వికృత వచనతో పాలా
తుమనే ఇసజనకీ ఓర్, న దేఖాభాలా!"

"ప్రభూ! జడబుద్ధి అయిన నా తల్లి యిచ్చిన వికృతపు టాజ్ఞను నీవు పాలించావే కాని దీనుడైన ఈ దాసుణ్ణి చూడనైనా లేదుకదా!"

అందుకు నిరుత్తరుడై శ్రీరాముడు కొంత సేపటికి తెప్పరిల్లి 'నాయనా భరతా భద్రగుణ సముద్రా! నీ అభీప్సిత మేమో తెలుపు తండ్రీ!' అంటాడు. భరతుడు. –

"హే ఆర్య! రహా క్యా భరత అభీప్సిత అబ భీ?
మిలగయా అకంటక రాజ్య ఉసే అబ తబ భీ!
పాయా తుమనే తరుతలే అరణ్య బసేరా
రహగయా అభీప్సిత శేష తదపి క్యా మేరా;
తను తడప తడప కరతప్త, తాతనే త్యాగా
క్యారహా అభీప్సిత ఔర తథాపి అభాగా?
హాకౌన్ అభీప్సిత ఔర్ ఆర్య, వహ కిసకా?

సంసార నష్టహై, భ్రష్ట హువా, ఘర జిస్‌కా।
ముఝసే మైంనే హీ స్వయం ఆజముహఫేరా,
హే ఆర్య బతాదో తుమ్హీ అభీప్సిత మేరా।

"ప్రభూ! నిష్కంటకమైన రాజ్యం లభించిన తర్వాత గూడ ఈ భరతుడికి అభీప్సితం అంటూ ఏమిటుంది? అడవుల్లో చెట్టు చేమలక్రింద నీవు వాసం చేస్తున్నావు, ఇక నాకు మిగిలిన అభీప్సితమంటూ ఏముంది? గిలగిల తన్నుకొని పితృపాదులు తనువు చాలించారు, ఇంకా ఈ దౌర్భాగ్యుడికి తీరని అభీప్సితం ఏముంటుంది? లోకమే శోకోపహతమైంది. కొంప కూలిపోయింది. నాకు నామీదనే జుగుప్స కలుగుతోంది. నన్ను నేనే వంచించుకున్నా. ప్రభూ! ఇక నా అభీప్సిత మేదో చెప్పవలసినది నీవే!"

ధీరగంభీరుడైన రాముడు భరతుని ఈ ఆత్మధిక్కారానికి, నిర్వేదానికి, ఆక్రోశానికి ఆపాదమస్తకం కంపించిపోతాడు. ఉపవిష్టులైన అయోధ్యావాసులందరూ వినుసట్లుగా అంటాడు-

"ఉస్‌కే ఆశయకేథాహ, మిలేగీ కిస్‌కో?
జనకర, జననీభీ, జాననపాయీ జిస్‌కో!"

"కన్నతల్లికే అగమ్యగోచరమైన భరతుని స్వభావం, ఆశయాలు అతడి హృదయపు లోతులు, ఇతరులెలా గ్రహించగలరు?" ఆ మాటతో అందరి దృష్టులూ కైకేయివైపు మళ్ళుతాయి.

"సబ్‌నే రానీకీ ఓర్, అచానక దేఖా
వైధవ్య, తుషారావృతా, యథావిధులేఖా
బైఠీథీ అచల తథాపి అసంఖ్య తరంగా
వహ సింహీఅబథీ హాహా! గోముఖీ గంగా!"
"హాఁజనకర్ భీ మైనేన భరతకో జానా
సబ సున్‌లేఁ, తుమనే స్వయం అభీయహమానా
యహ సచహైతో, అబ లౌట చలోఘర భైయా!
యదిమైఁ ఉకసాయీ గయీ భరతసే హోవూఁ
తో పతి సమానహీ స్వయంపుత్ర భీ ఖోవూఁ."

వైధవ్య తుషారావృతమైన చంద్రరేఖలాగ ఒకమూల నిశ్చలంగా కూర్చొని ఉన్న కైకేయిని చూచారు అంతా. ఒకప్పుడు సింహినిగా ఉన్న ఆమె ఇప్పుడు గంగోత్రిలో గోముఖ నిర్గతమైన గంగలాగ శాంతంగా కనిపించినా ఆమె హృదయం అసంఖ్యాకాలైన భావాలతో తరంగితమై పోతుంది.

"అవును నిజం, కడుపున కనినా, భరతుని నేను గుర్తించలేదు. ఈ మాట అందరూ గమనించండి; రామా, ఇప్పుడే అన్నావు సుమా! నీవన్నది నిజమైతే బాబూ, అయోధ్యకు తిరిగిరా. భరతుని ప్రేరణకు లోనై నేనీ పాడుపని చేసి ఉంటే భర్తలాగానే పుత్రుడుకూడా నాకు దక్కకుండా పోవుగాక! ఇంతవరకూ 'కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా న భవతి' అంటూ వచ్చిన సూక్తిని నేను తలక్రిందులు చేశాను!"

యుగ యుగ తక చలతీరహే, కఠోరకహానీ
రఘు కులమే భీ థీ, ఏక్ అభాగీ రానీ
నిజ జన్మ-జన్మమే సునే, జీవయహ మేరా
"ధిక్కార్! ఉసే థా మహా స్వార్థనే ఘేరా"

"ముందు యుగాలవారీ కఠోరవృత్తాంతం నెమరువేయుచుందురు గాక- 'పాలవంటి రఘుకులంలో గూడా ఒక దౌర్భాగ్యురాలు, నికృష్టపు జీవి, మహా స్వార్థపరురాలు రాణీత్వం వెలగబెట్టింది అలా లోకులు గావించే అధిక్కారం అభిశంసనం అనేక జన్మలెత్తుతూ ఈ జీవి వింటూ ఉండుగాక!"

మధ్యమాంబ హృదయాన్ని బ్రద్దలుచేసే ఆ అగ్నిపర్వతపు వేడికి శీల సింధువు రాముడు తట్టుకోలేకపోయాడు.

"సౌబార ధన్య వహ ఏక్ లాలకీ మాయీ,
జిస జననీ నే హైజనా భరత్‌సా భాయీ!"

'భరతుడులాంటి సహోదరరత్నాన్ని కనిన ఆ తల్లి ధన్యురాలు, ధన్యురాలు ముమ్మాటికీ మహాధన్యాత్మురాలంటూ' రాముడు పెట్టిన కేక సమావిష్టమైన జనసమూహమంతా పిచ్చెత్తినట్టు గద్గదకంఠంతో పునరుద్ఘోషించింది."

ఇలా శ్రీ మైథిలీ బాబు తన కావ్య కౌశలంతో కైకేయి కళంకాన్నంతా క్షాళనం చేశారు.

ఇక ఊర్మిళ విషయం ? అసలు కావ్యరచనయొక్క ప్రథాన లక్ష్యమే, నాయికయే ఆమె అయినప్పుడామె పాత్ర చిత్రణంలో కవి ఎంతటి శ్రద్ధాసక్తులు ప్రదర్శించియుందురో సహృదయులు ఊహించుకొనగలరు. పతి విరహంలో ఆ మానవతి పడినవేదన మాటల కందదు. దేశకాలఋతువాతావరణాదులన్నింటినీ ఆ తల్లి తీవ్ర విరహం ఆవరిస్తుంది. వర్షర్తువులో కాటుక పిట్టలజంట రూపంలో, ప్రియుని చక్షువులామెను పలుకరించిపోతాయి. భర్తృవియోగానికి గురి అయిన

చక్రవాకిని "నీకు తోడుగ నేనూ ఉన్నా' నంటూ ఓదార్చుతుంది. సంస్కార శూన్యమైన శయన మందిరంలో అల్లుకున్న సాలీడు గూడును, దానిని తుడిచివేయ బోతే వారించి స్వనిర్మితమైన గూటిలో చిక్కుకున్న ఆ సాలీడురాణి గూడ తన లాంటిదే నని దీర్ఘ నిశ్వాసం వదలుతుంది. ఒక్కొక్కప్పుడు రాజమహలు వదలి భర్తకు తెలీకుండా అడవిలోకి వెళ్ళి చెట్టుగుట్టలమాటునుండి ఆయన దివ్య మూర్తిని చూడాలనీ, లక్ష్మణు డా చోటనుండి వెళ్ళిపోయిన తర్వాత అక్కడి ధూళిలో పొరలాడవలయు నని ఉబలలాటపడుతుంది. భావాతిరేకంలో అర్ధ విక్షిప్తమైనస్థితిలో పగటి కలలు కంటుంది, లక్ష్మణుడు వచ్చినట్టుగా శరీరం తెలియని ఆ స్థితిలో గూడ ఒక్కడుగా కనుపించిన ప్రియుని చూచి భయంతో కంపించిపోతుంది. ఊహాలక్ష్మణుడితో ఉంటుంది.

"ప్రభు కహాఁ? కహాఁకింతు అగ్రజా ? వహనహీఁఫిరే, క్యా తుమ్హీ ఫిరే ?
హంగిరే అరే, తోగిరే ! గిరే! ధిక్ వృధాహుఈ, ఊర్మిలావ్యథా ! "

"ప్రభువెక్కడ? మాఅక్క ఎక్కడ? వారు రాలేదా! నీవొక్కడవే తిరిగి వచ్చావా ? జాలి తలచి నిన్ను పంపిరా ? అయ్యో అయితే, నా బాధ,అంతా, ఈ ఊర్మిళ తాపమంతా వ్యర్థమే గదా ! మనం పడిపోయాము, ప్రియా, పతితుల మయ్యాము!" అని విలపిస్తుంది.

అలాంటి త్యాగమయి గనుకనే, చిత్రకూటంలో సీతమ్మ ఏదో మిషతో తన చెల్లెలిని లక్ష్మణుడు, పర్ణశాలలో కొద్దిక్షణాలు కలుసుకునే అవకాశం కలిగించినప్పుడు, సేవావ్రత నియతుడైన రామానుజుడు, తన అరాంగి త్యాగానికి అబ్బురపడి అంటాడు-

"బనమే తనికతపస్యా కరకే బననేదో ముఝుకోనిజయోగ్య
భాభీకీభగినీ! తుమమేరే అర్థనహీఁ కేవల ఉపభోగ్య !"

"మా సీతమ్మవదినె ముద్దుచెల్లీ! నీవు కేవలం నాకు భోగ్యవస్తువవు కావు, నీకు యోగ్యుడ ననిపించుకొనుటకు అరణ్యంలో కొన్నాళ్లు నన్ను తపస్సు చేయనిమ్ము."

ఇదీ లక్ష్మణునకు తపస్విని అయిన తన అర్ధాంగిపట్ల గల గౌరవభావం! అత డామె కొసగిన మేరుశృంగోన్నతస్థానం !

ప్రాతఃకాలీన తుహిన బిందువుల్లాగ ఇలాంటి పవిత్రాలూ నిర్మలాలూ అవదాతాలూ అయిన భావాలతో శ్రీ మైథిలీశరణగుప్తగారి సాకేత మహాకావ్యం

కరుణ సుందరంగా భాసిల్లుతుంది. వర్తమాన హిందీసాహిత్య గగనాన్ని ఆలోకితంగావించే ఉజ్జ్వలజ్యోతి పుంజాలలో ఈ రామకావ్యానికి గల స్థానం విశిష్టమైనది.

అధికారం, ఆధిపత్యం, ధనం, సౌఖ్యం, పేరు ప్రతిష్ఠలకోసం పశువుల స్థాయికన్నా హీనమైన నికృష్టపద్ధతులు అవలంబిస్తూ, తమ స్వార్థసిద్ధికోసం రాష్ట్రహితం, దేశసౌభాగ్యం, చివరకు మానవత్వాన్ని కూడ బలిగావించేందుకు సిద్ధపడి, రక్తంపంచుకొని పుట్టిన సోదరుల రక్తపానానికి గూడ వెనుదీయని మనస్తత్వాలతో లుకలుకలాడుతూ, జీర్ణ శీర్ణమైన ఈ నాటి మానవ సమాజానికి అత్యంత ప్రాచీనమైన శ్రీరామ చరిత్రం ప్రసాదించే జీవన సందేశం ఎంతైనా ఉన్నది. ఆ సందేశం చిరపురాతనం, నిత్యనూతనం: సనాతనం: అన్నిదేశాల వారికి అన్ని కాలాలలోనూ సంసేవ్యమైన అమోఘమైన భవౌషధం. శ్రీమద్రామాయణం:

పుణ్యం పాపహరం, సదా శివకరం, విజ్ఞానభక్తిప్రదం,
మాయామోహమలాపహం, సువిమలం, ప్రేమాంబుపూరం, శుభం
శ్రీమద్రామచరిత్రమానస మిదం, భక్త్యావగాహంతి యే
తే సంసారపతంగ ఘోరకిరణైర్దహ్యంతినో మానవాః.

ఇతి శమ్

# జానపద రామాయణాలు

## — ఆచార్య బి. రామరాజు

వేదములు ప్రస్థానత్రయము తరువాత రామాయణ భారత భాగవతములే భారతీయులకు పరమప్రమాణములు. ఇది పండితులు శిష్టులైనవారి సంగతి. వేదాదుల సుద్ది యెరుగని జానపదులకు మాత్రము రామాయణ భారత భాగవతములే ఇహపర సాధకములు. ఇవియే వారి పాలిటి ప్రస్థాన త్రయము. ఈ మూటిలో రామాయణము మేలుబంతి. సీతారామచంద్రులు తెలుగు జానపదులకు తలిదండ్రులు. సుఖమునకు దుఃఖమునకు వారికి రామనామమే శరణ్యము. అరి కాల ముల్లు నాటినను, అరచేత వైకుంఠ మబ్బినను జానపదులకు రామచంద్రుడు కొననాలుక నిల్లుగట్టుకొనును. ఆ యాదర్శ పురాణదంపతులు తమ యరణ్యవాస కాలమున కొన్నాళ్లు మన గోదావరి తటములందు నివసించుట మన పూర్వపుణ్యము. పర్ణశాలా ప్రాంగణముల పెంచిన లతకూనలకు రామలక్ష్మణులు గోదావరిజలము లందించినపుడు సీతమ్మ నీళ్ళు పోసి పాదులు కట్టినదట. అప్పు డా ముగ్గురాడు కొన్న ముచ్చటలు గోదావరితల్లి తన గుండెలలో పొంగరించుకొన్నది. నాటినుండి నేటివరకా గోదావరి గుండె గలగలలు వినుచున్న తెలుగు జానపదులకు తెలిసి నంత రామాయణ రహస్యములు తదితరులకు తెలియవేమో! రామాయణము వారి నోళ్ళలో చిలువలు పలువ లల్లుకొన్నది. మన శిష్టవాఙ్మయమున రామాయణ మూలక గ్రంథముల సంఖ్య తక్కినవానికంటె యధికము-అట్టివానికంటె జాన పదుల రామాయణము లధికతరము. ముద్రితములై నా దృష్టికి వచ్చినవి కూచ కొండ రామాయణము, శారద రామాయణము, ధర్మపురి రామాయణము, రామ కథాసుధార్ణవము, మోక్షగుండ రామాయణము, సూక్ష్మరామాయణము, సంక్షేప రామాయణము, గుత్తెనదీవి రామాయణము, అధ్యాత్మ రామాయణము, చిట్టి రామాయణము, శ్రీరామదండములు, లంకాసారథి, రామాయణ గొబ్బిపాట, శ్రీరామ జావిలి, అడవి గోవిందనామాలు, శాంతగోవిందనామాలు, పెండ్లి గోవిందనామాలు, సేతు గోవిందనామాలు మొదలైనవి సంపూర్ణముగనో అధిక

భాగముగనో రామాయణకథను వర్ణించునవి. శాంతాకల్యాణము, పుత్రకామేష్టి, కౌసల్యాపైకలు, కౌసల్య వేవిళ్ళు, శ్రీరామ జననము, శ్రీరాముల ఉగ్గుపాట, రాఘవ కల్యాణము, రాములవారి అలుక, సుందరకాండ పదము, ఋషుల ఆశ్రమము, సుగ్రీవ విజయము, కోవెల రాయబారము, అంగద రాయబారము, లక్ష్మణ మూర్ఛ, లంకాయాగము, గుహభరతుల అగ్నిప్రవేశము, శ్రీరామపట్టాభిషేకము, లక్ష్మణదేవరనవ్వు, ఊర్మిళాదేవి నిద్ర, కుశలాయకము, కుశలవ కుచ్చలచరిత్ర, కుశలవకుచ్చెల కథ, కుశలవయుద్ధము. పాతాళహోమము, శతకంఠరామాయణము, సీతావిజయము వంటివి రామాయణమహాగాథలోని ఏకదేశములు. కేవలము సీతమ్మ నాధారముగా చేసికొని వెలువడిన పాటలు సీత పుట్టుక, సీతకల్యాణం, సీత నత్తవారింటి కంపుట, సీతసమర్త, సీతశుభగోష్ఠి, సీతగడియ, సీత వామనగుంటలు, సీతమ్మవారి అలుక, సీత వసంతము, సీత దాగిలిమూతలు, సీత సురటి, సీత మేలుకొలుపు, సీత ముద్రికలు, సీత చెర, సీతఆనవాలు, సీత అగ్నిప్రవేశము. సీత వేవిళ్ళు మొదలైనవి. ఇక ముద్రితములై నా కందనివి యెన్నో. అముద్రితములు మాత్రము తెలుగుదేశమున ఊరి కొకటి చొప్పున నుండు ననుకొందును. ఈ పాటలలో కొన్ని వాల్మీకి రామాయణమునకు, మరికొన్ని అధ్యాత్మ రామాయణమునకు, కొన్ని దేశభాషాకవుల రామాయణములకు దగ్గరగా నుండును. కొన్నింట జైన బౌద్ధ రామాయణముల ప్రభావము గోచరించును. మరికొన్ని కేవలము జానపదుల కల్పనములు. జానపదులు సీతారాములతో తాదాత్మ్య మందిరి. తమ దైనందిన జీవితమందలి ప్రతి రేఖయు ప్రతికంపనమును, ప్రతినిశ్వాసమును జానపదులు సీతారాములవిగనే భావించిరి. ఆంధ్రీపురంధ్రులు సీతమ్మతల్లితో తాదాత్మ్యమందిన తీరే వేరు. ఆమె యాట ఆటగా, ఆమె పాట పాటగా, ఆమె యరణ్యవాసము తమ యరణ్యవాసముగా, ఆమె చెర తమ చెరగా, ఆమె అగ్నిప్రవేశము తమ యగ్నిప్రవేశముగా జానపదస్త్రీల హృదయములు పలపోసినవి. ఇంత విస్తారముగా నున్న జానపదరామాయణముల పందిరిపై చిలువలు పలువలుగా చిత్రవిచిత్రములైన కల్పనలతో నల్లుకొన్న కథాలతికలనుగాని, ఆ లతికలకు పూచిన సుకుమార సుందర భావప్రసూనములనుగాని, ఆ సహజప్రసూనములందు జాలువారు రస మరందమును గాని సంపూర్ణముగా కాదుగదా అరకొరగా ప్రదర్శించినను గ్రంథము విస్తరించును. కనుక తెనుగు జానపదుల రామాయణ విశేషములను మాదిరికై దిఙ్మాత్రముగా ఆమెతవెట్ట ప్రయత్నింతును.

పుత్రకామేష్టిపాటలో వాల్మీకిరామాయణమున లేని సీతారాముల పూర్వ రాగ మున్నది. విశ్వామిత్రునివెంట రామలక్ష్మణులు ధనుర్యాగమును చూడ మిథిలకు పోదరు. ఒకసాయం సమయమున సీతమ్మ తన చెలికత్తెలతో కలిసి పుష్పాపచయమునకై ప్రవేశించిన యుద్యానవనమునందు శ్రీరాముడు సాయం సంధ్యవార్చుకొనుటకై చేరును. బాలయోగివేషమున నున్న శ్రీరాముని జానకి పూజించి ఇట్లడుగును. "ఎచ్చటినుండి వచ్చినారు? యే పనికొరకు? మీపేరేమి-యెవరి శిష్యులూ మీరు తెలియ జెప్పుమా?" శ్రీరాము డీవిధముగా సమాధానము చెప్పును: "విశ్వామిత్రుని శిష్యుడాను-రఘుబుడ యోగిహృదయమున-ధనుసు పందెము చూడ మేము-తర్లివస్తిమి" ఆపై వారిరువురి సంభాణము లీవిధముగా సాగినవి.

సీత:- ఎందుకీ సన్యాసాము-బాల్యమందే పొందితిరి—రాజకాంతి ముఖము మీద-తేజరిల్లగా.

రాముడు:- మొదట వీరక్షత్రియుడై-యోగామున బ్రాహ్మణ్యాము - పొందినట్టి విశ్వామిత్రుని - పుణ్య మిట్టిదే.

సీత:- యోగులాకు ధనుసుపందెపు - వివాహాము గూడునయ్య - గురువు గారు యేమి చెప్పిరి - గుర్తు దెలుపుమా.

రాముడు:- బాలయోగికి మా గురువు- భా క్తితో నిచ్చునట్టి - కన్యాకావివాహాము కరుణతొ జేయునూ.

సీత:- పూజ శివధనుస్సూను - యెత్తి బాణము చేర్చువానికి - సీతా నిచ్చును జనకుడు - యితరుల కివ్వాడు.

రాముడు:- పూజయందు నుండు ధనువు - పందెమునకు యెందుకు వచ్చె-ధనుసు బరువు యెంతటిదో - సుదతి చెప్పుమా.

సీత:- చెలులాతో బంతి యాడగ - భోషాణము క్రింద బడిన - ధనుసు నెత్తి సీతాదేవి - బంతిని దెచ్చెనూ.

రాముడు:- యింతేకదా ధనుసు బలము - యింతూలకు సాధ్యంబైనది - మంత నమ్ముతో వీరున - కెంత గొప్పదీ.

సీత.- రాజాధిరాజూలు - రమ్యశివధనుస్సూను - లేవనెత్తక వారందరు - క్రిందానే పడిరి.

రాముడు:- రాజూలకు సాధ్యము కాని - కార్యమూల యోగీశ్వరులు - చేయు చుందురాని సభలో - వినియుండ లేదా.

సీత:- ఐతే మీకు సాధ్యంబగుచో - మా సీతాదేవికి - యోగివరుడు భర్త యగుట - యుక్తంబగునా.

రాముడు:- పుష్పమూలో బుట్టి సీత - పెంపూబడినదాని కిపుడు - రాజులతో సంబంధాము - కూడా దెన్నటికీ.

సీత:- నేనే సీతాదేవినండి - నా తప్పులా క్షమించండి — రామాచంద్రూని నాకు - పతిగా గూర్చండి.

రాముడు:- దుస్సాధ్యంబగు నీకార్యం బది - సిద్ధించాదు నావలన - మహర్షి బృందము చెంతా జేరి - సేవా జేయుము.

సీత:- శరణాగతి జేసినవారిని - సంరక్షింప సమర్థూలు - పాదములపై బడుదు - కాపాడుడు వేగ.

రాముడు:- దీనజనుల బాధాలను - దీర్చూటాకు నేటినుండి - దీక్షతో ప్రతిజ్ఞ నేను - జేయుచుంటినీ-రాముడే నీకు భర్త - రమ్యమూగ గాగలడూ - యిచ్చోటికి వచ్చినా - డెచ్చోటను లేడూ"

ఇంతవరకు బాలయోగితో సంవాదము లాడిన సీతమ్మ అతడే శ్రీరాముడని తెలియగనే సిగ్గు దొంతరమల్లె యైపోయినది.

సీతగడియ, సీతవసంతము, సీతామ్మవారి అలుక వంటి పాటలు సీతారాముల శృంగారజీవితమును ఔచితీశోభితముగా తీర్చిదిద్దునట్టివి. సీతాదేవి వామనగుంట లాడు పాటలో సీతమ్మ చతురోక్తుల పుట్ట. ఒకనాడు సీతారామచంద్రు లిరువురు ఓమనగుంట లాడిరి. ఆటలో శ్రీరాము డోడిపోయెను. చేసికొన్న ఒప్పందము ప్రకారము శ్రీరాముడు కొంత పణము చెల్లించుకొనెను ఆటలో జయాపజయము లెవరికి కలిగెనో తెలిసికొన కుతూహలము కలిగిన కౌసల్య సీతమ్మ నడిగెను. చతురవచోనిధియైన సీతమ్మ "మీ కొడుకు గడుసు కనుక డిబ్బీలు తీసెనూ" అని బొంకెను. అడిగినది పూజ్యురాలైన అత్తగారు. తాను నిజముగా గెలిచినను అత్తగారి ముందు తా నోడిపోయినట్లు చెప్పి వినయము ప్రదర్శించినది. నిజము చెప్పినచో ధూర్తురాలుగా భావించు ప్రమాదమున్నది. శ్రీరాముని యోటమి ఆతని తల్లి ముందు చెప్పుట ఉచితముకూడ కాదుకదా! ఆవిధముగా బొంకి అంతఃపురములోనికి పోయినది. అచట తోటికోడండ్రు జయాపజయముల గూర్చి యడుగగా మీ బావ లోడి యిదె పదివేల కట్నాలిచ్చి"రని సత్యవచనములే పలికినది. నిజముగా తా నోడిపోయినను సాటివారిలో

లోకువ కాగూడదు కనుక గెల్చినట్లుగానే చెప్పుకొనెడి దీ ప్రగల్భురాలు. పెద్దదైన అత్తగారిని మెప్పించగలిగిన సీతమ్మకు చిన్నవారైన తోటికోడండ్రను మెప్పించుట ఒక లెక్కా?

సీత వసంతము పాటలో కౌసల్యా దశరథుల వాత్సల్యపు టనుభూతులు వర్ణింపరానివి. శ్రీరాము దేకాంతమున నుండగా సీతమ్మ దొంగచాటుగా బోయి అతనిపై చెంబెడు వసంతము గ్రుమ్మరించెను. శ్రీరాముడు మరల వసంతము చల్లుటకై ఉద్యుక్తుడు। కాగా ఆమె పరుగుపరుగున వచ్చి అత్తచాటున దాగుకొనెను. ఆ ఘట్టమును వర్ణించు చరణము లెంత మనోహరములో చిత్తగింపుడు.

"మున్నూరు చిమ్మగోవుల వసంతములు। పట్టుకొని పరమాత్మ దేతెంచెనప్పు। ఓయమ్మ మామీద వసంతములు జల్లి। ముచ్చువలెనే వచ్చి దాగియున్నాది। అంపుమని శ్రీరాము డటు పలుకగాను। అంప నని కౌసల్య యిటు బలుకగాను। అక్కడకు వచ్చెనే అత్త సూమిత్ర। శ్రీరాము లుండేటి చందంబు జూచి। ఈ వేడుక।మనము కనుల జూతాము।ఆకోడలు నెత్తుకొని అంతఃపురముకు।అరుగబోగా నిలువు నిలువు మను। చూను। నీలవర్ణుడు సీత కడ్డముగ వచ్చె। భేరినీలు నపిరీలు పెంపు దీపింప। తమ కొల్వు చాలించి దశరధేశ్వర్లు।అంతఃపురంబులకు అటు వేగ వచ్చె। తల వంచు కోడలును జూచి ఆ రాజు। ఇది యేమి చోద్యమో అని పలుకగాను। కలకల నవ్వెనే కౌసల్యదేవి। సతిపతులు సరసములు సలుపుచుండంగ। తిలకింపక నేనేల కొలువులో నుంటి। ఈ వేడుకలు కనుల చూడంగనైతి। నా పాపమున గాని నాకెట్లు కలుగు।ఓయమ్మ నీకు సిగ్గు బిడియములు లేవె। నీమీద చల్లిన నీలవర్ణుణ్ణి।నెలతరో రఘురాము తోడుకొని వచ్చి । నీచేత వసంతములు చల్లింతు నేను।" దశరథమహారాజు సీతారాములచే మరల వసంతము లాడించి తాను కౌసల్యాది కాంతలతో స్తంభముల చాటున నుండి చూచెడు ఘట్టము మధురాతిమధురము.

సీతగడియ పాటలో మనకు సాక్షాత్కరించు సీతమ్మ బరువు బాధ్యతలెరిగిన సమష్టికుటుంబపు పెద్దకోడలు. పిన్నలు పెద్దలు అందరికి భోజనములు పెట్టి ఇల్లు చక్క దిద్దుకొని, "అత్త కౌసల్యకూ అడుగులూ వొత్తీ- మామ దశరథులకు మడత లందించీ- సుమిత్ర కైకకూ సురటీలు వేసి- పరగ కౌసల్యకూ పాన్పులూ పరచి" తాను స్నానము చేసి అలంకరించుకొని భోజనానంతరము శయ్యాగృహమున కేగును. ఇంత జాగు చేసినందుకు రామయ్యగారికి కోపము వచ్చి తలుపు గడియ వేసికొని పరుండెను. సీతమ్మ వచ్చి

"తలుపేయు కోపమును తాళంగ గలనా- నిలుచుండి పాదాలు చేతులూ నొచ్చె- దంతంపు తలుపులూ తియ్యవోయి నాథా - ఒంటొంటె చినుకుకే ఒక కొంగు దడిసె- కాముడా తీయవోయి కనకంపు గడియ- పటపట చినుకులకు పైకొంగు తడిసె- పచ్చలబాలుడా తీయవోయి గడియ- కరుణించి తీ స్తివా కాళ్ళకడనైన మరచి వక నిద్రైన శరణంది పోదు" అని బతిమాలినది. హెచ్చిన కోపముతో రామయ్య "నిద్ర నీకు లేకుంటె నాకేమి సీత- గంటవలె దీపమ్ము అది నాకు తోడు- నీవు నిల్చుంటేను నాకేమి సీత- గంధము కస్తూరి అది నాకు తోడు- నీవు నిల్చుంటేను నాకేమి సీత- పట్టెమంచం పరుపు అది నాకు తోడు" అని సమాధానము పలుకును. సీతమ్మ అలిగిపోయి అత్తగారితో చెప్పుకొనును. కౌసల్య వచ్చి రాముని మందలించి తలుపు తీయించును. వెంటనే సీతమ్మ "మా మామదశరథులు ఒక్కరున్నారు-అత్త మీరు పొండి మా మామ కడకు" అని అత్తగారిని చమత్కారముగా సాగనంపినది. ఇందులోని సారస్యము వాచ్యము చేయనక్కరలేదు గదా! ఈ పాటలోని సీతారాముల సంభోగ శృంగార మెంత ఔచిత్య శోభితమో గమనింపుడు. సీతమ్మ సిగ్గుతో తన విభుని సన్నిధికి "చేరగనే దివ్వె కలకలా నవ్వె- ఆకులా వాసనా పానుపు మీద- పోకలా వాసనా పానుపు మీద - పువ్వులా వాసన పానుపు మీద- కస్తూరి వాసనా పానుపు మీద" గుబులొక్కన్నవట.

సంక్షేపరామాయణ మను పాటలో దశరథుని పుత్రకామేష్టి నుండి శ్రీరామ పట్టాభిషేక పర్యంతము గల కథ యున్నది. కైక వరముల ప్రకారము శ్రీరాము దడవులకు బోనుండగా దుఃఖించు దశరథుని సమీపించి కౌసల్య ఓదార్చిన ఘట్టము కరుణాపూరితము.

"పతి జూచి శోకించి పతిముఖము దుడిచి
అతివ దుఃఖముతోడ పతి కిట్లు లనియె
అలనాడు వరములూ ఏల యిచ్చితివి
పూర్వజన్మామందు జేసినా కృతము
కుడువక తీరునా యెట్టి వారలకు
అనుచు తనయుని దీసి తా గారవించి
యెవరి కనులలో మండెనో మంట
యెవ్వరి నేత్రాల చిచ్చు బెట్టితిమొ
యెడబాపు జేసెనే పాపదైవంబు

మాకేల బుడితివిర ఓ రామచంద్ర
కయికకు పుడితేను రాజ్య మేలుదువు"
సీతారామలక్ష్మణులు వనవాసమునకు బయలుదేరు ముందుపాట ఇట్లున్నది.
"విల్లును అంబులు ధరణిపయి నుంచి
హస్తములు ముడుచుకొని మ్రొక్కె లక్ష్మణుడు
సృష్టంత నీవు సుమి శ్రీభూమిదేవి
అచ్యుతుని అడుగులకు వొత్తకుడి రాళ్లు
అనుచు ధరణికి మ్రొక్కి అందరును తరలి
రఘుపతి ముందరను సౌమిత్రి వెనుక
అవనిసుతయూ నడచె అరణ్యములకు
పొడుపు చుక్కావలెను పొందుగా నీవు
అడవులలో తిరుగ అమరితివి సీత
మీనాక్షి నీ పుణ్య మెట్టిదో గాని
మా భాగ్యములు అరణ్యముల పాలు ఆయె
యింతకంటె సుఖము లేదు పొమ్మనుచు
సంతోషచిత్తుడయి కదలె రాఘవులు
ఇంతితో కూర్చుండె ఇరువింద క్రింద
యిరువింద నీవింత చల్లనయి యుండి
కౌసల్యకంటెనూ ప్రేమ జూపితివి"

సీతారామలక్ష్మణులు సరయూనది దాటి వనములు ప్రవేశించునప్పుడు సీతమ్మ ఒక కొలనులో స్నానమాడి అచట కొమ్మలు పాతి పదునాలుగేండ్లు వనవాసము గడచి సుఖముగా అయోధ్యకు తిరిగి వచ్చినచో ముత్యములతో రత్నములతో పూజింతునని మ్రొక్కుకొనును. అది చూచి శ్రీరాముడు నవ్వి 'కొమ్మకు మ్రొక్కితివా ? కొలనికి మ్రొక్కితివా ? కొలనులో నున్న హంసలకు మ్రొక్కితివా ?' యని యెగతాళి చేయును. సీతమ్మ త్రిమూర్తులకును వారి భార్యలకును మ్రొక్కుకొన్నట్లు చెప్పును. శ్రీరాముడు "గంగకు మ్రొక్కితే గతులిచ్చు గాని-రాజ్యంబులిచ్చునా ఓ హంసగమనా" యని సీతమ్మకు తోడుగా గంగ నొక సతిగా గావింతునా యని ప్రశ్నించును. అప్పుడు సీతమ్మ "అత్తకు సవతొచ్చి అడవులకు బంపె - జలములే సవతయితె తల మునిగిపోను" అని చమత్కారము లాడెను.

'ఋషుల ఆశ్రమము' పాటలో శ్రీరాముడు యజ్ఞశాలలో పడుకొని యుండగా సీతమ్మ యాతని పాదసంవాహనము చేయుచు, 'సరగ మీ పాదములు శంఖ పద్మములు- యీ లక్షణములు మీ కెంతైన నొప్పు-అయోధ్య విడిచి మీ రడవులకు రాగ-ఇడుములు పడ మీకు నింతెట్లు వ్రాసె-పాదరక్షలు తొడగి పై నడవకుండ-భరతుడు గొనె మీదు పావుకోళ్ళ'ని వేదనాత్మకమైన హాస్యము లాడును. సీతారాములు నిద్రించుచుండగా కావలి కాయు లక్ష్మణుని భ్రాతృసేవా ధర్మ మిట్లున్నది: "మేఘంబు లురిమిన మేదురశస్త్ర-బాణంబు సంధించి బాధించ నెంచు-నక్షత్రగణములు నందందు జార-బాణంబు సంధించి బాధించ నెంచు-శ్రీరాముడును సీత చెలగి నిద్రించ-సర్వభూతంబులు సద్దుగా నుండ-వలె నంచు శాసించె వరలు లక్ష్మణుడు". అడవిబాట నడచుచు ఒకచో చల్లని నీడలున్న చెట్లను సంబోధించుచు సీతమ్మ "కొమ్మలార మీరు కోసలేంద్రుండు-ఏ కష్టములు లేక హితవు మీరంగ - అరణ్యవాసంబు కరమొప్పునట్లు - జరిపి అయోధ్యకు తరలంగ జేయ - వేడుదు నేను మిము వృక్షమ్మలారా - ఓషధు లార యాయుర్విలో మీరు - సకల ప్రాణులకును చాలగా ప్రాణ - దానంబు చేయుచు తగియున్నవారు - అయోధ్యపట్నంబు నందిన వెనుక - ముత్యాల రత్నాల మురువొప్పగాను - పూజిస్తు మిమ్ముల పూబండ్లతోడ-తేనెలు పోయుదు తేకువ మీకు - మి మ్మెవరు కొట్టకుండ మేలు గలుగంగ- నా విభునితో జెప్పి యేవేవియైన - జేయిస్తు మీకును సిరిగల్లు నటుల - భాగీరథిని మీకు ప్రాకిస్తు ననుచు - పరిపరివిధముల బామాలి మ్రొక్కె"నది. రాము డా మాటలకు సీతమ్మను ఎకసెక్కెము లాడగా లక్ష్మణుడు "వైదేహి లోకంపు వనిత యన రాదు - ప్రకృతి పెంచిన బిడ్డ పరమ పవిత్ర" యనును. అపుడు శ్రీరాముడు లక్ష్మణునితో నేకీభవించి "నవ్వుచు రాఘవులు నళినాక్షి జూచి - ప్రకృతి బెంచిన బిడ్డ ప్రకృతి చిత్రములు - పరగ గాంచగ గోరి బయలుదేరింది - చక్రవాకిని విడిచి చక్రవాకంబు - చదల దిరుగదు సుమా చంద్రు డేతేర - ఇరువురు గూడుచు నింపుగా నుంద్రు" అనును.

'లంకాయాగము' పాటలో పర్ణశాలలో నివసించు నప్పు డొకనాడు సీతమ్మ ఒంటిగా నుండజాలక చెలికత్తెలు కావలెనని శ్రీరాముని గోరును. ఈ యడవిలో నేనెక్కడినుండి చెలికత్తెల తేగలనని శ్రీరాము డనగా సీతమ్మ చిన్ననాడు తన తండ్రి సముద్రునింట నాడుకొన్న పగడసాల లున్నవి తెప్పింపుడనును. శ్రీరాముడు కమ్మ వ్రాసి కాకి కాలుకు గట్టి సముద్రునికడ

కంపెను. సముద్రుడు కమ్మ చదివికొని కాకి కాలుకు పగడసాలలు కట్టి పంపెను. రంగనాథుడు ఔచితీవంతముగా తీర్చిదిద్దిన అవాల్మీకమైన జంబుమునివృత్తాంతమునకు మూలమైన చక్రభూపాలుని కథ ఈ పాటలోని మరొక విశేషము. కుమారుని మరణవార్త విని పగ సాధింప వచ్చిన శూర్పణఖ శ్రీరాముని మోహింపగా నామె ఒంటరిగా నున్న లక్ష్మణునికి తగునని సీతమ్మ చెప్పెను. అప్పుడు శ్రీరాముడు 'ఇంటి పూరి దీసి ఇటు మళ్ళమనుచునూ వీపునా వ్రాలు వ్రాసే - అప్పుడూ చుప్పనాతి అతివేగిరమ్మునా మ్రాను దగ్గర కొచ్చెనూ - వీపునా మీయన్న వ్రాలయున వ్రాసెనూ చదువుకుందువు రావయా" అని శూర్పణఖ లక్ష్మణునితో ననెను. లక్ష్మణుడు "ముక్కు చెవులూ గోసి చేతిలో పెట్టెనూ చెప్పుకొమ్మని పలికెనూ". ఆమె తన యన్న రావణుని చెంతకు బోయి సీతమ్మను గూర్చి "మండోదరికన్న మరి చక్కనీ కన్య లోకాన లేదురన్నా - ఇందరీ స్త్రీలలో వెదకి చూచిన గాని అటువంటి కన్య లేదు" అని సీతాపహరణమునకై పురికొల్పెను. రావణుడు మూర్ఛితురాలైన సీతను ముట్టక 'ఉదయ శూలము దెచ్చి గడ్డతో పెకలించి రథముపైనా యుంచె'నట. అశోకవనములో సీతమ్మ తన విషాదగాథను వినుపించుచు త్రిజటను 'వేగుచుక్క వినుము వెడలు శృంగారు బొంగారు బొమ్మ వినుమూ - తీగెమెరుపా వినుము చీకటింటద్దమూ విభీషణుని పుత్రి వినుమూ' యని సంబోధించిన తీరులు సహృదయులు తరచికొలది మనోహరార్థము లొసగు అనర్ఘమణులు. రావణుని శక్తిచే మూర్ఛితుడైన లక్ష్మణుని అంకమున నిడుకొని శ్రీరాముడు విలపించు మట్టము కరుణాపూరితము. "పదునాలుగూ యేండ్లు నిద్రాహారము లేదు పడియుండ దెన్నడూను - వెనుక నుండుటె కాని యెదటి కెన్నడు రాడు తొడలమీదికి వచ్చెనూ - కైకమ్మ వరములు దశరథుడు మమ్మడుగ కార్యములు నేరాయెనూ- అడవులకు పొమ్మనీ అన్యాయమే చేసె అన్న నీ ప్రాణములకూ - ఇంకెన్ని జన్మాల తపసునా నీవంటి ఆత్మబంధుడు గలుగునూ - వినవోయి లక్ష్మణా సీతవంటి స్త్రీని బడయంగవచ్చు గానీ- నీవంటి సోదరుడు తన కెట్లు కలుగునో ఎన్ని జన్మములకైనా — భరతు పట్టము గట్టి పారిపో దలచితివి పగవాణ్ణి గాను నీకూ - ఉప్పుకోసము వచ్చి సుగ్రీవుడా నేను కప్పురము గోలుపోతి - ఆలి కోసము వచ్చి జాంబవా నేనిపుడు అసుజుణ్ణి గోలుపోతీ - ధరణిసుతకై వచ్చి నీలుడా నేనిపుడు తమ్ముణ్ణి గోలుపోతీ - యేలోకానికి పోతివో తమ్ముడా ఆలోకమునకు నన్నూ - కొంపొమ్మ లక్ష్మణా కూడి వస్తిమి మనము కూడి

యుండుట ధర్మము". ఈపాటలో అవాల్మీకమైన పాతాళహోమమునుగూర్చిన కథయును గలదు. రణరంగమున పడియున్న రావణుని కళేబరమును సమీపించి మండోదరి విలపించిన ఘట్టము కూడ హృదయవిదారకముగా నున్నది. "మహా రాజ నేనంత నిను గొలిచి యుండగా యెందు పోతివి రావణా- పది శిరస్సులు నేడు దిగువ పొర్లాడెనని పయిదీసుకే అదలెనూ - నేల పడుకుంటేను ఒడలు ఒత్తేనని పయిదీసుకే అదలెనూ- వీడె నా సంపదలు నా రాజ్య భోగ ములు వీటి కెవ్వరు కర్తలో-" విభీషణు నుద్దేశించి మండోదరి 'దయలేదు మీయన్న దగ్గరకు చేరవూ నీకన్న యెవ్వరయ్యా-రఘురాముతో చెప్పి అన్నను చంపిస్తి వదలంగ నీకేటికో- వానరా బలమంత లంకలో కిప్పుడు పోకుండ నీవు జూడూ"దుఃఖములో ఈ చివరి మాట లామె రాజకీయ బుద్ధివైశారద్యమున కుదాహరణములు.

సీతాన్వేషణకు బయలుదేరు హనుమంతునికి శ్రీరాముడు సీతమ్మ అంద చందములు ఆమెతోడి దాంపత్యజీవిత మందలి మనోహర సంఘటనలు వర్ణించి చెప్పుట సీతాదేవి యానవాలను పాటలో గలదు, సీతమ్మ సౌందర్యవర్ణనము దీనిలో పరమోదాత్తముగా నున్నది. సీతమ్మను గుర్తించుటకు ఆంజనేయునకు మార్గ మెంత సులభము చేసినాడో శ్రీరామచంద్రుడు! "మహిమీద మా దేవి గాంచేటి తెరవు- వినవయ్య చెప్పేను శ్రీవాయుసుతుడా - నిజమునకు విప్పినవి నీలంపు కురులు- జడలు గట్టి కడు పెద్దవిగ నుండు- తలఅంటు ఆడకే ఆడి నట్లుండు- పచ్చిపసు పలదకే అలదినట్లుండు- పెట్టకను కాటుక పెట్టినట్లుండు- దిద్దకను తిలకమ్ము దిద్దినట్లుండు- అలదకను పరిమళ మలదినట్లుండు- చేయక శృంగారం చేసినట్లుండు- వేయక తాంబూలం వేసినట్లుండు - తొడుగులు తొడ చకే తొడిగినట్లుండు- తొలకరి మెరుపువలె తా మెరయుచుండు - మసిపాత గట్టిన మాణిక్యంవలెను శీతకాలమునాటి ఉదకమ్ము వలెను - పాఠ్యమి జదివిన వేదమ్ము వలెను పరమసతి ప్రభావమెల్ల జెడియుండు" నట. ఇట్టి దివ్యసౌందర్య దర్శనము శిష్టసాహిత్యమునగూడ అరుదే యనుకొందును. ఇక వారి దాంపత్య జీవితపు మధురానుభూతు లొండు రెండు. మొదటి సన్నివేశము సీతారాముల వివాహకాలమునాటిది: "మరియొక్క ఆనవాలు కలదు సుమి హనుమ-మరవక చెప్పుమీ మా సీతతోను - కల్యాణమంటపమ్ములలోను సీతా - వామన గుంటలు ఆడుచుండగనూ-సుదతి జానకిదేవి జూడ దలపొచ్చి-వచ్చిన రాముని జూచి యా చెలులూ - జానకితోడనే చేడె లిట్లనిరి- రాముని కన్నులే రమ్యంపుకనులు- శృంగార కన్నులే దీపంపు కనులు — నిను జూడ వచ్చేనే నీలమేఘుండు -

నిన్నడగవచ్చెనే కమల బాంధవులు-నిను జూడ వచ్చినా మన్మధుం డితడు-అని యిట్లు చెలికత్తె లానతియ్యగను -సిగ్గుపడి శిరసొప్ప వంచుకొనియుండె - తమ తల్లి యుండేటి మందిరము కేగె — సిగ్గుపడి శిరసొప్ప వంచుకొనియుండె - సిగ్గుపడి వచ్చేవు చెప్పవే నాతో - నిను జూడ వచ్చేరు రామచంద్రూలు - నిన్నడగ వచ్చేరె కమలబాంధవులు - అని యిట్లు తమ తల్లి ఆనతియ్యగను సిగ్గుపడి శిరసొప్ప వంచుకొనియుండె - ఇదియొక ఆనవాలని చెప్పు హనుమా!" ఇది సీతమ్మ సిగ్గుతో తలమున్కలైన తొలివాళ్ళ సంఘటనము. రెండవది తన సౌందర్యము తనకే తెలియని ముద్దరాలితనమును తెలియజేయు సన్నివేశము.

"మరియొక ఆనవాలు కలదు సుమి హనుమా - మరువక చెప్పుమా మా సీతతోను - అద్దమ్ములోపల అతివ తన రూపు - అందులో జూచి కురులంకించి ముడువా-ఈ అద్దమూలోను ఈ రూపుతోను-ఇంత చక్కనిదేవి యిది యెవ్వరనుచు - అహహా శ్రీరామ అయ్యోధ్యరామ - సృష్టికి తవులుచేసి యిట్టు లెరిగితివా - ఏకపత్నీవ్రతుడవని యిచ్చె మాతండ్రి - ఏకపత్నీత్వంబు ఇంపుగా తెలిసె-ఇట్టి మాయలసతిని పిలిపించ దగునా - అవనిజ కడు ముగ్ధ అగుట తా దెలిసి - లోలాక్షి యెరుగదని మదిలోను నవ్వి - కరస్థలము పట్టుకొని కాంత నిట్లంటి - పతి లేని సతి జూచి అతివ కోపిస్తివి- పతి జూచితే అలుక బాసునా చెపుమ - నిలువుటద్దము దెచ్చి మెరుగు తుడిపించి - తీగమెరపుబోడి ముందరా నిలిపె - ఇద్దరీ రూపులూ అందులో జూచి - ఇద్దరీ వన్నె సౌందర్యములు జూచి - నరనాథ వారెవరూ యెరిగించు మనెను - సీత భయముబాప అతివరో వినవే - సీతయూ రాముడూ చేరియున్నారు - ఈ యింట నిం కెవ్వ రుండంగ గలరె - అతివ వెరచి తాను పాదములు మ్రొక్కె - ఇది ఒక ఆనవాలని చెప్పు హనుమ". మూడవ సన్నివేశము అరణ్యావాసకాలమున చిత్రకూటమున నున్నప్పటిది. ఒకనాడు స్నానము చేయుటకై "పచ్చి పసు పలదుకొని పద్మాయతాక్షి - కొలనిదగ్గర కెళ్ళె గోవిందుదేవి". కాని వెంటనే గిరుక్కున తిరిగి వచ్చి ఆమె శ్రీరామునితో ఇట్లన్నది. "ఇదే యేమి చోద్యమో యినవంశజుండా- మింట చంద్రుడు వచ్చి ధరణి నున్నాడు - తుమ్మెదలు వచ్చాయి చూడ రమ్మనెను". సీతాస్నానమునకు భంగము కలిగినందుకు శ్రీరాముడు సీతమ్మ వెంట కొలను దగ్గరికి పోయెను. కొలనిలో సీతమ్మ ఇదిగో చంద్రుడు, ఇవిగో తుమ్మెదలని చూపించెను. శ్రీరాముడు నవ్వి "మింట చంద్రుడు గాడు అతివ నీ మోము - తుమ్మెద లవి గావు సఖియ నీ కురులూ" అని సీతకు కలిగిన

భ్రాంతిని తొలగించెను. "అని యిటు బలుకగా ఇందీవరాక్షి - సిగ్గుపడి శిరసొప్ప వంచుకొని యుండె - ఇది యొక ఆనవాలని చెప్పు హనుమా - మరియొక ఆన వాలు కలదు సుమి హనుమా!". అంజనేయునికి ఇట్టి ఆనవాళ్ళు పదమూడు చెప్పి శ్రీరాముడు సాగనంపెను.

'సీత అగ్నిప్రవేశము' పాటలో రావణవధానంతరము శ్రీరాముడు సీతను దోడ్కొనిరా విభీషణాదుల నాజ్ఞాపించును. అప్పుడు విభీషణాదులు "ఇప్పటి రూపమున దెత్తుమా దేవా - పూర్వంపు రూపమున మేము దెత్తూమ:" అని యడిగిరి ఇప్పటి రూప మెట్లున్న దని శ్రీరాము డడుగ "కారేను కన్నీరు కట్టినవి జడలు - మాసిన వస్త్రములు మరి మురికితోళ్ళు - హృదయమున మొలి చుండి ఒక వెదురు మొలక - అసతి పరపురుషు నెదుటికే రాదు" అని విభీషణుడు సీతమ్మ రూప మెరిగించెను. రాము డామెను తొల్లింటి రూపమున దెమ్మనెను. సీతమ్మకు స్నానము చేయించి అలంకరింపించి రాముని సన్నిధికి తెచ్చిరి. ఆమె శ్రీరాముని పాదములపై వ్రాలెను. రాముడు ముఖము త్రిప్పుకొని కానిమాట లాడెను. ఆమె మూర్ఛపోయెను. రాముడు రథమెక్కి కదలెను. సీతమ్మ తేరుకొని "పోకుపోకు రామ పుణ్య శ్రీరామ - ముగు రన్నదమ్ముల ఆన సుమ్మనెను- అందరి ఆనకు నిలువకా రథము- ఎగిరిపోతూవుండే అంత రిక్షముకు" అప్పుడు "భూదేవి పుత్రికను జనక కన్యకను - నా యాన అని పల్కె సీతామహాదేవి - పరమపతివ్రత సీతప్పి ఆనవెట్ట పంకజనాభుల రథము కదలాపు". శ్రీరాముడు మరల సీతమ్మను నిందించెను. ఆమె దుఃఖించినది. లక్ష్మణుని అవమానించినందులకు పశ్చాత్తాపపడినది. అగ్నిప్రవేశ మొనర్చినది. అప్పుడు "కణకణ నిప్పులూ కుంకుమ్మలాయె - పరిచున్న నిప్పులూ పన్నీరు ఆయె - చాపిన నిప్పులూ చందనంబాయె - మండేటి నిప్పులూ వడగండ్లు ఆయె - చిలుకలు కోవెలలు హంసలు గుమిగ- సీతకు తోడుగా కొలనాడు చుండె- సింహాసనంమీద సీత గూర్చుండె-". శ్రీరాముడు స్త్రీలు మాయావులని ఇంకను శంకించుచుండగా భూదేవి దశరథుడు అశరీరవాణి ప్రత్యక్షమై శ్రీరామునికి నమ్మకము గలుగునట్లుగా చెప్పి సీతమ్మ నప్పగించిరి.

రామాయణపు పాటలలో "గుహభరతుల అగ్నిప్రవేశము" విశిష్టమైనది. పెట్టిన గడువునాటికి తా మయోధ్య చేరకున్నచో భరతు డగ్నిప్రవేశము చేయునని శ్రీరాముడు తమ రాక భరతున కెరిగింప ఆంజనేయుని ముందుగా బొమ్మనును. అప్పుడు సీతమ్మ "మరియును గలదయా మన వీటిలోను -

అధిక భక్తుడు గలడు ఆ గుహరాజు" అని గుహుని సేవలను జ్ఞప్తి కెలయించి అతడు కూడ అగ్ని ప్రవేశము చేయుననియు ముందుగా తమ రాక గుహున కెరిగింప వలసిన దనియు ఆంజనేయుని హెచ్చరించెను. ఆంజనేయుడు శృంగి బేరము చేరునప్పటికే గుహుడు చితిని పేర్చించి తన పుత్రునికి నీతు లుపదేశించి అగ్ని ప్రవేశము చేయుట కాయత్తమై యుండెను. ఆంజనేయుడు ముందుగా గుహునికి సీతారాముల శుభాగమనవార్త నెరిగించెను. గుహుడు ఆనందముతో అగ్ని ప్రవేశోద్యమము విరమించుకొని "చచ్చేమి కొరగాను సకలజీవులకు-బ్రతికి నే కొరగాను బంధువులకెల్ల - పేదలకు భరతుండు రాజ్యాధిపుండు - అగ్నిలో భరతుండు పడకుండ బొమ్మి-అవధారు అవధారు అంజనీసుతుడ" అని ఆంజనేయుని త్వరపరచుట గుహుని స్వార్థరాహిత్యమునకు స్వామిభక్తికి నిదర్శనము. ఆంజనేయుడు వేగిరముగా పోవుచు రాముడు లేని అయోధ్యా ప్రాంతము లెంత దీనముగా నుండెనో చూచెను. అచ్చటి స్త్రీలందరు 'తల్లి వృద్ధని వేగ తలచి రావయ్యా - తమ్ములనైనను తలచి రావయ్యా - మమ్ము దలచవుగాని మాతలను దలచి- రాకున్న వగచేము రావయ్య వేగ-'' అని రోదించుచుండిరి. భరతుడు అగ్ని ప్రవేశము చేయనుండగా కౌసల్య వచ్చి ఆతని వారించుచు పలికిన పలుకులు రాళ్ళను కరగించజాలును. ఆమె తన సవతులతో పాటు సంతానార్థమై పడిన పాట్లు భరతునికి వినిపించును. రామునిగూర్చి ప్రస్తావించి "ఎన్నడు చూలాయె ఎన్నడు గంటి - ఎన్నడు పెంచితినో ఎరుగనే భరతా - నళినాయతాక్షుడు నాటికే రాడు - కడువేగిరము పెరిగె కౌసల్యసుతుడు - పెంచగా రాముడు పెరిగె నడవులకు - దక్కడే రాముడు పక్కె ఋషులకును - అడగడే మీ యమ్మ కలిభక్తుడాయె - పొమ్మనగ రాముడు పోయె నడవులకు'' అని దీనముగా విలపించినది. ఇంకను 'నీ వగ్ని జొస్తేను నీతల్లి నేడు బ్రతికెడి విధమేమి భరతుడ చెపుమా- నీవెట్లు బ్రతికితివని తన్నడిగితేను- తనకేమి భరతుడా నీవుండగాను' అని తన అవ్యాజ ప్రేమను ప్రకటించి, మీ యన్నను నీకు చూపింతునని భరతుని యోదార్చెను. రాముడు వచ్చునని నీవె ట్లెరుగుదు వని భరతుడు ప్రశ్నింపగా 'ఎరిగినా కార్యమ్ము చెప్పేను వినుమా- కన్నులూ అదరేను కడుపెద్ద ఘనము- పాలిండ్ల స్తన్యములు పాలు చేపేను- నేడు నీ కొడుకునూ నీవు చూతు వనుచు- తన వామనయనమ్ము తన్నూరడించు - ఈ లక్షణము లెపుడు ఊరక పోవు' అని సమాధానము చెప్పెను. ఇంతలో ఆంజనేయుడు వచ్చి శ్రీరామాగమనవార్త నెరింగించును. శ్రీరాముడు సీతాలక్ష్మణసమేతుడై

ముందుగా గుహుని జూచి, భరద్వాజాశ్రమమున అతిథ్యము గొని భరతుని జూడవచ్చెను. ఆనాటి అయోధ్య రెండు కన్నులలో ఒకదానిలో ఖేదాశ్రువులు. రెండవదానిలో మోదాశ్రువులు. పట్టపేనుగు శ్రీరాముని జూచి దశరథుల దలచికొని కన్నీరు గార్చినదట. వసిష్ఠాదులు శ్రీరాముని స్వాగతించుచు గజము నెక్కమనిరి. శ్రీరాముడు "మా తండ్రి వరములు మా తల్లి కియకా - మరిగాని యెక్కను మత్తగజ మనెను". రామాగమనవార్త విన్న కైకమ్మ సంతోషము పట్టరానిది. ఈపట్టున కైకమ్మ ఎంతో ఉదాత్తముగా చిత్రింపబడినది. ఐనను ఆంజనేయుడు కైకమ్మను జూచిన సందర్భము జానపదులకు పుట్టెడు దుఃఖములో పోకంత సంతోషముగా వెల్లివిరిసినది. 'అడవులకు బొమ్మనీ అతి భక్తితోను అంపిరమ్మా యెవరు ఇందరిలోను - నయనసంజ్ఞల జెప్పె లక్ష్మణేశ్వరులు- నాడొక్కడే రఘురాము డుండగనూ- పొమ్మని పంపగా పోయె సుమి తల్లీ - నేడిందరము గలము నెలతరో వినవే - క్రొత్తగలిగిన పనులు మరచితివేమొ - పను లానతిచ్చి మము బంపవే తల్లి - అని యిట్లు హనుమన్న పలుకగా వినుచు - లజ్జించి తలవాల్చె కైకమహాదేవి'. అప్పుడు శ్రీరాముడు కల్పించుకొన్న సందర్భము ఎంతో ఉదాత్తముగా నున్నది. 'తల వాల్చుకొని యున్న తల్లిని జూచి - బొంకిరే దేవతలు బొంకిరే ఋషులు - బొంకి నీమీదనే పొర్లించిరమ్మ - నీవు చెప్పినయట్లు నే చేయగలను - అని యూరడించెనే ఆ రాఘవూలు".

'శ్రీరామ పట్టాభిషేకము' పాట ఆచారవ్యవహారములకు చుట్టపు మర్యాదలకు, వేడుకలకు, వినోదములకు, విందులకు, పరిహాసపు చమత్కారములకు పెన్నిధి. పట్టాభిషేకసందర్భమున సీతమ్మకు చదివించిన కట్నములు ఋశ్యశృంగుడును శ్రీరామునికి చదివించిన కట్నములు లక్ష్మణస్వామియు కుప్పలు గూర్చుకొందురు. నడుమ మాణిక్యము నమరించిన సరమొకటి సుగ్రీవుడు సీతమ్మకు కట్నము చదివించగా అది పుచ్చుకొని సీతమ్మ శ్రీరామునివైపు చూచును. "ఎవ్వరీ మూలాన వృద్ధి బొందితివో-వారికిమ్మని పలికె వనజనాభూలు'' సీతమ్మ ''నా యాత్మబంధుండ జీవరక్షకుడా-మాయన్న హనుమంత రమ్మనుచు పిలిచీ- తనచేత కంఠమాల హనుమంతు కేసె" నట. సంతోషముతో నుప్పొంగి పోవుచు ఆంజనేయుడు. "వనచరులు జాంబవులు వనరాక్షసూలు-కలలోను రఘుపతిని చూచి యెరుగుదుమా-మన భాగ్యమున కైక వరమడిగె గాన-అడవి మృగముల నెల అవనిపతి కలిగె-కోతులు కడుపెద్ద కొనియాడినట్టి - భ్రాంతి పడగల యట్టి

ప్రభువులు గలరా'' యనెను. అప్పుడు "సంజీవిపర్వతం బెత్తిన హస్తములా- సుమిత్ర పచ్చలా కడియాలు బెట్టె' నట. కౌసల్య బంగారు అందెలు బెట్టినదట. సుమిత్రా కౌసల్యలు ఆంజనేయస్వామికి తొడిగిన భూషలు ఎంత సాభిప్రాయములో కదా!

ఊర్మిళాలక్ష్మణుల త్యాగసేవాభావములకు ఆంధ్రీపురంధ్రు లెత్తిన రామాయణాకాశపతాకములు ఊర్మిళాదేవి నిద్ర, లక్ష్మణదేవరనవ్వు అను రెండు పాటలు. ఇందులో ఊర్మిళాదేవినిద్ర పాట-

"శ్రీరామభూపాలుడూ పట్టాభిషేకుడై కొలువుండగా
భరతశత్రుఘ్ను లపుడూ సౌమిత్రి వరుస సేవలు సేయగా
మారుతాత్మజు డప్పుడూ రాఘవుల జేరి పాదము లొత్తగా'

అని ఆరంభమగును. కట్టుకొన్న భర్తయైన లక్ష్మణుడు అన్నగారి సేవలో నిమగ్నుడై ఊర్మిళను మరచినట్లున్నాడు. కాని ఆ త్యాగమయిని సమయమున కాదుకొన్నది సీతమ్మతల్లి. ఆమె వచ్చి శ్రీరామచంద్రునితో-

"దేవదేవేంద్ర వినుమా విన్నపము తెలిపేను చిత్తగింపూ
ముందు మన మడవులకును పోగాను ముద్దుమరదీ వెంటనూ
పయనమై రాగ జూచి తన చెలియ పయనమాయెను ఊర్మిళా
వద్దు నీవుండు మనుచు సౌమిత్రి మనల సేవింప వచ్చె
నాడు మొదలుగ శయ్యపై కనుమూసి నాతి పవళించున్నదీ
ఇకనైన ఆనతిచ్చి తమ్ముణ్ణి ఇందుముఖికడ కంపుడీ" అని సిఫారసు

చేసినది. అన్నగారి ఆజ్ఞపై లక్ష్మణుడు ఊర్మిళను చూడబోయెను. పోయినవాడిన్నాళ్ళ తరువాత వచ్చినందుకు క్షమాపణము చెప్పుకొనక ఆమె పాన్పుపైగూర్చుండి 'కొమ్మ నీ ముద్దుమొగమూ సేవించగోరినాడే చంద్రుడూ' అని తన విరహమును వెడలబోసికొనెను. యోగనిద్రాముద్రితయైన యూర్మిళ కెవ్వరో పరపురుషుడు అంతఃపురము ప్రవేశము చేసినట్లు తోచగా నామె-

"అయ్య మీ రెవ్వరయ్యా మీరింత యాగడమ్మున కొస్తిరీ
సందుగొందులు వెదకుచూ మీ రింత తప్పు శాయగ వస్తిరీ
యెవ్వరూ లేని వేళా మీ రిపుడు ఏకాంతమున కొస్తిరీ
మా తండ్రి జనకరాజూ వింటె మిము ఆజ్ఞసేయక మానరూ
మాయక్క బావ విన్నా మీ కిపుడు ప్రాణముకు హాని వచ్చూ
మా యక్క మరది విన్నా మి మ్మిపుడు బ్రతుకనివ్వరు జగతిలో'

-యని మందలించినది. ఈ మందలింపులో ఆమె సిగ్గు సౌశీల్యములు అభి వ్యక్తములు. ఇంతటి దుర్గతి తనకు పట్టినందుకు-

'పెద్దైన వంశానికీ అపకీర్తి వచ్చె నే నేమి సేతూ
కీర్తిగల యింట బుట్టీ యపకీర్తి వచ్చె నే నేమి సేతూ' అని తన ఆభిజాత్యమును దలచికొని తహతహ పడినది. హితవు గరపిన మంచి దనుకొని-

"ఒకడాలి కోరిగాదా ఇంద్రునికి ఒడలెల్ల హీనమాయే
పరసతిని గోరి కాదా రావణుడు మూలముతొ హతమాయెనూ
ఒకడాలి కోరిగాదా కీచకుడు ప్రాణములు గోలుపోయే
ఇట్టి ద్రోహములు మీరు యెరిగుండి ఇంత ద్రోహము కొస్తిరా
ఆడతోడున బుట్టరా మావంటి తల్లి లేదా మీకునూ'

అని పరకాంతాగమనేచ్ఛను గర్హించినది. లక్ష్మణుడు తన్నుతా నెరుక పరచుకొన్నప్పుడు ఆ దంపతులకు జరిగిన సంభాషణము మధురాతి మధురము. ఇన్నాళ్ళు తన్నొంటిగా విడిచినందుకు-

"మా తండ్రి జనకరాజు మిము నమ్మి మరచి పెండ్లీ జేసెనూ
చిత్త మొకదిక్కు నుంచి సమయమున చిన్నబుత్తురు పురుషులూ'

అని పురుషజాతి బలహీనతలను దెప్పిపొడినది. ఆనాటి యూర్మిళా ముఖమున గనుపించిన ఆనందము వర్ణనాతీతము. అందుకే వదిన శాంతమ్మ-

"కుందనపు ప్రతిమ కళలూ యీ కళలు యెందుండి దాగున్నవో
దృష్టి తగులాకుండనూ నీలాల నివ్వాళు లివ్వరమ్మా'

యని పరిహాస మాడినది. అమాయకురాలైన ఊర్మిళ మారుపలుకలేదు. గాని, యామె పక్షమున సీతమ్మ-

"ఇంద్రాది చంద్రులాను మరపించు చంద్రులూ మీతమ్ములూ
దృష్టి తగులాకుండనూ నీలాల నివ్వాళు లివ్వరమ్మా"

యని సమాధానము చెప్పినది. ఇంటి పెద్దయాడుబిడ్డ శాంతమ్మ కీ సమాధానము చురుక్కు మనిపించినది. ఆమె వెంటనే-

"అక్కచెల్లెండ్రు మీరూ మిక్కిలీ సౌందర్యశాలులమ్మా
మాతమ్ములూ నలుగురినీ వలపించు జాణలకు దృష్టి తగులూ
దృష్టి తగులాకుండనూ నీలాల నివ్వాళు లివ్వరమ్మా"

అని సీతమ్మకే మారు వడ్డించినది. గడుసరి సీతమ్మ ఊరకుండునా ?

"మా యన్న ఋశ్యశృంగూ వనములో కూడి యెడబాయకున్నా
ఏమి యెరుగని తపసినీ వో వదినె! కేళించి విడిచినావూ
దృష్టి తగులాకుండనూ నీలాల నివ్వాళు లివ్వరమ్మా"

అని నోరెత్తకుండ జేసినది. ఆనాడు ఊర్మిళా శయ్యాగృహము సుసజ్జితమైనది. లక్ష్మణు డామె పక్క గూర్చుండి-

"కీలుకొ ప్పమర విడిచీ లక్ష్మణుడు నేర్పుతో జడ లల్లెనూ
బొండుమల్లెలు జాజులూ జడపయిని శృంగారముగ జుట్టెనూ"

లక్ష్మణుడు ఊర్మిళకు జడ లల్లినాడట. ఆ విద్య ఈనాటి పురుషులకు వచ్చినచో కొంతవరకైన గృహిణుల కార్యభారమును పంచికొనియుందురు కదా! మన భాగ్యము లేదాయెను. ఊర్మిళాలక్ష్మణులు పదునాల్గేండ్లు తరువాత కలిసికొన్న రాత్రి ఎంత శృంగారముగా నుండవలయును ? కాని "తాంబూలములు వేయుచూ దంపతులు కలిసి ముచ్చట లాడిరీ.'' ఆ ముచ్చటలేమో యెరుగుదురా? శృంగార ప్రసంగము తలపెట్టుకొన్నారా ? కాదు. ఊర్మిళమ్మ లక్ష్మణస్వామిని-

"సింహవిక్రములు మీరూ ఉండగా సీ తెట్లు చెరబోయెనూ
రాజ్యాధిపతులు మీరూ ఉండగా రమణెట్లు చెరబోయెనూ''

అని ప్రశ్నించినది. లక్ష్మణుడు సీతమ్మ చెరబోయిన విషాదగాథను వినిపించినాడు. ఊర్మిళమ్మ తన అక్కగారి కష్టగాథను వినుచు వలవల యేడ్చినది. ఒక ఊర్మిళయే కాదు-

"కౌసల్య మొదలుగానూ సూమిత్ర కైక శాంతాదేవులూ
గద్దెపీటలు వేసుకా మదుగునా సద్దుచేయక యుండిరీ'"

అంతఃపురమువారందరు విని దుఃఖించిరి. ఈ తెలుగుపాట పాడుకొను స్త్రీలందరును ఈ నాటికిని ఊర్మిళా దుఃఖమున పాలుపంచుకొందురు.

అందుకే-

ఊర్మిళా విరహమ్ములూ ఇవి యెవరు పాడినా విన్నగానీ
శ్రీవిష్ణు కైవల్యమూ సౌమిత్రి విష్ణులోకము నిచ్చునూ."

ఊర్మిళాదేవి నిద్రపాట ఊర్మిళమ్మ త్యాగమునకు తెలుగువా రెత్తిన పతాకమైనచో లక్ష్మణదేవర 'నవ్వు'పాట అతని సేవాభావమున కెత్తిన ధ్వజము. రావణవధానంతరము అయోధ్యలో శ్రీరామపట్టాభిషేకము సకలదేవతాసమక్షమున జరుగుచుండెను. ఆనిండుకొలువులో ప్రశాంతగంభీరవాతావరణములో ఒక్కసారి,

"కలకల నవ్వే లక్ష్మణదేవ రపుడూ- కలతలు పుట్టెనూ కపులందరికినీ
కిలకిల నవ్వే లక్ష్మణదేవ రపుడూ- కిలకిల నవ్వగా ఖిన్నుడయె రాజూ

ఇందరి చిత్తమ్ము లీవిధమ్మునమా- నిండిన కొలువెల్ల కడుచిన్న బోయే" లక్ష్మణు డకారణముగా నవ్వినందులకు సభాసదులందరును గుమ్మడికాయలు మోసినట్లు తమతమ భుజములు తడుముకొనిరి. జాలారి పడుచును నెత్తి కెక్కించుకొన్నందుకు నవ్వెనని శంకరు డనుకొనెను. అన్నగారి అయువు పట్టెరిగించి చంపించి తాను రాజైనందుకు నవ్వెనని విభీషణు డనుకొనెను. ఆడరాని మాటలాడిన ఆడువారిని నమ్మరాదని నవ్వెనని సీతమ్మ యనుకొనెను. ఇటులే సుగ్రీవుడు, జాంబవంతుడు, నలుడు, అంజనేయుడు, శ్రీరాముడు, భరతశత్రుఘ్నులు, అంగదుడు, ఆదిశేషుడు మొదలుగాగల వారందరును తమ్ము జూచియే లక్ష్మణుడు నవ్వె ననుకొనిరి. సభామర్యాద నుల్లంఘించి అందరి నీవిధముగా నవమానపరచినందులకు లక్ష్మణునిపై శ్రీరామునికి పట్టరాని కోపము వచ్చెను. లక్ష్మణుని శిర ముత్తరించుటకై శ్రీరాముడు ఖడ్గమెత్తెను. శంకరాదు లడ్డుపడి రాముని వారించిరి. నవ్వుటకు కారణ మేమో తెలుపుమని శ్రీరాముడు లక్ష్మణు నడిగెను. న్యాయాన్యాయములు విచారించి శిక్షలు విధించు కాల మది. లక్ష్మణుడు తాను నవ్విన కారణ మీవిధముగా తెలిపెను-

"నాదొక విన్నపము నరనాథ వినుమీ -
ముందు మన మడవులకు పోయున్ననాడూ -
ఆ పర్ణశాలలో మన ముండగానూ
పరమాత్మ మీ సేవ చేయగా జూచీ
ఉండగానే వచ్చె ఉత్తమ్మ నిద్రా
రెండు జాములవేళ నిద్ర యేతెంచే
సతిరూపు చేకొనీ దిగబడియె నిద్రా
అతివ నీ వెవ్వరే అంగలార్చేవూ
భూమిళ పుట్టు నిద్రాదేవి తానూ
అష్టదిగ్గజములు ఆదిమహాఋషులూ
సప్తసాగరములు సుషుప్తి మున్గినవీ
వైకుంఠనాథులను వసియింతు నేనూ
పక్షిజాతులలోను పర్వతంబులనూ
వృక్షాలపైనుండి విహరింతు నేనూ
నరులు యెవ్వారును నను గెల్వలేరూ
దీనత పడి యుందు నీ యాజ్ఞ లేదూ

వలగొని ముమ్మారు ప్రదక్షిణము చేసీ
సాష్టాంగదండ నమస్కారములు చేసీ
మాయన్న రఘుపతికి మా వదినకూనూ
ఈ పర్ణశాలకూ తాను కాపనెనూ
పోపొ మ్మయోధ్యాపురీ నగరునకు వేగా
ధవునిబాసినట్టి సతి యుండదగదూ
రాత్రియును పవలునూ లేవకుండగనూ
తను విడిచి పొందుమీ ధవళాక్షి నిద్రా
కడువేడ్క అయోధ్య కనకపట్నానా
కాకుత్థ్సతిలకుడూ గట్టిననాడూ
సేనలు మంత్రులూ కొలువై యుండగనూ
అపుడు తను పొందుమని పలికితీ ననెనూ
తప్పక ఒక గడియ తడబడకుండా
తను నిద్ర పొందితే నవ్వితీ ననెనూ''

లక్ష్మణుని సమాధానము వినుటతో శ్రీరాముని గుండె జారిపోయినది. తమ్ము డొనర్చిన త్యాగము సేవలకు ప్రతిఫలముగా తాను పడిన తొందర పాటును దలచికొని రాముడు తన కంఠమే యుత్తరించుకొన జూచెను కాని, వసిష్ఠవామదేవాదు లడ్డుపడి ప్రాయశ్చిత్తము నీవిధముగా సూచించిరి. "భూమీశ మీకిట్లు బుద్ధి గాదయ్యా - మీరు లక్ష్మన్నకే నిద్రపట మమర్చి - పాదాలు వత్తుమని పలికె రామూని." రాము డా ప్రాయశ్చిత్తమునకు వల్లె యనెను. లక్ష్మణ స్వామి కానాడు పదునాలుగేండ్ల నిద్ర. రాము డాతని సమీపించి నిద్రాభంగము కలుగకుండ "ఒయ్యన పాదమ్ము లొత్తుచున్నారు". లక్ష్మణు డెంత నిద్దురలో నున్న నేమి? "ఒకమారు ఒత్తితే ఊరుకొని యుండే-రెండవ మాటికీ కలగంటి ననెను - మూడవ మాటికీ కను విప్పి చూచి - కలగాదు నిజమని కడు భీతి నొంది - ధరణీశు తా జూచి ధరణిపై వాలె- మీ యడుగు లొత్తేటి ప్రాయమ్ము వాణ్ణి - అహల్య పావనమైన అడుగు మీ యడుగు - బలి శిరస్సున నున్న అడుగు మీయడుగు - మీయడుగు లొత్తుదురు సకల దేవతలు - నా యడుగు లొత్త శ్రీమన్నాథ తగదు" - అనుచు అన్నగారి పాదములపై వ్రాలెను. శ్రీరాముడు లక్ష్మణస్వామి ననుగ్రహించెను. ఈ పాటలో జానపదు నెన్నియో మధుర సన్నివేశములను కూర్చినారు. శ్రీరాముడు క్రొత్త పెండ్లి కొడుకులకువలె

తమ్ములందరికి శోభన ముహూర్తములు నిర్ణయింపజేసెను. సమస్తకార్యములందు శాంతమ్మ చూపెడు పెద్దరికము ఆంధ్రు లిండ్లలో పెద్ద ఆడుబిడ్డల పెద్దరికమును పోలును. శ్రీరాము డానాడు సీతాశాంతల యనుజ్ఞ బడసి లక్ష్మణుని చాటుచేసి కొని తన మరదంద్రను చూచెను. అంతఃపురమున ఆ నాటి రాత్రి యంతయు శోభనమే. 'పాలూను పంచదార కలిసియున్నట్లు - శ్రీరాములూ సీత కలిసి రప్పుడు - జీలకఱ్ఱ బెల్లమ్ము కలిసియున్నట్లు - సౌమిత్రి యూర్మిళా కలిసి రప్పుడు-పాలూను బెల్లము కలిసియున్నట్లు భరతుడూ మాండవీ కలిసిర్పుడు' శ్రుతకీర్తి యింకను పడకగది చేరుకొనలేదు. ఆమె ఆటపాటలతో సఖులచెంత కాలక్షేపము చేయుచుండెను. శత్రుఘ్నుడు కౌసల్య కడ కేగి తన సతి నంపుమని కోరెను. కౌసల్య వచ్చి తన చిన్నారికోడలిని 'శత్రుఘ్నుని పానుపున ఆడుదువు రమ్మీ' యని శయ్యాగృహమునకు తోడుకొనిపోయెను. 'శ్రుతకీర్తి వచ్చేటి తేజమ్ము చూచి-కంచు శ్రీస్తంభాలు కాంతులు మణగె - మాణిక్యదీపాలు మరి వెలుగవాయె'నట. వారును పాలు పంచదారలట్లు కలిసి పోయిరట. ఇట్టి పవిత్రమైన సహజమైన ఉపమానములతో ఆ దంపతుల శృంగారమును సూచించుట తెలుగు స్త్రీలకే చెల్లినది. తెల్లవారి జాము ప్రొద్దెక్కినను అ దంపతుల జంటలు లేవలేదు. అప్పుడు ఆంజనేయునితో భేరి వేయించిరి. అన్నదమ్ములు అదరిపడి లేచిరి. కాని 'భరతునిపై రెండు పసుపు దాగూలు, సౌమిత్రి లలాటమున కుంకుమా బొట్టూ - శత్రుఘ్నుని చెక్కిటా కాటుకా రేఖా - ఆ కుంకుమా బొట్టు అమరి యున్నాపీ' ఋశ్యశృంగుడు చూచి వెక్కిరించేనేమోయని వారు సిగ్గుపడి తుడుచుకొనిరట. సంభోగ శృంగారమును సుస్నితముగా సూచించిన ఘట్టమిది. ఆనాడు శ్రీరాముడు తమ్ములకు మరదంద్రకు కావలసిన పదార్థము లన్నియు వంట చేయించి తమ్ములతో మిత్రులతో కలిసి భోజన మారగించుచుండెను. భోజన కాలమున లంకావిశేషములు ముచ్చటించుకొనుచుండిరి. అన్నియు బాగుగానే యున్నవి. కాని, వారు హనుమన్నను మరచియుండిరి. ఇంతలో "పులుతు పులుతుమనీ వచ్చె హనుమాన్లు" రామునికి తన పొరపాటు తెలిసినది. ''ఇంటివాడవు గనుక ఊరకుంటీమీ-పొత్తునా గూర్చొమ్మి ఉత్తమా పురుషా-నీవుండగా గదా సీత దెచ్చుకొనీ-అయోధ్య పట్నమ్ము ఏల గలిగితినీ-నీ వుండగా గదా తమ్ములపంక్తి - భుజియింప గలిగితిని హనుమన్న వినుమా-పొత్తునా గూర్చొమ్మి ఉత్తమా పురుషా' యని ఆంజనేయుని బతిమాలెను. కాని ఆంజనేయుడు ''పొత్తునా గూర్చుండ ఉత్తముడగాను'' అని నిష్ఠురము లాడి

''సర్వేశు భోజనం తా గాగ జూచి - ముందరా పళ్ళెమ్ము ఎత్తుకొనిపోయె - తా బోయి హనుమన్న అవిసిచెట్టెక్కె-ద్వాదశి ఒక ముద్ద కొమ్మపైనుంచె - అందు మీద పళ్ళెమ్ము అంది పడవేసె"నట. ఎత్తినది కోతిజన్మ కనుక రామభక్తికి రామ ప్రసాదానుభవమునకు లోపము కలుగకుండ తన కోపమును గూడ ప్రదర్శించినా డీ ఆంజనేయుడు. జానపదుల కిట్టి ఆంజనేయుడే ప్రియుడు. శ్రీరాముడవిసిచెట్టు క్రిందికి పోయి చేయి చాచి ఆంజనేయుని పిలిచెను. రామభక్తునికి కోపము తగ్గినది. అప్పు డాతడు 'రామచిలుకా వలెను చేతిపై వ్రాలె'ను. రామచంద్రుడు 'చేతిపై హనమన్న ధరణిపై దింపి ముత్యాలహారమ్ము మెచ్చి మెడవేసె'నట. దీనికి ఫలశ్రుతి "ఈ పాట యెవరైన పాడినా విన్నా - పరబ్రహ్మ లోకంబు పరమాత్మ డిచ్చు."

—o—

# తెలుగు రామాయణాలు

## —'కరుణశ్రీ' శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి

పరిషత్పరమేశ్వరులకు ప్రణామాలు. "రామాయణ సుధాలహరి." ఎంత చక్కని పేరు. సరససారస్వత సంవిధాతలైన "యువభారతి" అధినేతలు సర్వాంగసుందరంగా జరిపించుతూ ఉన్న ఈ సాహిత్యోపన్యాస సముచ్చయానికి "రామాయణ సుధాలహరి" అని నామకరణం చేయటం చాలా సముచితంగా ఉంది. ఏమంటే-రామకథ సుధామధురమైనదిగదా మరి!

మధురము రామాయణ కథ
మధురము వాల్మీకి వాక్కు; మఱి అందులకే
బుధు లిందరు "రామాయణ
సుధాలహరి" యనిరి దీని శ్రుతిసుభగముగాన్.

వాస్తవానికి వాల్మీకిమహర్షియే తన రామాయణాన్ని "పాఠ్యే గేయే చ మధురమ్" అని ఉగ్గడించాడు. ఈ పరమార్థాన్ని బాగా తెలిసినవాడు కనుకనే భోజదేవుడు తన "చంపూరామాయణం"లో

"శుభమతనుతకావ్యం స్వాదు రామాయణాఖ్యం
మధుమయ ఫణితీనాం మార్గదర్శీ మహర్షిః".

అని రామకథా స్వాదుత్వాన్నీ "మధుమయ పదవిన్యాసాలకు మార్గదర్శకు"డైన వాల్మీకి మహర్షి కవితామాధుర్యాన్నీ చక్కగా నొక్కి వక్కాణించాడు. అటువంటి రాముని చరిత్రమూ వాల్మీకి కవిత్వమూ రెండూ సమైక్యం కావటంతో మధురాతిమధుర మైన శ్రీమద్రామాయణ మహాకావ్యం ఆవిర్భవించింది. అందుకనే ఆదికవికి హస్తాలు మోడ్చి నమస్కరిస్తూ ఒక మహాకవి ఇలా అన్నాడు.

కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకి కోకిలమ్ ‖

వాల్మీకి అనే కోకిల కవిత్వమనే కొమ్మమీద కూర్చుండి "రామా రామా" అనే మధురాక్షరాలను మధురాతి మధురమైన కంఠస్వరంతో గానం చేస్తున్న దట! కోయిల కూర్చున్నదంటే ఆ కొమ్మ మామిడికొమ్మే అయివుంటుంది. మామిడికొమ్మా కోకిలగానమూ అనేసరికి 'వసంతం' కనులయెదుట సాక్షాత్కరిస్తుంది. అంటే- ఈ కవికోకిలకాకలీధ్వనితో వైదికవాఙ్మయోద్యానానికి వసంతోదయ మైన దన్నమాట. వేదవేద్యుడైన ఆ పరంధాముడు శ్రీరాముడుగా అవతరించాడు. పురుషోత్తముడు ఉత్తమపురుషుడుగా ఉర్విపై ఉద్భవించాడు. నాదాత్మకమైన వేదం రసాత్మకమైన రామాయణ మహాకావ్యంగా ఆవిర్భవించింది. ఆధ్యాత్మికమైన పరతత్వం ఆదర్శమానవత్వాన్ని అంగీకరించి దివినుండి భువికి దిగివచ్చింది.

వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా ॥

అన్నారు పెద్దలు. బ్రహ్మపదవిహారిణి యైన వైదికవాణి లౌకిక కవితా కల్యాణియై అవతరించింది. అందుకనే శ్రీనాథమహాకవి వాల్మీకి మహర్షిని "బ్రహ్మపదావతీర్ణకవితాలీలావతీ వల్లభు"నిగా సందర్శించి సంస్తుతించాడు.

శ్లోకంబుల్ శతకోటికాండములుగా జోడించి రామాయణం
బేకైకాక్షర మెల్లపాపముల మాయింపంగ నిర్మించి సు
శ్లోకుండైన పురాణసంయమివరున్ జూతున్ మనోవీథి వా
ల్మీకిన్ బ్రహ్మపదావతీర్ణకవితాలీలావతీ వల్లభున్.

కరుణార్ద్రమైన క్రౌంచవధూ విలాపానికి కరగి నీరైన వాల్మీకి హృదయంలో పెల్లుబికిన శోకమే శ్లోకమై ఆయన కంఠంలో నుండి ధ్వనించింది. ఆది కవి అంతరంగంలో పొంగిన ఆ కరుణతరంగమే ఆదికావ్యమై-రసవత్తర రామాయణ మహాకావ్యమై ప్రవహించింది.

క్రౌంచవధూవ్యథా విధుర కంఠవిముక్త విషాదగీతికా
సంచలితాత్ముడౌ ప్రథమసత్కవిభావము పొంగి వెల్లువై
ముంచుకొనెన్ రసజ్ఞజగమున్; రఘురామకథాసుధారసా
భ్యంచితమై ప్రపంచ "మహహా" యని మెచ్చిన ఆదికావ్యమై.

సంస్కృతంలో ఎన్ని రామాయణాలు ఆవిర్భవించినా అన్నిటికీ మూలమైనది "పరం కవీనాం ఆధార"మైనది వాల్మీకి రామాయణమే. అందుకనే అది "ఆదికావ్య"మనీ వాల్మీకి "ఆదికవి" అనీ ప్రసిద్ధి వచ్చింది.

వాల్మీకి రామాయణానికి ఇంతటి ప్రసిద్ధి రావటానికి ప్రధానకారణం సకల గుణసంపన్నుడూ, ఆదర్శమానవుడూ, ఉత్తమనాయకుడూ అయిన శ్రీరామచంద్రుడు నాయకుడు కావటమే. "ఉపశ్లోక్యస్య మహాత్మ్యే దుజ్జ్వలాః కావ్యసంపదః" అన్నట్లు ఉత్తమ నాయకమైన కావ్యం దేదీప్యమానంగా ప్రకాశిస్తుంది.

శ్రీరాముని చరిత్రమే ఎందుకు మరల మరల వ్రాయాలి? అనే సందేహానికి సమాధానంగా మురారి మహాకవి తన "అనర్ఘరాఘవం"లో ఈవిధంగా వక్కాణించాడు.

యదిక్షుణ్ణం పూర్వై రితి జహతి రామస్య చరితం
గుణై రేతావద్భిః, జగతి పునరన్యో జయతి కః?

"ప్రాచీనకవు లెందరో శ్రీరాముని చరిత్ర క్షుణ్ణంగా వర్ణించారు. మళ్ళీ మళ్ళీ మనం వర్ణించటం దేని"కని వైముఖ్యం వహించినట్లైతే ఏతాదృశలోకోత్తర గుణోత్తరోదాత్తుడైన కథానాయకుడు మరొక్కడు మన కెక్కడ లభిస్తాడు?

ప్రసన్న రాఘవకర్త యైన జయదేవుడు పై భావాన్నే భంగ్యంతరంలో మరింత చమత్కారంగా చెప్పాడు.

స్వసూక్తీనాం పాత్రం రఘుతిలక మేకం కలయతాం
కవీనాం కో దోషః స తు గుణగణానా మవగుణః!

కవులు తమ కావ్యాలకు అధినాయకుణ్ణిగా ఆ రఘుకుల తిలకమైన రామచంద్రుణ్ణే ఎన్నుకుంటున్నారంటే అది ఆ శ్రీరామునియందున్న గుణగణముల దోషమేకాని కవులదోషం ఏమాత్రం కాదు. లోకంలోని సమస్త సద్గుణాలూ రాశీభూతమై మరెక్కడా చోటులేనట్లు ఆ రాముణ్ణే ఎందుకు ఆశ్రయించాలి? తిక్కన తన ఉత్తర రామాయణంలో—

ఎత్తఱి నైనను ధీరో
దాత్తనృపోత్తముడు రామధరణీపతి స
ద్వృత్తము సంభావ్య మగుట
నుత్తర రామాయణోక్తి యుక్తుడ నైతిన్.

అని ధీరోదాత్తనృపోత్తముడైన రామచంద్రుని చరిత్రం సర్వదా సర్వథా సత్కవులకు సంభావ్యమని నిర్వచించినాడు. ఇక కంకంటి పాపరాజు గారు తన ఉత్తర రామాయణంలో - "రామువేశ్వరు చారిత్రము లెంద ఱెన్ని గతులన్ వర్ణించినం గ్రాలదే" అని ఆత్మవిశ్వాసమును ప్రకటించి-

"...చారు కవిత్వము నేర్చి జానకీ
జానికథల్ వచింపక యసత్కథ లెన్ని రచించె నేనియున్
వాని వివేక మేమిటికి? వాని కవిత్వమహత్త్వ మేటికిన్?"

అని తన రామాయణ రచనా ప్రవృత్తికి హేతువును ఎలుగెత్తి చాటినాడు.

రామాయణం ఆబాలగోపాలానికీ ఆదరపాత్రమైన మహాకావ్యం. అందులో తెలుగువారికి సీతారాములు ఆరాధ్యదైవాలు. తెలుగుదేశంలో రాముని గుడి లేని గ్రామం లేదు. తెలుగువాడు "శ్రీరామ" చుట్టకుండా ఏ వ్రాతా ప్రారంభించడు. తెలుగు దేశంలోని గోదావరీ తీరం సీతారాముల పవిత్రపాద పరాగములచే పులకించిపోయింది. అందువల్లనే రామకథ అంటే ఆంధ్రులకు అంతులేని అభిమానం. తెలుగు భాషలో ఉన్నన్ని రామాయణాలు మరే భాషలోనూ లేవంటే అతిశయోక్తి అణుమాత్రమూ కాదు.

## <u>రంగనాథ రామాయణం</u> (1240)

తెలుగు రామాయణాలను గురించి ముచ్చటించుకుందాం. ఉపలభ్యములైన తెలుగు రామాయణాలన్నింటిలో మొట్టమొదటిది రంగనాథ రామాయణం. గోన బుద్ధారెడ్డి మార్గ - దేశి సంప్రదాయాలను జోడించి ఈ ద్విపద రామాయణాన్ని రచించాడు. కనుకనే ఇది తెలుగుదేశంలో పండితపామరులకు పారాయణ గ్రంథమైంది. దేశికవితారీతిలో రంగనాథ రామాయణమూ, మార్గకవితా పద్ధతిలో భాస్కర రామాయణమూ అగ్రశ్రేణికి చెందిన ఆంధ్రరామాయణాలు.

రంగనాథ రామాయణం రచించినది గోన బుద్ధారెడ్డి కాదనీ, "రంగనాథు"డనే ఎవరో ఒక కవి రచించి తన ప్రభువైన బుద్ధారెడ్డి పేరుతో వెలయింప జేసి ఉంటాడని కొందరు విమర్శకులు అభిప్రాయ పడ్డారు.

"అతత కృతిపేర అతిపుణ్యుపేర
మా తండ్రి విట్టలక్ష్మానాథు పేర"

దీనిని రచిస్తున్నానని అవతారికలో స్పష్టంగా బుద్ధారెడ్డి పేర్కొన్నాడు. అయితే "బుద్ధారెడ్డి రామాయణం" కావాలి కాని రంగనాథరామాయణ మేమిటని ఆక్షేపం. బుద్ధారెడ్డి తండ్రిగారైన విటలక్ష్మానాథుని పూర్తి పేరు పాండురంగ విట్ఠలనాథుడై ఉంటుందనీ "నామైకదేశే నామగ్రహణం" న్యాయాన్ని అనుసరించి అందులోని రంగనాథ పదాలు కలిపి తండ్రిపేరు కలిసి వచ్చేటట్లు "రంగనాథ రామాయణం" అన్నాడనీ సమాధానం. అటువంటప్పుడు "పాండురంగ రామా

యణ''మనో లేదా ''విట్ఠలనాథ రామాయణ"మనో అనటం సమంజసం కాని అక్కడొక పదం ఇక్కడొక పదం తీసి అతుకుల బొంత చేసి ''రంగనాథ రామాయణ" మనటం అసహజంగా ఉందని మళ్ళీ ఆక్షేపం.

ఈ వాదోపవాదాలకు డాక్టర్ జి. నాగయ్య. ఎం.ఏ., పిహెచ్. డి. గారు చక్కని పరిష్కారం సూచించారు. పట్టాభిషేకసమయంలో ప్రభువుల పేరు మార్చుకొనే సంప్రదాయం ఉంటుందట. ''బుద్ధారెడ్డి యువరాజుగా ఉన్నప్పుడే రామాయణం రచించి ఉంటాడు. ఆయన పట్టాభిషేకంలో ''రంగనాథు''డనే పేరు బుద్ధారెడ్డికి ఏర్పడి ఉంటుంది. ఆ పేరుతోనే బుద్ధారెడ్డి రచించిన రామాయణానికి "రంగనాథరామాయణ"మనే ప్రసిద్ధి వచ్చిఉంటుంది. బుద్ధారెడ్డి రంగనాథులు భిన్నులు కారు. గోన బుద్ధారెడ్డియే రంగనాథుడు. రంగనాథుడే గోన బుద్ధారెడ్డి."[1]

ఇక రంగనాథరామాయణంలోని రచనారామణీయకం చిత్తగించండి. మాయలేడి వర్ణన మిది.

అంతంతఁ బొదసూపు నటఁ జేరవచ్చు
నంతలో బెదరి బిట్టదరి కుప్పించు
తరులనీడల కేగు తగఁ బర్ణశాలఁ
జొరబారు నంతంత స్రుక్కి క్రేళ్లురుకు
వసుధ మూర్కొని చూచు వాల మల్లార్చు
దెసలకు చెవి చేర్చి తెలియ నాలించు
గంచు మింజై పారుఁ గ్రమ్మర చేరు
కుంచితాకృతి చెవికొన గదలించు
పచ్చికపట్లపైఁ బవళించు లేచు - మచ్చిక నచ్చోటి మౌనుల జేరు
ఖురములఁ జెవి గోకు కొమ్ములతుదల
విరులతీగ కదల్చి విరులెల్ల రాల్చు.

తన్ను కొనిపోవచ్చిన వేశ్యలతో ప్రపంచ మెరుగని ఋష్యశృంగుడు-

''మాకు కొమ్మొక్కటి మస్తకమ్మునను - మీకు కొమ్ములు రెండు మెరసె రొమ్మునను" అని తన అమాయకత్వాన్ని ప్రకటించుకొంటూ అంటాడు.

శూర్పణఖ ప్రణయఘట్టం హాస్యస్ఫోరకంగా చిత్రింపబడింది -

"తన మొద్దుమొగము నాతని ముద్దుమొగము
తన మహోదరము నాతని తనూదరము

---

1. ద్విపద వాఙ్మయము - పుట 142, 143.

తన కష్టకన్ను లాతని గొప్పకన్ను
లెనయంచు తన కితడే తగునంచు
మొగము చేటంతగ ముసిముసి నగవు -
లిగురింప రఘురాము నీక్షించి పలికె."

బుద్ధారెడ్డి వర్ణనలు తీర్థానికి తీర్థం ప్రసాదానికి ప్రసాదం కాకుండా కథతో పెనవేసికొని నడుస్తాయి. వర్షాకాలవర్ణనం చేస్తున్నాడు కవి -

కైకొని యింక నిక్ష్వాకువల్లభుడు - నాకారిపై దండు నడచుచున్నాడు
అని సురలకుఁ జెప్ప నరిగె నో ధాత్రి
యన వాయువులతోడ నట ధూళి యెగసె
ఆలంబులో దైత్యు నడగింపు మనుచు
కాలుండు తనచేతి కాలపాశంబు
పౌనర రామునికయి పుత్తెంచె ననగ
తనరార దివి నింద్రధను వొప్పెఁజూడ
రాక్షసాంగములపై రాము బాణములు
లక్షింపబడు నిట్టిలాగ యన్నటు
పర్వతాగ్రములపై భయదఘోషములు
పర్వ నిర్ఘాతముల్ పడియె నందంద
రావణుజంపుచో రఘురాముమీద - దేవతల్ దీపించి దివ్యపుష్పమ్ము
లెడనెడ వర్షింతు రిక్రియ ననిన - వడువున మహి రాలె వర్షోపలములు.

సుమనోమనోజ్ఞమైన ఈ ఉత్ప్రేక్ష చిత్తగించండి-

కుదియని కడకతో గోరి యాకాశ - నదినాడబోయిన నాగకన్యకలు
చనిచని మగుడ రసాతలంబునకుఁ - జనుదెంచుగతి వర్షజలధార లొప్పె.

ఆకాశమునుండి అవనిపై పడుచున్న వర్షధారలు ఆకాశగంగలో స్నానం చేసి రసాతలానికి తిరిగిపోతున్న నాగకన్యలవలె ఉన్నవట! ఎంత సహజంగా ఉందో!

ఉత్తరగోపురంలో కొలువుతీరి ఉన్న లంకేశ్వరుడు, ఒక్క బాణంతో తన సభావైభవమంతా చెల్లాచెదరు చేసిన శ్రీరాముని ధనుర్విద్యాకౌశలాన్ని ఈ విధంగా కొనియాడుతాడు.

నల్లవో 'రఘురామ'నయనాభిరామ' - విల్లువిద్యగురువ వీరావతార!
బాపురే! రామ! భూపాలలోకముల - నీపాటివిలుకాడు నేర్చునే కలుగ

పాటించి పురముల పైబడ్డ హరుని
యేటొప్పు నిందు నీ యేటొప్పుగాక.

రావణుడు ఇట్లు పలుకగా "పగవాని నీకీతి పంతంబు విడిచి పొగడుదురే దైత్యపుంగవ" అని మంత్రులు హెచ్చరిస్తారు. 'మేటిశూరుల పెంపు మెచ్చంగ వలదె' అంటాడు రావణుడు. ఈ విధంగా ప్రతినాయకుడైన రావణుణ్ణి అతి లోకశూరునిగానే కాకుండా మహోదారునిగా గుణగ్రహణపారీణునిగా బుద్ధారెడ్డి చిత్రించాడు.

సుగ్రీవుడు సీతమ్మసొమ్ములను శ్రీరామునకు చూపినప్పుడు –

''మున్నుగా వగలను మున్నీట మునిగి –
కన్నీట నాసొమ్ము కసటెల్ల గడిగి"

రాముడు శోకించటం పఠితల హృదయాన్ని కదిలిస్తుంది. "అపరాధం చేసిన కైకనూ, భరతుణ్ణీ, రావణాసురుణ్ణీ ఏమీ చేయకుండా నిరపరాధుడైన వాలిని ఎందుకు చంపా"వని ఏడుస్తూ తార శ్రీరాముణ్ణి ఎత్తిపొడవటం ఎంతో సహజంగా ఉంది.

"మెరసి నిన్నిటుచేయ మీ తండ్రితోడ
గరపెనే రఘురామ! గణుతింప వాలి?
వెరవున నీ రాజ్యవిభవంబు గొన్న
భరతుడే రఘురామ! పరికింప వాలి?
చెనటియై నీదేవి జెరగొని చనిన
దనుజుడే రఘురామ! తలపోయ వాలి?
వాలి నకారణవైరంబు పూని – ఏలయ్య తెగటార్చి తిట్బంగి బేర్చి ?
నీ యట్టి సుకృతికి నీ యట్టిపతికి – నీయట్టి కారుణ్యనిధికిట్లు తగునె ?
జనకజతో గూడ జనియెనే ఎఱుక –
ఘనమైన విరహాగ్ని గ్రాగెనే ఎరుక?"

రావణాసురుణ్ణి సంహరించిన రామబాణం భూమిలో జొచ్చి మరలివచ్చి రాముని అమ్ములపొదిలో ప్రవేశించిందట. ఈ సందర్భాన్ని కవి ఇలా సంభావిస్తున్నాడు.

''నీ కూతు చెరపట్టి నీచభావమున-గైకొన దలచిన ఖలుని ప్రాణములు
గైకొంటి నే"నని కదిసి భూస్థలికి
ప్రాకటంబుగ(జెప్ప(బరచెనో యనగ(

రామునిబాణం భూమిలోదూరి మళ్లీ అమ్ములపొదిలోకి చేరిందట. ఈ విధంగా రంగనాథరామాయణంలోని సాహిత్యసౌందర్యం సహృదయహృదయంగమంగా ఉంటుంది.

"ఆదికవీశ్వరుడైన వాల్మీకి చెప్పిన తెఱగున శ్రీరాము చరితము చెప్పుదు" నన్నప్పటికీ అవాల్మీకాలైన అంశాలు కొన్ని ఈ రామాయణంలో రచయిత చేర్చాడు,

గౌతముని ఆశ్రమంలో ఇంద్రుడు "కుక్కుటంబై పోయి కుటజంబు చేరి కొక్కొరో కోయని" కూయటం కొత్తవిషయం. ఇది వాల్మీకంలో లేదు.

గౌతముడు భార్యయైన అహల్యను పాషాణమై పడియుండుమని కఠోరంగా శపిస్తాడు, ఇది కూడా వాల్మీకంలో లేదు.

బాల్యంలో శ్రీరాముడు బంతి ఆడుకుంటూ ఆటకు అడ్డంవచ్చిన మందర కాలు విరుగగొట్టినట్లూ ఆ కచ్చె కడుపులో పెట్టుకొని మందర రామపట్టాభిషేకాన్ని భగ్నం చేసినట్లూ ఇందులో కనిపిస్తుంది.

ఇందలి జంబుకుమారుని వృత్తాంతం వాల్మీకంలో లేదు. సీతారాములు ధనుర్భంగానికి ముందే పరస్పరం చూచుకొని ప్రేమించుకొంటారు. ఇదికూడా వాల్మీకంలో లేనిదే. లక్ష్మణుడు పర్ణశాలలో సీతను ఒంటరిగ వదలి వెళ్తూ ఏడుగీతలు గీసి ఏ పరిస్థితిలోనూ వీటిని దాటి రావలదని నియమం చేస్తాడు.

రావణుని సభలో హనుమంతుడు తన వాలాన్ని సింహాసనంగా చుట్టుకొని దాని మీద కూర్చుంటాడు. సంజీవి తేవటంకోసం పోయిన ఆంజనేయునికి కాలనేమి అనే రాక్షసుడు అడ్డుపడి కాలయాపన చేస్తాడు.

సేతుబంధసమయములో ఒక ఉడుతబుడుత తన భక్తిని ప్రదర్శించి రాముని అనురక్తిని సంపాదించుకుంటుంది.

అన్నిటికంటే ముఖ్యమైనది సులోచనా వృత్తాంతం. ఈమె మహావీరుడైన ఇంద్రజిత్తు భార్య. తన మామగారి అనుజ్ఞపొంది శత్రువుల సైన్యంలో ప్రవేశించి తన పతి మృతకళేబరాన్ని కొనివచ్చి దాంతో సహగమనం చేస్తుంది. వాల్మీకి రామాయణంలో లేని విచిత్రమైన ఈ సన్నివేశాలన్నీ చమత్కారం కోసం, రసపుష్టికోసం, కథాగమనం కోసం రంగనాథరామాయణకర్త ఇతర సంస్కృత రామాయణాలనుండీ, జనశ్రుతులనుండీ గ్రహించి ఇందు చేర్చాడు.

రంగనాథరామాయణంలో 17,290 ద్విపదలు ఉన్నవి. ఆరు కాండము లున్నవి. ఉత్తరకాండము బుద్ధారెడ్డి కుమారులైన కాచవిభుడు, విట్ఠలనాథుడు పూర్తి చేశారు. అందులో 5640 ద్విపదలు ఉన్నవి.

బెంగాలీవారికి కృత్తివాసరామాయణం వలె, హిందీవారికి తులసీ రామాయణం వలె, తమిళ సోదరులకు కంబరామాయణం వలె, తెలుగువారికి సర్వాంగసుందరమైన రామాయణం రంగనాథ రామాయణం. రంగనాథరామాయణం వెన్నెల వెలుగుల్లో విహరించి ఇక భాస్కరుని అరుణారుణ కిరణ కాంతులలోకి అడుగు పెడదాం.

## భాస్కర రామాయణం

హుళక్కి భాస్కరుడనే కవి ప్రాధాన్యం వహించి తనూ, తన కుమారుడూ తన శిష్యుడూ, తన మిత్రుడూ కలిసి రచించినందువల్ల ఈ మహా గ్రంథానికి "భాస్కరరామాయణము" అనే పేరు వచ్చినది. కొందరు విమర్శకులు తిక్కన గారి పితామహుడైన మంత్రి భాస్కరుని హస్తం ఇందులో ఉందని అభిప్రాయ పడ్డారు. అయితే వాదోపవాదాల అనంతరం మంత్రి భాస్కరుడికి ఈ భాస్కర రామాయణానికి ఏమీ సంబంధం లేదని తేలిపోయింది.

హుళక్కి భాస్కరుడు అన్న పేరు "హళక్కి భాస్కరుడు" అయి ఉంటుందనీ "హళక్కి'' అన్నది కన్నడంలో తాంబూలబిరుదమనీ భాస్కరుడు పాండిత్యంలో తన ప్రభువును మెప్పించి అగ్రతాంబూలం అందుకొని హళక్కి భాస్కరుడై ఉంటాడని కొందరు విమర్శకుల అభిప్రాయం. భాస్కరామాయణంలోని ఆరుకాండలలో బాల-కిష్కింధా-సుందర కాండలను భాస్కరుని పుత్రుడైన మల్లికార్జునభట్టూ, అయోధ్యాకాండను శిష్యుడైన రుద్రదేవుడూ-అరణ్యకాండనూ, యుద్ధ కాండలో 1139 పద్యము వరకు భాస్కరుడూ రచింపగా యుద్ధకాండ మిగిలినభాగమంతా భాస్కరుని మిత్రుడైన అయ్యలార్యుడు పూర్తిచేశాడు.

భాస్కర రామాయణ రచన వాల్మీకి రామాయణాన్ని అనుసరించి సాగినదే అయినా అవాల్మీకాలైన అంశాలు కొన్ని కథావైచిత్రికోసం, రసపోషణకోసం రంగనాథ రామాయణంలో వలెనే ఇందులోనూ ప్రవేశించాయి.

గౌతముడు అహల్యను శిల కమ్మని శపిస్తాడు. చిన్నప్పుడు రాముడు తన్ను తన్నినాడన్న కసికొద్దీ మందర కైకకు దుర్బోధ చేసి శ్రీరామపట్టాభిషేకం చెడగొడుతుంది. (ఈ తన్నులు తిన్న సంగతి వాల్మీకంలో లేదు.) శూర్పణఖ కుమారుడైన జంబుకుమారుణ్ణి లక్ష్మణుడు సంహరించిన కథకూడా ఇందులో చోటుచేసికొంది. భర్తృశోక పరితప్తురాలైన తార "రావణసంహారా

నంతరం నీవు సీతను కొనివచ్చినా శాశ్వతమైన జానకీ వియోగం అనుభవిస్తా" వని రాముణ్ణి శపిస్తుంది. అన్నచే అవమానితుడైన విభీషణుడు తన తల్లియైన కైకసి దగ్గరకు వెళ్లి జరిగిన సంగతంతా చెప్పి ఆ తల్లి ఆశీర్వాదంతో శ్రీరాముణ్ణి శరణు పొందుతాడు. నాగపాశబద్ధులైన రామలక్ష్మణుల సాన్నిధ్యానికి నారదుడు వచ్చి "గరుత్మంతుని స్మరింపు" మని ఉపాయం చెబుతాడు. కాలనేమి కథ ఇందులో కూడా ఉంది. రావణుని నాభియందలి అమృతకలశం వృత్తాంతం ఇందులో వస్తుంది. ఇవన్నీ వాల్మీకంలో లేవు. కొన్ని రంగనాథరామాయణం నుంచీ, మరి కొన్ని అధ్యాత్మరామాయణం నుంచీ భాస్కరాదులు గ్రహించి ఉంటారు.

భాస్కరరామాయణం అనర్గళధారాసముపేతమై ప్రౌఢగంభీర శయ్యా సౌభాగ్యంతో విద్వజ్జన రంజకంగా విరాజిల్లుతూ ఉంటుంది.

తాటకా సంహారఘట్టంలో వీరోచితంగా వింటినారి మ్రోగిస్తాడు శ్రీరాముడు.

అంతఁ గడంక రాముఁడు సమగ్రభుజాబలవిక్రమోత్సవం
బెంతయుఁ బర్వ మౌర్వి మొరయించె దిగంతరదంతికర్ణరం
ధ్రాంతర సాగరాంతరధరాశ్రితలాంతర చక్రవాళశై
లాంతరసర్వభూధరగుహాకుహరాంతరపూరితంబుగన్.

సుదీర్ఘమైన సమాసంలో సాగిన ఈ ధనుష్టంకారం ఇంకా ఇంకా మన చెవులలో మార్మోగుతూనే ఉన్నది. ఇది మల్లికార్జునభట్టు పద్యం.

"విఘ్నేశాయ నమో నమో భగవతే వేదండతుండాయ ని

ర్విఘ్నక్షేమకృతే నమోస్తు భవతే విశ్వప్రభో" అని నిర్విఘ్నపరిసమాప్తి కోసం విఘ్నేశ్వర పూజచేసి నలుడు రామాజ్ఞతో సేతువు కట్టటం ప్రారంభించాడు కార్యారంభంలో గణేశపూజ చేయటం భారతీయుల ఆచారం. వానరవీరులు తలలమీద, బుజాలమీద చేతుల సందున పెట్టుకొని పెద్దపెద్ద బండలూ కొండలూ తెచ్చి నలుడి చేతికి అందిస్తున్నారు. నలుడు నీటిలో పడవేసిన ఏ పదార్థమూ- అది కొండగానీ బండగానీ—తేలవలసినదే కాని మునుగదు. అది వాని ప్రత్యేకత. నలుడు ఒక పెద్ద కొండ ఎత్తి మొట్టమొదటసారిగా "దభీలు"మని సముద్రంలో పడవేశాడు. ఆ సందర్భంలో భాస్కరుడు ఎంత చక్కని కల్పన చేశాడో చూడండి.

వైచిన నాక లోకమున వారికి వారిధిపంపు పూని దో
షాచరనాథు చేటు విన జాట జలచ్ఛట లేగ—దాను వే
వేచని చెప్పి వచ్చె నహివీరుల కన్నటు లూర్మి లొక్కపె
ల్లై చెదరన్ మునింగి వెస నగ్గిరిదేలె గపీంద్రు లార్వగన్.

''దధీ''మిని పర్వతం సముద్రంలో పడగానే పెద్దధ్వనితో సముద్ర జలం ఆకాశమెత్తు పైకిలేచిందిట. అది రావణుడికి చేటుమూడిం దని స్వర్గంలో వారికి చాటి చెప్పడానికి సముద్రుడు తన వారిని పంపించినట్లున్నదట! ఇక పాతాళందాకా లోపలికి మునిగి బంతిలా పైకి లేచిన పర్వతం రావణుని సర్వ నాశనాన్ని రసాతలవాసులకు చెప్పి మళ్ళీ పైకి వచ్చినట్లున్నదట. ఎంత అద్భుతమైన కల్పనో చూడండి!

రావణ సుగ్రీవులు యుద్ధం చేస్తున్నారు. పరస్పరం అధిక్షేపించుకొంటు న్నారు. ముందు సుగ్రీవుడూ తరువాత రావణుడూ—

"వంచన రాముదేవి గొనివచ్చినయట్టులు గాదురోరి న
క్తంచర ! నన్ను నాహవముఖంబున డాయుట" లన్న "నయ్యరే
క్రించ సహోదరున్ గరము గీడ్పడి మానవు చేత దొంచియే
యించుట గాదులే నను జయించుట నీకు" నటంచు నవ్వెనన్.

"దొంగతనంగా రాముణ్ణి మోసంచేసి సీతను తీసుకురావటం కాదురా నన్ను జయించటం" అని సుగ్రీవు డాక్షేపిస్తే "పౌరుషం చాలక దొంగతనంగా చెట్టు చాటున పొంచి ఉంచిన ఒక మానవునిచేత అన్నను చంపించటం కాదురా నన్ను జయించటమంటే" అని ఎదురు దెబ్బతీస్తాడు రావణుడు. ఇద్దరూ ఇద్దరే. బుద్ధిమంతులు! పైది భాస్కరుని పద్యం.

లంకానగరంలో హనుమంతుడు రావణునికి హితోపదేశం చేస్తున్న ఈ పద్యం ఎంత గొప్పగా నడిచిందో చూడండి—

నీ కంఠార్పితకాలపాశము శిరోనిర్ఘాతపాతంబు లం
కౌకస్సంచయకాళరాత్రి గళబద్ధోదగ్రకాలాహి క
న్యాకారాగతమృత్యువున్ జనకకన్యన్ వేగ యొప్పించి లో
కైకత్రాణుని రామునిం గనుము నీ కీబుద్ధి గాకుండినన్—

ఇది మల్లికార్జున భట్టు పద్యం. మహాకావ్యానికంతా మకుటాయమానంగా మణిదీపంగా ప్రకాశించే ఈ క్రింది పద్యమూ మల్లికార్జునభటుదే. వర్షావర్ణనం—

యమునద్గంగము, కృష్ణభూమదిల, మజ్జాషన్మనుష్యంబు, నీ
లమహీధ్రన్నిఖిలాచలావలి, తమాలద్భూజ, మిందీవర

త్కుముద శ్రేణి, పికద్విహంగము, దమస్తోమద్గ్రిహార్క ప్రభా
సముదాయం బగుచుండె లోక మలఘుశ్యామా భ్రముల్ పర్విన్.

వర్షాకాలంలో ఆకాశంనిండా కారుమేఘాలు క్రమ్ముకొన్నాయి. గంగ యమునలాగా అయిపోయింది. నరులు నారాయణులైనారు. కొండలన్నీ కాటుక కొండలైనాయి. చెట్లన్నీ చీకటిచెట్లుగా మారాయి. తెల్లకలువలు నల్లకలువలై పోయాయి. పక్షులన్నీ కోకిలరూపం ధరించాయి. ఈ పద్యంలో హృద్యమైన వ్యాకరణసౌందర్యం ఉన్నది. నామధాతువులపై శతృప్రత్యయాలు చేర్చి బహువ్రీహి సమాసాలను సంతరించి పద్యమంతా అనవద్యంగా దిద్దితీర్చాడు కవి. వ్యాకరణం తెలిసిన పాఠకులకు గాని ఇందలి శాబ్దికశిల్పం బోధపడదు. ఉదాహరణకు ఒక్కటి విన్నవిస్తాను - యమునద్గంగము-కృష్ణభూమదిలము-అబ్జాక్షన్మనుష్యంబు అనే విశేషణాలలో "కృష్ణభూమదిలము" అన్నది చాలా విచిత్రమైన సమాసము. భూమి సమస్తమూ నల్లభూమిగా మారిపోయింది. "కృష్ణాచ సా భూమిః కృష్ణభూమిః" అని ఇకారాంతం కావలసి ఉండగా "కృష్ణోదక్ పాండు సంఖ్యా పూర్వాయా భూమే రజిష్యతే" అనే వార్తికం వల్ల "కృష్ణభూమము" అని అకారాంత మవుతుంది. ఆ తరువాత నామధాతువై శతృప్రత్యయం వచ్చి అనంతరం "ఇలా" శబ్దంతో బహువ్రీహి సమాసమై "కృష్ణభూమదిలము" అనేరూపం ఏర్పడుతుంది. ఇంత వ్యాకరణకోలాహలం ఎందుకు చెప్పానంటే సమర్థులైన కవులు శబ్దాన్ని ఎంత నిశితంగా ఎంత నిర్దుష్టంగా ఎంత ప్రతిభాస్ఫోరకంగా ప్రయోగిస్తారో తెల్పటం కోసం.

## మొల్ల రామాయణం

అదుగో మొల్ల రామాయణం! సుగంధాలు వెదజల్లుతూ చల్లగా తెల్లగా మల్లెపందిరి లాగా మనల్ని ఆహ్వానిస్తున్నది. మొల్ల గురులింగ జంగమార్చన పరుడూ శివభక్తిరతుడూ అయిన కేసయ వరపుత్రి నని చెప్పుకొన్నది. మొల్ల రామాయణానికి తెలుగుదేశంలో విశేషమైన ప్రశస్తి ఉన్నది. ఈమె రామాయణం ఆరు కాండలతో సుమారు 900 గద్యపద్యప్రసూనాలతో రసజ్ఞమనోజ్ఞంగా ప్రసన్నసుందరంగా ఉంటుంది. కవిత్వాన్ని గురించి మొల్ల మొగమోటం లేకుండా తన అభిప్రాయాన్ని ఇలా ప్రకటించింది.

తేనె సోక నోరు తీయన యగురీతి
తోడ నర్థ మెల్లఁ దోఁచకుండ
గూఢశబ్దములను గూర్చిన కావ్యమ్ము

మూగచెవిటివారి ముచ్చటగును.

ఇంకా ఏమంటుందంటే -

కందువమాటలు సామెత
లందముగాఁగూర్చి చెప్ప నది తెలుగునకుం
బొందై రుచియై వీనుల
విందై మరి కానుపించు విబుధుల మదికిన్.

మొల్ల శివభక్తుల ఇంటిలో పుట్టినా బమ్మెరపోతన్నవలె తనకృతిని తన యిష్టదైవతమైన శ్రీరామచంద్రునకే అంకితం చేసింది. రాముని స్తుతించు నాలుక రాజులను స్తుతింప దన్న సంగతిని అందమైన సామెతలో "బెల్లము తినువాడు అల్లమున కాసపడడని" మొల్ల తేటతెల్లంగా చెప్పింది.

సల్లలితప్రతాపగుణసాగరుడై విలసిల్లి ధాత్రిపై
బల్లిదుడైన రామనరపాలకునిన్ స్తుతిజేయు జిహ్వకున్
చిల్లరరాజలోకమును చేకొని మెచ్చగ నిచ్చపుట్టునే
అల్లము, బెల్లముం దినుచు నప్పటి కప్పటి కాస చేయునే.

ఈమె కవితామాధుర్యానికీ పదసౌందర్యానికీ ఈ క్రిందిపద్యం మచ్చుతునుక.

రాజులు కాంతియందు; రతిరాజులు రూపమునందు; వాహినీ
రాజులు దానమందు; మృగరాజులు విక్రమకేళియందు; గో
రాజులు భోగమందు; దినరాజులు సంతతతేజమందు; రా
రాజులు మానమందు నగరంబున రాజకుమారులందరున్.

సముద్రం లంఘింపబోతున్న ఆంజనేయుణ్ణి ఈమె ఈ పద్యంలో బొమ్మ కట్టించింది.

మొగము బిగించి పాదములు మొత్తముగా నటు నూదిత్రొక్కి నీ
టుగ మొగమెత్తి భీకరకఠోరరవంబున నార్చి బాహు ల
త్యగణితలీల నూచి వలయంబుగ వాలము ద్రిప్పి వేగునన్
నగము సగమ్ము క్రుంగ కపినాథుడు నింగికి దాటె రివ్వునన్.

ఎంత చక్కగా దూకించింది హనుమంతుణ్ణి ! రాతిని నాతిగా మార్చిన రామభద్రుని పాదాలను తులసీదాసువలెనే గుహునిచేత కడిగించింది మొల్ల.

"సుడిగొని రాముపాదములు సోకిన ధూళి వహించి రాయియే
ర్పడ నొకకాంత యయ్యెనట; పన్నుగ నీతని పాదరేణు వి
య్యెడ వడి నోడ సోక నిది యేమగునో"యని సంశయాత్ము డై

కడిగె గుహుండు రామపదకంజయుగంబు భయమ్ము పెంపునన్.

మొల్లకూడా పోతన్నగారివలెనే -

"చెప్పుమని రామచంద్రుడు

చెప్పించిన పలుకుమీద చెప్పుచు"నని తన సంగతి వినయపూర్వకంగా చెప్పుకొన్నది. శ్రీకంఠ మల్లేశ్వరుని వరముచే జన్మించిన ఈమె మొదటిపేరు "మల్లమ్మ" అనీ, మల్లమ్మ మెల్లమెల్లగా మొల్లమ్మగా మారి ఉంటుందనీ కొందరి అభిప్రాయం. ఈమె కృష్ణరాయల కాలంలో ఉన్నట్లు చెప్పబడటంచేత ఈమె కాలం 16 వ శతాబ్దం పూర్వభాగం అయిఉండవచ్చునని విమర్శకుల ఊహ.

## రామాభ్యుదయము

ఇది ఎనిమిదాశ్వాసముల మహాప్రబంధం. రామాయణమునందలి షట్కాండముల కథ రామపట్టాభిషేకపర్యంతం అత్యంత రసవంతంగా ఇందు వర్ణింపబడింది. అయ్యలరాజు రామభద్రుడు (1540) ఈ రామాభ్యుదయ రచయిత. ఇందు సుమారు 1800 గద్య పద్యములున్నవి.

రామభద్రుడు ఆంధ్రుల ఆచారాన్ననుసరించి కల్యాణ సమయంలో శ్రీరామునిచేత సీతమెడలో మంగళసూత్రం కట్టించాడు.

హాటకగర్భదైవత మహర్షులు దీవన లియ్యగా, నిరా
ఘాటమరుద్వధూమధురగానము నింగిఁ జెలంగ, జానకీ
పాటలగంధికంధర, శుభప్రదవేళ ఘటించె నాజగ
న్నాటకసూత్రధారి రఘునాథుడు మంగళసూత్ర మయ్యెడన్.

రామభద్రుడు కవితాలక్షణమునూ, వర్షర్తువర్ణనమునూ జోడించి ఒకచక్కని పద్యము చెప్పినాడు.

ధారాశుద్ధి ప్రసిద్ధి గాంచి ఘనశబ్దస్ఫూర్తి వర్తిల్లగా
దోరంబైన రసస్థితిన్ దరళవిద్యున్మాలికాలక్షణో
దారంబై కవిసేవ్యమై వనమయూరారూఢిఁ బ్రాపించి వ
ర్షారంభంబు ప్రబంధమ ట్లఖిలపద్యాక్రాంత మయ్యెం దగన్.

ఈ పద్యంలో ఉత్తమకవితకు ఉండవలసిన ప్రధానలక్షణాలు ధారాశుద్ధీ, ఘనశబ్దస్ఫూర్తీ, రసస్థితీ అని కవి స్ఫురింపజేశాడు శ్లేషచమత్కారంతో. రసజ్ఞమనోజ్ఞాలైన పద్యాలు ఈ ప్రబంధంలో ఎన్నో ఉన్నాయి. దశరథ విలాపంలో "కానకకన్న సంతానంబు కావున కానక కన్న సంతానమయ్యె" అన్న శ్లేషసుందరమైన సీసపద్యం విశేషప్రచారం పొందిందే. "పాలింపు మిజ్జగం

బులు పాలింపగ త్రావి" "ఓడవు సురాసురాదుల, కోడవు భవజలధి గడవ" "నీలోపల బెగడొందకు నీలోపలచికుర!" "నలువ గల లోతుపొక్కిలి నలువగల భుజంబులున్ దనర" ఇటువంటి అనుప్రాసల గమకాలూ యమకాలూ ఈయన కవితలో కోకొల్లలు. అందుకనే "రామాభ్యుదయం విజయవిలాసానికి మార్గదర్శక" మని కొందరంటారు.

## కట్టా వరదరాజ రామాయణము

వరదరాజు సూర్యవంశ క్షత్రియుడు. ఈ రాజకవి కడప మండలానికి చెందినవాడు. వీరి పూర్వులు కావేరికి ఆనకట్ట కట్టించటం వల్ల వీరికి "కట్టా" అనే గృహనామ మేర్పడింది. వరదరాజ రామాయణం యథా వాల్మీకం. రసవత్తరమైన రచన. దీనిలో 23170 ద్విపదలు ఉన్నవి. ఇందులో ఒకటి రెండు అవాల్మీకాలైన అంశాలున్నప్పటికీ వాల్మీకి ననుసరించే రచన సాగింది. శయ్యా సౌభాగ్యానికి ఒక ఉదాహరణం-రణరంగానికి వచ్చి బ్రహ్మాస్త్రం ప్రయోగించిన ఇంద్రజిత్తు జిత్తులను ఇట్లా వర్ణించాడు వరదరాజు-

అసురేంద్రసుతుడు బ్రహ్మాస్త్రప్రభావ-లసమానతేజోవిలాసియై డాసి
నెరయించు నొకచోట నీలమేఘముల
కురియించునొకచోట ఘోరాస్త్రవృష్టి

మలయించు చోకనొట మంచుపెందెరలు-పొలయించు నొకచోట భుగభుగ పొగలు-వినిపించు నొకచోట విలునారిమోత-కనిపించునొకచోట కాంచన రథము. ఋశ్యమూక పర్వత వర్ణనం అంత్యానుప్రాసలతో కూడి సంస్కృత సమాసాలతో సాగిపోయింది-

కందరాంతరవిశంకటవనౌకంబు-సందీప్తశృంగానుషంగనాకంబు
అపహృతాధ్వన్యశ్రమాతిరేకంబు-తపనేందుగణమణిస్థగితలోకంబు
సారసినీచరచక్రవాకంబు-తీరవనీసము త్తీర్ణపైకంబు
ప్రతిపన్నయతిపుణ్య ఫలవిపాకంబు-శ్రితఋష్యనీకంబు ఋశ్యమూకంబు.

## రఘునాథ రామాయణము

ఇది తంజాపురాన్ని పరిపాలించిన నాయకరాజశిరోమణి రఘునాథనాయకుని రచన. ఈ రామాయణం బాలకాండవరకే దొరికింది. ఉన్నంతలో యథా వాల్మీకంగానే ఉన్నది. పసిపాపలకై పరితపించే దశరథుని పితృహృదయం ఈ చంపకంలో పరిమళిస్తున్నది గమనించండి-

కలుగునొక్కో చకోరహితుఁ గన్గొని తెమ్మని పోరువెట్ట దా
దులు గికురించి అద్దమునఁ దోచిన చందురు జూప రెండుచే
తులఁ గొని పట్టి సంతసముతో తన చేతికిఁ జిక్కె నంచు ను
గ్గలికఁ జెలంగు బాలకుని కన్నులఁ జూడగఁగల్గు భాగ్యముల్.

"అద్దములో చందమామ కథ" ఇందు అందంగా పొందుపరుపబడింది. ఈ రసవత్కృతిని రఘునాథుని ఆస్థాన కవయిత్రి మధురవాణి సంస్కృతం లోకి అనువాదం చేయటం అభిజ్ఞులు గమనింపదగిన విషయం.

## అచ్చ తెనుగు రామాయణము

దీనిని రచించిన మహాకవి కూచిమంచి తిమ్మన. ఈయన 'కవిసార్వభౌమ' బిరుదాంచితుడు. రుక్మిణీ పరిణయము, రాజశేఖర విలాసము, నీలా సుందరీ పరిణయము, కుక్కుటేశ్వర శతకము మొదలైనవి ఈయన యితర కృతులు. తన కృతులన్నీ ఇష్టదైవమైన పీఠికాపుర కుక్కుటేశ్వరస్వామికే అంకితం చేశాడు.

"హాటక గర్భవధూటీ
లాటన చలితాంఘ్రినూపురారావశ్రీ
పాటచ్చరములు; తేనియ
తేటలు మా కూచిమంచి తిమ్మయ మాటల్."

అన్న ప్రశస్తి ఈయన కవిత్వానికి ఉన్నది. అచ్చ తెనుగు రామాయణము ఆరు కాండలుగా విభక్తమైనది. ఇందలి కౌముదీవర్ణనము కమనీయము-

"వేల్పుచేనిక లయ్యె బోల్పనేనుగులెల్ల
కొండలన్నియు వెండికొండ లయ్యె
పలుకుచేడియ లైరి పొలతుకలందరు
చెట్టులన్నియు వేల్పుచెట్టు లయ్యె."

ఈ సీసము 'నారదులైరి సన్మునులు నాకమహీజము లయ్యె భూజముల్' అన్న మొల్ల పద్యాన్ని స్ఫురింపజేస్తున్నది.

## గోపీనాథ రామాయణము

ఈ మహాగ్రంథము రచించినవారు గోపీనాథము వేంకటకవిగారు. కవుల నామములతో "రంగనాథ రామాయణం" "భాస్కర రామాయణం" "మొల్ల రామాయణం' అన్నట్లే కవి యింటిపేరుతో దీనికి "గోపీనాథ రామాయణం" అన్న పేరు వచ్చింది. ఈ కవి 19వ శతాబ్దికి చెందినవాడు. వేంకటగిరి సంస్థా

నంలో ఆస్థానకవి పీఠం అలంకరించినవాడు. కృష్ణజన్మఖండమూ, ఆంధ్ర శిశుపాలవధ మహాకావ్యమూ వీరి యితర కృతులు. ఆంధ్రదేశములో గోపీనాథ రామాయణానికి విశేషఖ్యాతి ఉన్నది. ఇటీవల వెలువడిన రామాయణాలలో "అగ్రతాంబూల" మందుకున్న రామాయణ మిది.

గోపీనాథం వారు తమ రామాయణాన్ని శ్రీ కృష్ణాంకితంగా రచించారు. శ్రీ కృష్ణాంకితమైన కంకంటి పాపరాజుగారి ఉత్తరరామాయణమూ తన పూర్వ రామాయణమూ కలిసి సంపూర్ణరామాయణముగా తెలుగుదేశంలో వెలుగొందా లని వారు ఆశించినట్లు తోస్తుంది.

వేంకట కవిగారి కవిత సలక్షణమై లలితపద సంకలితమై ధారాళంగా గంగాప్రవాహంవలె సాగింది. సీతాదేవి రావణుణ్ణి తృణీకరించి పలికే ఈ పద్యం చిత్తగించండి:

అంబుధిపల్వలంబులకు, హంసబకంబులకున్, ఖగేంద్ర కా
కంబులకున్, మృగేంద్ర శశకంబులకున్, మదహస్తిరాడ్బిడా
లంబుల కెంత యంతర మిలాస్థలిఁ గన్పడు; నంత తార త
మ్యం బగు నాదు భర్తకు నిశాటకులాధమ ! నీకుఁ జూడగన్.

శ్రీ నాథుని "చిఱుసాన బట్టించి చికిలి చేయించిన" అన్న కాశీఖండ పద్యానికి సరిజోడుగా నడచిన ఈ క్రింది సీసపద్యాన్ని తిలకించండి:

గగనకాసారోడు కైరవంబులు గోయఁ
బ్రాచి సాచిన హస్తపల్లవంబు
నెఱసిన బలితంపు నిబిడాంధకార కాం
తారసీమకు బృహద్భానుహేతి
ప్రబలవిభావరీవ్రతతిఁ ద్రుంపగ సానఁ
బట్టించి యెత్తిన పరశుధార
జలజాత వనవాటికలఁ గల్గు జాడ్యంబు
పరిహరింపంగఁ బాల్పడ్డమందు
పయనములు వేకువంబోవు పథిక తతికి
దారిఁ జూపెడు తెరువరి, దంపతులకు
పంచశరజన్య విరతిఁ బుట్టించు చతురుఁ
డరుణుఁ డుదయించెఁ బ్రాక్పర్వతాగ్రమందు.

వానరు లందరూ సీత సంగతి తెలుసుకున్నామన్న సంతోషంతో ధుమ

వనంలో ప్రవేశించి చెట్లన్నీ పాడుచేస్తూ స్వచ్ఛందంగా విహరించిన సందర్భాన్ని 48 పాదాలుగల "వృషభగతి రగడ"లో వర్ణించటం వారి పఠుప్రవర్తనకు తగినట్టుగా ఉంది. గోపీనాథ రామాయణం అవతారికలో శ్రీ శాస్త్రి గారు సత్కృతి స్వరూపమును గూర్చి ఒక చక్కని పద్యం వ్రాశారు-

చతురత మీరఁ బాకములు, శయ్యలు, రీతు, లలంకృతుల్, ధ్వనుల్,
వితత రసంబులున్, మఱియు వృత్తులు, దోషములున్, గుణంబు, లు
న్నతిఁ బరికించి సత్కృతి యొనర్చినఁ దత్కృతి లోకపూజ్యమై
యతులిత భంగి వృద్ధిఁగను నా విధుభాస్కరతారమై భువిన్.

పైన చెప్పిన అశేష విశేషాలతో సమలంకృతమైన "గోపీనాథ రామాయణం" కవిగారు ఆశించినట్లే అతులితమై ఆచంద్రతారార్కారం రసజ్ఞ పాఠకుల రసనాంచలాలపై విహరించుతుందని విశ్వసించుదాం.

## ఆంధ్ర వాల్మీకి రామాయణము

దీనిని రచించిన వారు శ్రీ వావిలికొలను సుబ్బారావుగారు. వీరు విద్వత్కవులు. శ్రీరామ భక్తాగ్రగణ్యులు. "శ్రీ కుమారాభ్యుదయం" "కౌసల్యా పరిణయం" మున్నగునవి వీరి ఇతర కృతులు. వీరిది ద్రాక్షాపాకం. ధారాళమైన శైలి. వాల్మీకి రామాయణంలోని సర్గక్రమము ననుసరించి వీరి అనువాదం యథామాతృకంగా సాగింది. అమూలకాలైన సొంత పద్యాలను పుస్తకంలో అక్కడక్కడ చేర్చి వాటికి నక్షత్ర చిహ్నాలు ఉంచారు. వీరికి పోతనామాత్యుడన్నా ఆయన కవిత్వమన్నా అపారమైన భక్తి. ఈ క్రింది పద్యాలు దశమస్కంధంలోని పోతన్నగారి పద్యాలను స్ఫురింపజేస్తున్నాయి. చిత్తగించండి-

బంధం బెక్కడ నెఱుగని
బంధురగుణ యశుడు, బుధుల బాధల మాన్పన్
సింధురగమనోదర ని
ర్బంధమ్మున నుండె భక్త బాంధవు డగుటన్.

అవును. బంధ మెరుగని జగద్బంధునికి బంధం కల్గింది. ఈ చమత్కారం చిత్తగించండి-

వటపత్రసన్నిభం బగు
కుటిలాలక యుదరసీమ గురువై, యిపుడున్
వటపత్ర నిభమ యయ్యెను
వటపత్రశయాను డుంట వారని ప్రీతిన్.

ఈ క్రింది కందం అందాలు చిందుతో ఉంది-

పాలవెల్లిలోనఁ బండి, లోకంబులఁ
బాలనంబు సేయు బాలకునకు
పా లొసంగునట్టి భాగ్య మబ్బె నటంచు
నోలి నుబ్బె సతి పయోధరములు

జగములన్నీ కావు కావు మని ప్రార్థించే ప్రభువు "కావు కావు" మన్నాడుట!

"కావు" మని జగము మొఱలిడ
గావగ దక్షుఁడు దా నొకండే జగతిన్
గావుటఁ బరువిడు వేలుపు
క్ష్మావరసుతుఁ డగుచు "కావు కావ"ని యేడ్చెన్.

తమ్ముడి ఉయ్యాల తన ప్రక్కన లేందే అయ్యగారికి నిద్రపట్టదట!

తన యుయ్యల ప్రక్కను ల
క్ష్మణు నుయ్యల లేకయున్న కనుమూయం, డే
మిని నుల్లాసము గానడు
జననీ స్తన్యంబు గ్రోలఁ జనఁ డేమైనన్.

వీరు తమ రామాయణమును సప్తకాండములు సంపూర్ణముగ రచించి ఇష్టదైవమైన శ్రీ ఒంటిమెట్ట కోదండ రామస్వామి వారి కర్పించి ధన్యులైనారు.

ఆంధ్ర శ్రీమద్రామాయణము

"అభినవాంధ్ర వాల్మీకి" బిరుదాంకితులు "కావ్యతీర్థ" శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు ఈ రామాయణాన్ని రచించారు. మూల రామాయణంలోని అర్థం సంపూర్ణంగా తెలియటానికి గోవిందరాజాది వ్యాఖ్యాతల అభిప్రాయాలు సైతం కలియగలుపుకొని తమ రచన సాగించటం వీరి ప్రత్యేకత. వీరి రామాయణంలో కూడా వాల్మీకి రామాయణంలోని సర్గ సంఖ్యా, శ్లోక సంఖ్యా గుర్తింపబడ్డాయి. వీరి రచన సరళ సుందరంగా సాగిపోతుంది.

శ్రీరామ పట్టాభిషేక వృత్తాంతం ఎరిగింపగానే మందరతో కైక అంటుంది -

ఏతన్మే ప్రియమాఖ్యాతుః కిం వా భూయః కరోమి తే
రామే వా భరతే వాహం విశేషం నోపలక్షయే.

పై వాల్మీకి శ్లోకానికి శర్మగారి అనువాదం ఈ విధంగా ఉన్నది:

మనమున కింపు బెంపదగు మాటను జెప్పిన నీకు నేమి యి
య్యనుగలదాన "నీ సవతియాత్మజుపై నిటు ప్రీతి యేలొకో"

యనియెదవేమొ రాఘవుని యందును నా సుతునందు భేదమున్
గనుగొన జాల నిద్దరును గాదిలి పుత్రులె నాకు గావునన్.

పైపద్యములో "నీ సవతి యాత్మజుపై నిటు ప్రీతి యేలకో యని యెదవేమొ" అన్నమాట మూలములో లేదు. అది "నను సవత్నీ పుత్రే కథంవా ఏతాదృశీ ప్రీతిః ఇత్యత ఆహ" అన్న గోవిందరాజీయ వ్యాఖ్యాన పంక్తి ననుసరించి చేర్చబడింది.

## ధర్మసార రామాయణము

ఈ రామాయణము కూడ జనమంచివారిదే. రామాయణము నందలి రాజ ధర్మము, భ్రాతృధర్మము, మిత్రధర్మము, పుత్రధర్మము మొదలైన ధార్మిక సిద్ధాంతములను చక్కగా నిరూపిస్తూ శర్మగారు రచించిన మహాగ్రంథ మిది

## శ్రీరామ కథామృతము

గ్రంథకర్త బ్రహ్మశ్రీ తాడేపల్లి వేంకటప్పయ్య శాస్త్రిగారు. వీరు మహా విద్వాంసులు, తపస్సంపన్నులు. విశేషించి శ్రీమదుమామహేశ్వర చరణనళిన నిత్యసేవా పరాయణులు. నిరాడంబర జీవనులు. చతుర్వింశతి సహస్రశ్లోక పరిమితమైన వాల్మీకి రామాయణాన్ని అనుసరించి తమ గ్రంథాన్ని ఉత్తర కాండతో కూడ "గాయత్రీ చతుర్వింశతివర్ణాంకిత చతుర్వింశతి సహస్ర గద్య పద్యాత్మకంగా" దిద్దితీర్చి పరమేశ్వరాంకితం చేశారు. ఇందలి రామాయణ కథ పరమేశ్వరుడు పార్వతికి చెప్పినట్లు ఉంటుంది.

'శంభో స్వాగత మాస్యతాం' అని కలవరించిన లీలాశుకుని బాలకృష్ణుని వలెనే వీరి బాలరాముడు నిద్రలో కలవరిస్తాడు-

'కుశలమె నీకు బ్రహ్మ ! నను కూర్మి దలంతువె యీశ ! నీ కహ
ర్నిశము సుఖంబె యింద్ర! భయభీతి దొలంగెనె దివ్యులార! బా
లిశు డత డేమిసేయు దృణలీల నడంతు' నటంచు నిద్దురన్
విశద మొనర్చు దాశరథి వేళ్ళులతో పతిదేవతామణీ !

అబ్బాయి కలవరిస్తున్నా డని. తల్లి పరుగెత్తుకుంటూ వచ్చి రక్ష పెడుతుంది.

## శ్రీకృష్ణ రామాయణము

కవి సార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు దీనిని రచించారు. శ్రీశాస్త్రిగారు భారత - భాగవత - రామాయణములను ఒక్కచేతిమీదుగా వ్రాసి తమ నామమును జోడించి వానికి "శ్రీకృష్ణభారతము" "శ్రీకృష్ణభాగవ

తము" "శ్రీకృష్ణ రామాయణము" అని పేరు పెట్టారు.

వీరి రామాయణం సరిక్రొత్త మార్గంలో నడచింది. మూల రామాయణంలో లేని వాల్మీకి పూర్వ చరిత్రము, కౌసల్యాదశరథుల కల్యాణ వృత్తాంతము, దశరథుని మృగయావిహారము, శాపప్రాప్తి, శాంత పుట్టుక, రావణాదుల జననము, జైత్రయాత్రలు, వేదవతి వృత్తాంతము అన్నీ బాలకాండలోనే ప్రారంభించి చెప్పారు. జయవిజయుల శాపవృత్తాంతము కూడ జోడించినారు.

ఇందు అహల్య నిర్దోషురాలు. కైకేయి నిష్కళంక. పుత్రశోకార్త యైన శూర్పణఖకు సీత ఆశ్రయ మిస్తుంది. రావణుడు గడ్డతో పెకలించి సీతను తీసుకువెళ్లతాడు. శబరి ఎంగిలిపండ్లు రామునికి పెడుతుంది. సీతాదేవి భూప్రవేశం లేదు. రామనిర్యాణం జరగదు. అంతా సుఖాంతం.

శ్రీశాస్త్రిగారి కవితా మాధుర్యానికి ఒక పద్యం -రావణుడు సీతతో-

కైలాసం బరకేల నెత్తితిని; నాకవ్రాతమున్ మొత్తితిన్!
గీలిం గట్టితి గాలి బట్టితి; యమున్ గింపాకునిం జేసితిన్;
భూలోకంబున గాక నాల్గుపదియై పొల్పొందు లోకంబులన్
నాలా వన్నను బిచ్చలింతురు జనుల్ నానాప్రకారంబులన్.

## గోవింద రామాయణము

శ్రీమాన్ ఆత్మకూరి గోవిందచార్యులుగారు తమ పేరుతో "గోవింద రామాయణం" రచించారు. వీరు జాతీయ సమర వీరులు. గాంధేయులు. వీరి వేషములాగానే వీరి కవిత్వంకూడా నిరాడంబరం. ఉత్తరకాండతో ఏడుకాండలు పూర్తిగా వ్రాశారు. ఆచార్యులవారి అనర్గళకవితాధారలో రసదృష్టితో పాటు రాజకీయ దృష్టికూడా చోటు చేసుకున్నది. వీరు శ్రీరామచంద్రుని ఆదర్శ ప్రభువుగా చిత్రించారు. రామరాజ్యాన్ని దర్శించి ప్రదర్శించారు.

## సుభద్రారామాయణము

సుభద్రా రామాయణాన్ని రచించినవారు శ్రీమతి సీరము సుభద్ర యాంబగారు. ఈమె శ్రీ సెట్టి లక్ష్మీనరసింహంగారి సోదరి. ఈ రామాయణంలో షట్కాండలు ఉన్నవి. 2000లకు పైగా పద్యాలు ఉన్నవి. సుభద్రాంబగారి పద్యాలు ముద్దులు మూటగట్టుతూ రాయంచలవలె నడుస్తాయి.

పుత్రవిరహం సహించలేని దశరథుడు అంటున్నాడు-

ఉల్లము పల్లవింప మృదులోక్తులు పల్కుచు నా సమక్షమం
దల్ల కళానిధిం దెగడు నాస్యరుచుల్ వెదజల్లి నాకనుల్

చల్లగఁజేయు నా యనుగు చక్కనిరాముఁ డరణ్యసీమలోఁ
దల్లడ మందుచున్ దిరుగఁదాల్పగలాడనె మేనఁబ్రాణముల్!

తపస్వియైన వేదవతిని దనుజేంద్రుడు రావణుడు ప్రశ్నిస్తున్నాడు-

ఈ యెలజవ్వనంపుజిగి! ఈ సుకుమారత! ఈ విలాస! మీ
సోయగ! మీ శరీరనవశోభ! సురోరగమానవాళిలో
నే యలివేణులందయిన నేను గనుంగొన లేదు నిక్క! మీ
ప్రాయము కాయ మి ట్లడవి పాలగు వెన్నెలఁ జేయ న్యాయమే?

## సరస్వతీ రామాయణము

దీనిని రచించిన వారు శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారు. కమ్మని కవితాగుణ మెరిగిన "కవి కలహంసి" ఈమె. వీరు ఉత్తరకాండము కూడా కలిపి ఏడుకాండలు సమగ్రంగా రచించారు. ఈ రసవత్తర రామాయణంలో 1900 పద్యాలు ఉన్నవి. వీరి పద్యాలలో చక్కని చిక్కని తెనుగుదనం జాలువారుతూ ఉంటుంది. పోతన్నగారి ఒరవడితో సాగిన ఈ పద్యం సీతతో ఆంజనేయుడు అనేది-

నల్లని మేనివాడు, చిఱునవ్వులు చిల్కెడి మోముతోడ శో
భిల్లెడువాడు, చక్కనగు పీవరవక్షము వాడు, సోగలౌ
పుల్ల సరోజపత్రములఁ బోలు కనుంగవవాడు, లోకమున్
జల్లగ నేలువాడు, కరుణానిధి శ్రీరఘురాము డమ్మరో!

వాల్మీకాశ్రమంలో వదలబడిన సీత లక్ష్మణునితో అంటుంది-

వా క్కెటు లాడెనో! మనసు వజ్రమయం బయిపోయెనో! కటా
మక్కువ మాయమయ్యెనో! కుమార! స్వసౌఖ్యముఁ గోరియైన న
న్నక్కడ నిల్పడయ్యె గద! హా! యిక నేటికి మేనఁ బ్రాణముల్!
వ్రక్కలుగాదు నాది మది వజ్రమొ యిట్టి కఠోరవార్తకున్!

## మానికొండ రామాయణము (తెలుగు వాల్మీకము)

ఈ రామాయణం శ్రీ మానికొండ సత్యనారాయణశాస్త్రిగారు రచించారు. వీరు తమ గ్రంథానికి "తెలుగు వాల్మీక" మని పేరుపెట్టారు. షట్కాండలు పూర్తిచేసి ఇష్టదైవమైన శ్రీరామచంద్రుని చరణాలపై సమర్పించారు. శాస్త్రిగారి రచన చాలా సరసంగా సహజంగా సరళంగా సాగింది. సుప్రసిద్ధాలైన వాల్మీకి రామాయణ శ్లోకాలకు వీరి అనువాదం చిత్తగించండి-

సరస కవితా మహీరుహశాఖ నెక్కి

"రామరామా" యటంచు నిరంతరంబు
మధుర మధురాక్షరంబుల మధురఫణితి
కూయు వాల్మీకి కోకిలకును "నమోఽస్తు".

వేదవేద్యుండు పురుష దవ్విభుడు పరుడు
దశరథాత్మజు డగుచు నిద్ధర జనింప
వేద ముదయించె వాల్మీకి ఋషి ముఖమున
నవని సాక్షాత్తు రామాయణాఖ్య మగుచు.

ఓ నిషాద। ప్రతిష్ఠ నీ వొందవోయి।
శాశ్వతంబైన వత్సర సముదయంబు
వధ మొనర్చితి వీ క్రౌంచమిధునమందు
కామమోహిత మేకమ్ము నే మనందు.

"ప్రతిష్ఠ నీ వొందవోయి!" అన్నప్పుడు" నీవు ప్రతిష్ట పొందవు లేవోయీ అనీ, "నీవు ప్రతిష్ఠ పొందవలసిన దోయీ" అనీ రెండు అర్థాలు "ఓ నిషాద" అన్నప్పుడు "మా విషాద" అన్నప్పటిలాగే రెండు అర్థాలూ వస్తాయి. 'ఓ' అనగా 'లక్ష్మి' అని అర్థం ఉందట. ఈ విధంగా సంస్కృత శ్లోకంలో ఉన్న శ్లేషను ఎంతో సున్నితంగా తెలుగులో పలికించారు శ్రీ శాస్త్రి గారు. తెలుగు వాల్మీకం యథా వాల్మీకంగా ఉండాలని వీరు అనుష్టుప్పులకు అనుగు చుట్టాలైయిన తేటగీతులల్లో ఆటవెలదుల్లో కలం నడిపారు. వీరు కావాలనే అక్కడక్కడ ఛందోనియమాలు ఉల్లంఘించారు. వీరి రచన సరళ సుందరమై చవులూరుతూ ఉంటుంది.

## యోగానందాంధ్ర రామాయణము

ఇందులో 1100 ల గద్య పద్యా లున్నవి. శ్రీ చిల్లరిగె యోగానందయ్య పంతులుగారు దీనిని రచించారు. వాల్మీకి రామాయణాన్ని అనుసరించిన వీరి రామాయణం పండిత పామర రంజకమై పరిఢవిల్లుతున్నది. అహల్య ఘట్టంలో మాత్రం వీరు ఇంద్రుణ్ణి కోడిపుంజు చేసి "కొక్కొరో కో" అని కూయించారు-

చొరబడి, యెక్కి కుటీరము,
వెరవున నెఱకలు విదిల్చి, వేగిన దని "కొ
క్కొరొకోకో" యని యఱవగ
సరిదాప్లావార్థము ముని చయ్యనఁ జనియెన్.

## జగన్నాథ రామాయణము

శ్రీ తంగిరాల జగన్నాథశాస్త్రిగారు దీన్ని రచించారు. పార్వతికి శివుడు

రామచరిత్ర చెబుతాడు. సుకన్యా వృత్తాంతం, అరుంధతి సీతను శపించటం మొదలైన విశేషాలు కూడా ఉన్నాయి. వీరిది ప్రసన్న మధురమైన శైలి. మచ్చున కొక పద్యం - గుహుడు శ్రీరామునితో అంటాడు - గంగదాటిస్తూ-

ఏనును నీవు నొక్కటియె వృత్తిగలారము రామ! నేను గం
గానది దాటఁ జేయు దు; నఖండభవాబ్ధిఁ దరియింప జేయగాఁ
బూనితి వీవు; నావికులు మూల్యము నొక్కరియొద్ద నొక్కరుం
డూనుట లేదు! ధర్మ మదియున్ మఱి కాదు! నిజంబు నమ్ముమా!

గ్రంథమంతా మృదుపద విన్యాసంతో హృదయంగమంగా నడిచింది.

దాశరథి విలాసము

కొత్తపల్లి అచ్చయ్యకవి రచించారు. 19 శతాబ్దంవాడు. ఇందులో 7 ఆశ్వాసాలు ఉన్నవి. సుమనోజ్ఞమైన ఈ కృతి తిరుపతి వేంకటేశ్వరస్వామికి అంకితం.

రామోదయము

చిన్నయసూరి కాలంవాడని భావింపబడుతున్న రంగయకవి "రామోదయ" మనే రామాయణం రచించినాడు. ఒడుదుడుకులు లేని సహజ సుందరమైన రచన. అక్కడక్కడ శ్రీరాముని భగవత్తత్వం నిరూపితమౌతూ ఉంటుంది. శివధనుర్భంగ సందర్భంలో శ్రీరామచంద్రునితో విశ్వామిత్రుడు అనే పద్యమిది-

ఆదివరాహంబై యి
మ్మేదిని నొక కోఱ నిల్పి మెఱసిన నీ కీ
పేద యగు ధనువు నెత్తగ
రాదే! యెక్కిడగదయ్య! రాజీవాక్షా!

అధ్యాత్మరామాయణం రంగనాథరామాయణం భాస్కరరామాయణం మొదలైన వానిలోని కొన్ని విశేషగాథలు ఇందులో చోటు చేసుకున్నాయి.

"సంగ్రహముగాక మిగుల విస్తరము గాక
పుడమి పండిత పామర బోధకముగ
పద్యఫణితిని శ్రీరామభద్రు కథను
ఎఱుగ బల్కుము మా పేర నింపుమీఱ"

అని రంగనాథస్వామి స్వప్నంలో ఆదేశింపగా రంగయ్యకవి ఈ రామోదయం రచించాడు.

## శ్రీమద్రామాయణ కల్పవృక్షము

"కవి సమ్రాట్" శ్రీవిశ్వనాథసత్యనారాయణ గారి అమరకృతి యిది-
"వ్రాసిన రామచంద్రుకథ వ్రాసితివం చనిపించికో వృథా
యాసముగాక కట్టుకథ లైహికమా ! పరమా !" అన్న తండ్రిగారి అనుశాసనమూ తనలోని ఉత్కంఠా రెండూ సమైక్యం కాగా విశ్వేశ్వరాంకితంగా దిద్దుకొన్న విశ్వనాథవారి రచన ఇది.

"నా మార్గంబును గాదు వీని దరయన్ నాతాత ముత్తాతలం
దేమార్గంబును గాదు" అని కవితా గురువులు చెళ్లపిళ్లవా రన్నట్లు ఒక వినూత్నమైన విచక్షణమైన విచిత్రమార్గం విశ్వనాథ వారిది. సన్నివేశ కల్పనలో పాత్ర పోషణంలో రసోన్మీలనంలో శ్రీ సత్యనారాయణగారిది విశిష్టదృక్పథం. ఇంతకుముందే వీరి రామాయణాన్ని గూర్చి మిత్రులు ప్రసంగించే యున్నారు కనుక వారి ప్రతిభకు "జయపతాకలైన" ఒకటి రెండు పర్యాయములు మనవి చేస్తాను —

తోరణము కట్టిన కత్తిని
గోరదమున మంత్రసాని కోసెను బొడ్డున్
నీరజము కాదఁ జిదిమిన
నేరిమిని గలుక్కుమనె మనీషన్ విధియున్.

పసిరాముని బొడ్డుకూ బ్రహ్మదేవునికీ ఉన్న బంధుత్వాన్ని పసికట్టిన "బ్రాహ్మీమయమూర్తి" శ్రీవిశ్వనాథ.

మరొక్క చక్కని సన్నివేశం. సంధ్యాకాలం. పక్షులు సంచరించే సమయం. అప్పుడు-

'వెలికిఁ గొనిరాకుఁడీ బిడ్డఁ బిట్టలాడు
సంజవేళల' నంచుఁ గౌసల్య పలుక
గరుడి వైకుంఠమున భయకంపితుండు
మడమలను ద్రొక్కుకొను రెక్క ముడుచుకొనును.

పాపం, ముడుచుకోక ఏం చేస్తాడు మరి! అవి అంత పెద్ద రెక్కలాయె. పొరపాటుగా ఆ నీడ తన స్వామి మీద పడితే ఇంకేమన్నా ఉన్నదా ?

మొలచెదు చిపుళ్ల కండూతి సెలవులఁ జన
నురుసు, శ్రీరామచంద్రుండు నొక్కినంత
కందిగింజయ్యెఁ గోసలక్ష్మాతలేంద్రు

సుత 'జగన్నాథ' మౌ స్తన చూచుకంబు.

ఈ 'జగన్నాథ' దర్శనం విశ్వనాథ ప్రతిభాచక్షుస్సుకు నిదర్శనం.

రామచంద్రుండు సర్వమూర్ధంబు చేతు
లొత్తి చూచును పూరుషు లెత్తికొనిన;
లక్ష్మణుడు ముక్కులును జెవుల్ తడిమి చూచు
నెవ్వరే నంగనలు దన్ను నెత్తికొనిన.

ఈ మనస్తత్వ పరిజ్ఞాన ప్రజ్ఞావిశేషమే మహాకవిని చేసింది విశ్వనాథ వారిని. అత్రిఆశ్రమంలో విమానం బయలుదేరుతూ ఉంది. అంతలో 'ముని పత్ని అనసూయాదేవి నడచి వచ్చి శ్రమ పడుచు మెట్లెక్కి రెండుఫలంబులు సీత చేతిలో నిడి దిగిపోవుచుండ సీత యా ఫలంబులు రాముని చేతి కిచ్చి ఆమెను మెట్లు దించి' వచ్చిందిట. 'కవిః క్రాంతదర్శీ'. చాలు! విశ్వనాథవారు ఉత్తర కాండం వ్రాయకపోయినా వ్రాసినట్లే.

## ఉత్తర రామాయణములు

అమలమూ ఉదాత్తమూ అయిన మనీషతో ఉభయకావ్యప్రౌఢిని పాటించే అనల్ప శిల్పంతో తిక్కన్నగారు. వాల్మీకి రామాయణంలోని ఉత్తరకాండను నిర్వచన పద్యకావ్యంగా ఆంధ్రీకరించారు. అదే "నిర్వచనోత్తర రామాయణం." మూలంలో ఉన్న 110 సర్గలలోని 3276 శ్లోకాలను 10 ఆశ్వాసాలలో సుమారు 1300 పద్యాలలో కుదించి "అలతి అలతి తునియల కాహల సంధించి"నట్లు రచించారు తిక్కన్నగారు (1210-1300)

చొత్తెంచిన వనపాలిక
మత్తమధుపములకుఁ దప్పి మధుభరితంబై
క్రొత్తావి గ్రమ్ము నరవిరి
గుత్తి విభున కిచ్చె వినయకుంచిత తనువై.

వైదేహీ సహితుడై వనవిహారానికి వచ్చిన శ్రీరామునికి వనపాలిక క్రొత్తావుల విరిగుత్తి కానుకగా సమర్పించింది. తిక్కనగారు "ధీరోదాత్త నృపోత్తముని సద్వృత్త"మైన "ఉత్తరరామాయణ" మనే ఈ నెత్తావుల పూలగుత్తిని ప్రాజ్ఞ రసజ్ఞులకు బహూకరించారు.

తిక్కన్నగారి అనంతరం 350 సంవత్సరాలకు కంకంటి పాపరాజుగారు (1575-1630) ఉత్తర రామాయణం రచించారు. ఈయన తన మహా ప్రబంధాన్ని ఎనిమిది ఆశ్వాసాలుగా విభజించి సుమారు 3000 గద్య పద్యాలలో

విస్తరించి ప్రస్తరించి వ్రాశారు. తిక్కన్నగారు తమ కృతి సుఖాంతంగా ఉండాలని శ్రీరామ నిర్యాణం ప్రస్తావించలేదు. కంకంటివారు శ్రీరాముని అవతార సమాప్తి వర్ణించి సీతారాములు లక్ష్మీనారాయణులై వైకుంఠములో కలుసుకొన్నట్లు చెప్పారు. తిక్కన్నగారు విడిచిన ఘట్టాలు కుర్కురోపాఖ్యానం, ఉలూకోపాఖ్యానం, కుశలవ పట్టాభిషేకం, దుర్వాస ప్రవేశం మొదలైనవి గ్రహించారు కంకంటివారు.

కంకంటివారి కవిత్వం తత్సమ పద భూయిష్ఠమై ధారాశమై ఉత్తుంగ గంగా తరంగిణివలె పొంగి పొరలి ప్రవహిస్తుంది. సీత లక్ష్మణుడితో అంటుంది-

ఆకర్ణాయతినేత్రమై మణిమయోద్యత్కుండలద్వంద్వంలో
భాకీర్ణాంచితగల్లమై సురదనంబై సుందరభ్రూయుతం
బై కమస్మితచంద్రికావిలసితంబై యొప్పు శ్రీరాము మో
మీ కాయంబునఁ జూచుభాగ్యమిఁక లేదేమో సుమిత్రాత్మజా!.

ఘట్టు వేంకట రామకృష్ణకవి అనేవారు కూడా ఉత్తర రామాయణ కథను "పట్టాభిరామాయణం" అన్న పేరుతో ఆరాశ్వాసాల ప్రబంధంగా రచించారు ధారాశుద్ధి గల రచన ఈయన 1800 సం॥ పూర్వమువాడని విమర్శకుల అభిప్రాయం.

ఉపాఖ్యాన రామాయణములు

ఆంధ్రమహాభారతం అరణ్యపర్వంలో దాదాపు 300 గద్యపద్యాలలో ఎఱ్ఱాప్రెగ్గడ రచించిన రామాయణకథ ఉన్నది. దీనిని మార్కండేయ మహర్షి ధర్మరాజుకు చెప్పినాడు. ఇదే విధముగా ఆంధ్రమహాభాగవతములో నవమ స్కంధములో సుమారు 100 పద్యములలో బమ్మెరపోతన్నగారు రామాయణ కథ అంత్యానుప్రాసమహితముగా వర్ణించారు. జైమిని భారతములో పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు రచించిన ఉత్తర రామాయణగాథ ఉన్నది, ఇందు కుశలవులు అశ్వమేధాశ్వాన్ని పట్టిన వృత్తాంతం రసవత్తరంగా వర్ణింపబడింది.

చంపూ రామాయణములు

సంస్కృతంలో భోజదేవుడు సుమనోమనోహరముగా రచించిన చంపూ రామాయణాన్ని ఋగ్వేదకవి వేంకటాచలపతి, అల్లమరాజు రంగశాయి, బులుసు సీతారామకవి, పూసపాటి రంగనాయకామాత్యుడు, జయంతి రామయ్య పంతులు, బుద్ధవరపు మహాదేవుడు మొదలైన కవివరేణ్యులు తెలుగులో అనువాదం చేశారు.

ఈ సందర్భంలో భవభూతి కృతికి అనుకృతియైన సీరము సుభద్ర యాంబగారి "ఉత్తరరామచరిత" పద్యకావ్యమూ, "జానకీపరిణయ" సంస్కృత నాటకానికి పద్యానువాదమైన శ్రీ వంగీపురపు వేంకటశేషకవిగారి "శ్రీశేష రామాయణమూ" పేర్కొనదగినవి.

## ఆనందరామాయణము

అత్యద్భుత సన్నివేశ సమలంకృతమైన ఈ సంస్కృత రామాయణాన్ని గుండు లక్ష్మణకవి పద్యకావ్యంగా ఆంధ్రీకరించినాడు. నూతలపాటి పేరరాజు గారు దానిని గద్యములోనికి అనువదించారు.

## అధ్యాత్మ రామాయణములు

పరమశివుడు పార్వతికి చెప్పినట్టుగా సంస్కృతములో రచింపబడిన ఆధ్యాత్మరామయణాన్ని శ్రీయుతులు కంచర్ల శరభకవి, కాణాదము పెద్దన సోమయాజి, మామిడన్న సుభద్రాంబ, బులుసు వేంకటేశ్వర్లు మొదలగు పదునైదుగురు కవులు వేరు వేరుగా ఆంధ్రీకరించారు. మునిపల్లి సుబ్రహ్మణ్యకవిగారు కీర్తనలుగా అనువాదం చేసారు. అవే తెనుగుదేశంలో ప్రఖ్యాతిపొందిన అధ్యాత్మ రామాయణ కీర్తనలు.

## యథాశ్లోక తాత్పర్య రామాయణము

గద్వాల సంస్థానాధిపతి సోమభూపాలుడు తన ఆస్థానంలోని అరుగురు కవులచేత ఆరు కాండములు అనువాదం చేయించిన రామాయణమిది. 1793 సం॥ ప్రాంతపు రచన.

## మాలికా రామాయణము

ఒక్కొక్క కాండమును ఒక్కొక్క వృత్తముతో ఒకే ప్రాసతో చివరంటా ఆరుగురు పేరెన్నికగన్న కవులు అందంగా రచించిన గ్రంథం మాలికా రామాయణం. శ్రీయుతులు ఆకుండి వెంకటశాస్త్రి, పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి, దేవగుప్తాపు వేంకటరమణ కవిరాజు, చింతలపూడి సన్యాసిరావు, మూలా పేరన్న శాస్త్రి, ఉప్మాక నారాయణమూర్తి అను కవిషట్కం కమనీయంగా ఏర్చి కూర్చిన రామకథా మాలిక యిది.

## వచన రామాయణములు

శ్రీయుతులు వావిళ్ళ రామస్వామి శాస్త్రిగారు, దేవరాజసుధీ, నోరి గురులింగశాస్త్రి, దొడ్డా వెంకటరామిరెడ్డి, సరస్వతుల సుబ్బరామశాస్త్రి. మోదేపర్తి గున్నయ్య మున్నగువారు సులభగ్రాంథికంలో "వచనరామాయణాలు" రచించారు. శ్రీనివాసశిరోమణి, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, పురిపండా

అప్పలస్వామి, ఉషశ్రీగార్లు శిష్టవ్యావహారికంలో గద్య రామాయణాలను హృద్యంగా వ్రాశారు. శ్రీ కల్లూరి చంద్రమౌళి గారి "రామాయణ సుధాలహరి" ధర్మవరము సీతారామాంజనేయులు గారి ''ఆంజనేయ రామాయణం" రామాయణంపై పరిశీలనాత్మకాలైన రసవద్రచనలు.

తులసీరామాయణము

మహా పండితుడైన "మధుసూదన సరస్వతి"చే
"ఆనందకాననే హ్యస్మిన్ జంగమ స్తులసీతరుః
కవితామంజరీ యస్య రామభ్రమర భూషితా."

అని పొగడ్త లందుకొన్న తులసీదాసు హిందీభాషలో "శ్రీరామచరితమానసం" అనే మహాగ్రంథం రచించారు. ఈ తులసీరామాయణాన్ని శ్రీ భాగవతుల నరసింహాశర్మ, శ్రీ మైలవరపు సూర్యనారాయణమూర్తి పద్యకావ్యంగా ఆంధ్రీకరించారు. శ్రీమతులు యేలూరిపాటి లక్ష్మీసరస్వతి, నేలనూతల పార్వతీ కృష్ణమూర్తి, శ్రీ శ్రీనివాసశర్మ గద్యంలోకి అనువదించారు. శ్రీ కేశవతీర్థస్వామి శ్రీ పాటీలు తిమ్మారెడ్డి ఉభయులూ కలిసి "శ్రీరామచరితమానసము'' అనే పేరుతో తులసీరామాయణాన్ని ద్విపద కావ్యంగా దిద్దితీర్చారు.

విచిత్ర రామాయణము

శ్రీ సిద్ధేంద్రయోగి ఉత్కళ (ఒరియా) భాషలో రచించిన విచిత్రరామాయణాన్ని శ్రీ డొంకా గోపీనాథకవి 1670 ప్రాంతంలో గద్యకావ్యంగా ఆంధ్రీకరించాడు. దాన్ని అనుసరించి శ్రీయుతులు తుమురాడ పాపకవి, నరసింహదేవర వేంకటశాస్త్రి, కొమ్మాజీ సోమనాథ శిల్పాచార్యుడు, వేల్పూరి వేంకటకవి పద్యకావ్యాలు రచించారు.

కంబ రామాయణము

దీనిని రచించిన కంబకవి రాజరాజనరేంద్రుని మునిమనుమడైన కుళోత్తుంగుని ఆస్థానం అలంకరించినవాడు. "కవి చక్రవర్తి" బిరుదం కలవాడు. "కంబని యింటి కంబమును క్రమకవిత్వము చెప్పు''నన్న ప్రశంస అందుకున్న మహాకవి. ఈ తమిళ రామాయణాన్ని శ్రీ పూతలపట్టు శ్రీరాములు రెడ్డిగారు పద్యకావ్యంగా అనువదించారు. మృదు మధుర పద విన్యాసాలతో ముచ్చటగా రచించిన ఈ రామాయణాన్ని శ్రీ రెడ్డిగారు తమ ఇలువేలుపైన శ్రీరామచంద్రమూర్తికే సమర్పించి ధన్యులైనారు.

వివాహానికి ముందే సీతారాములు ఒండొరులు చూచుకొని ప్రేమించుకుంటారు. రావణుడు సీతను పర్ణశాలతో కూడా పెళ్ళగించుకుని పోతాడు. వాలి

వధానంతరం తారను సుగ్రీవుడు పత్నిగా స్వీకరించక తల్లిగా గౌరవిస్తాడు. ఇత్యాది వినూత్న విశేషాంశాలు కంబ రామాయణంలో ఉన్నవి.

ఇలా ఎందరో మహానుభావులు రామాయణాలు వ్రాసి ఉంటారు, శ్రీ గడియారం వేంకటశేషశాస్త్రిగారు రామాయణం రచించినట్లు తెలుస్తుంది. శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులవారు తమ జనప్రియ రామాయణాన్ని పూర్తి చేశారని వినవస్తుంది. శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు సుందరకాండ పర్యంతం రామాయణం వ్రాశారుట. శ్రీ కోపల్లె శివకామేశ్వరరావుగారు బాలకాండపర్యంతం రామకథ రచించారు. శ్రీ ధనకుధరం వేంకటాచార్యులు తమ "ధనకుధరరామాయణం" త్వరలో పూర్తిచేయనున్నారు. శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారు "గీత రామాయణము" అనే పేరుతో తేటగీతులతో పండిత పామర రంజకంగా రామాయణం రచించుతున్నారు.

ఈవిధంగా రామాయణం తెలుగుదేశం నలుమూలలా వెలుగులు వెదజల్లింది. భారతీయ భాషలన్నింటిలో వ్యాపించింది. ఖండఖండాంతరాలలో ప్రవేశించింది. విశ్వవిహారం చేస్తున్నది.

బ్రహ్మదేవుడు వాల్మీకి మహర్షితో అన్నాడు-

"యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే
తావద్ రామాయణకథా లోకేషు ప్రచరిష్యతి."

"భూమిపై కొండ లున్నంతకాలం, నదులు ప్రవహిస్తున్నంతకాలం రామకథ ఈ విశాలవిశ్వంలో విరాజిల్లుతూ ఉంటుంది." ఇది బ్రహ్మ వాక్కు — దీనికి తిరుగులేదు.

—o—

# రామాయణ కల్పవృక్షం

## -డాక్టర్ జి.వి.సుబ్రహ్మణ్యం

'మఱల నిదేల రామాయణం బన్నచో
నీ ప్రపంచక మెల్ల నెల్లవేళఁ
దినుచున్న యన్నమే తినుచున్న దిన్నాళ్లు
తన రుచి బ్రతుకులు తనవి గాన
చేసిన సంసారమే సేయుచున్నది
తన దైన యనుభూతి తనది గాన
తలఁచిన రామునే తలఁచెద నేనును
నా భక్తిరచనలు నావి గాన
కవిప్రతిభలోన నుండును గావ్యగతశ
తాంశములయందుఁ దొంబది యైన పాళ్లు
ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయి
రెట్లు గొప్పది నవకథాదృతిని మించి.'

వాల్మీకి రామాయణం వ్రాసిన తరువాత మఱల రామాయణాన్ని ఎందుకు వ్రాయాలి? - అన్న ప్రశ్న ఇప్పటిది కాదు. శతాబ్దాలతరబడి సహస్రాధిక రామాయణాలను రచించిన కవుల కందరికీ వర్తించే ప్రశ్న యిది. భారతీయ సాహిత్యాలలో బహుప్రక్రియల్లో బహుళంగా వెలసిన రామకథ యేయే ప్రయోజనాలను సాధించటానికి ప్రవర్తిల్లిందో ఆయాకావ్యాకర్తలు వారివారి కృతుల్లో వివరించుకొంటూనే వస్తున్నారు. చెప్పినకథనే మరల చెప్పదలుచుకొన్నప్పుడు కవికిగాని, లోకానికిగాని చెప్పుకోదగిన విశేష మేదో ఉండాలి. అప్పుడే అది సార్థక మౌతుంది. ప్రక్రియకోసం, నూత్నకల్పనలకోసం, స్వీయమతసమన్వయం కోసం, తత్వావ్యాఖ్యానం కోసం, సమకాలీన సమస్యల పరిష్కారం కోసం, సార్వకాలీన ధర్మపునఃప్రబోధం కోసం, దేశీయ సాహిత్య

వికాసం కోసం, చివరకు పుణ్యం కోసం - ఇలా ఎన్నో ప్రయోజనాల నుద్దేశించి ఆయాయుగాలలో రామకథను కవికోకిలలు గానం చేస్తూ వచ్చారు. సామాజికు లాదరిస్తూ వచ్చారు.

ఆధునికాంధ్రకవి యైన విశ్వనాథ సత్యనారాయణగారు శ్రీమద్రామాయణ కల్పవృక్షమును రచించారు. మరల నిదేల రామాయణము ? అన్నప్రశ్న ఆయనకు గూడ ఎదురౌతుంది. దైవప్రార్థనం ముగియగానే దీనికి సమాధానం చెప్పా రాయన. సమాధానంలో ఉన్న సారాన్ని గుర్తించిన సహృదయులూ ఉన్నారు, సంప్రదాయ ఛాందస మని చప్పరించినవారూ ఉన్నారు సమకాలీనులలో.

ఆధునికులలో 'మఱల రామాయణ మెందుకు' అని ప్రశ్నించేవారు పలురకములవారుగా నున్నారు. రాముడు దేవుడని నమ్మే విశ్వాసాన్ని త్రోసిరాజంటారు నాస్తికులు. రామాయణ మితిహాసము, చారిత్రకసత్య మనే భావాన్ని కాదంటారు హేతువాదులు. రామకథలో మార్క్సిస్టు దృక్పథం లోపించిందంటారు సామ్యవాదులు. వేదార్థబృంహితమైన కావ్యం కాబట్టి రామాయణాన్ని కాదంటారు వేద విరోధులు. చాతుర్వర్ణ్య వ్యవస్థనూ, బ్రాహ్మణ ప్రాధాన్యాన్నీ బలపరుస్తుంది కాబట్టి ఆధునిక కాలానికి అతక దంటారు వర్ణరహిత సమాజాన్ని వాంఛించేవారు. ఆర్యుడైన రామునికి ద్రావిడుడైన రావణునికంటె అధిక్యం చెప్పబడింది కాబట్టి దక్షిణాదివారికి రామాయణ ముపాదేయం కాదంటారు ద్రావిడజాత్యభిమానులు. రామాయణంలో సాంఘికస్పృహ కానరా దంటారు సామాజికవాదులు. సామాన్య మానవ సమస్యలు రామాయణంలో అంతగా లేవంటారు మానవతావాదులు. ఆదర్శమానవవాదం ఆరాధనకు పనికివచ్చునంతగా ఆచరణకు యోగ్యం కాదంటారు లౌకికవాదులు. రామాయణంలోని పరమార్థాన్ని గుర్తించలేరు ఇహపరాల్లో ఇహాన్నే గుర్తించే భౌతికవాదులు. వీరి వాదాలన్నీ విశ్వనాథ కెంత వర్తిస్తాయో వాల్మీకికిగూడా అంతే వర్తిస్తాయి. అయితే విశ్వనాథనుగూడా సూటిగా ప్రశ్నించే సమకాలీను లున్నారు. వారిలో మొదట పేర్కొనదగినవారు అభ్యుదయవాదులు. సంప్రదాయవిచ్ఛేదమే అభ్యుదయానికి మూలసూత్ర మని నమ్మేవారు. అదే యీ యుగధర్మ మని విశ్వసించేవారు. అభ్యుదయభావం సమాజంలో బహుముఖంగా వ్యాపించి ఉంది. ఆలోచనకూ, ఆచరణకూ సంబంధించింది ఒక శాఖ, రచనకూ భాషకూ సంబంధించింది మరొక శాఖ. ఆలోచన సంస్కృతికీ, ఆచరణ నడవడికకూ ముడిపడి

ఉంటాయి. పాశ్చాత్యసంస్కృతివిశేషాలనూ, ఆధునిక హేతువాదదృక్పథాన్నీ మేళవించుకొని భారతీయసంస్కృతిలో, ఆలోచనవిధానంలో మార్పు రావాలని అభిలషిస్తున్నారు ఆధునికులు. మూఢవిశ్వాసాలకూ, అర్థంలేని ఆచారాలకూ స్వస్తిచెప్పి ఆధునిక నాగరికతకు ఆలవాలమైన సమసమాజవ్యవస్థకు నాంది నాలపించాలంటారు కొందరు. వర్గసంఘర్షణను బలపరిచే ప్రాచీనవ్యవస్థను సమూలంగా మట్టంచేసి ఆర్థికసమానత్వం ప్రాతిపదికగా సమసమాజవ్యవస్థను సరిక్రొత్తగా రూపొందించా లని ప్రయోగాలు చేస్తున్నారు కొందరు. దానిని సాయుధవిప్లవంద్వారా సాధించవచ్చునని కొందరు, శాంతివిప్లవంద్వారా సాధించవచ్చునని కొందరు భావిస్తున్నారు. అభ్యుదయంతో పాటు అంతర్వాహినిగా ప్రవహించే మానవత్వపువిలువలను కూడా పరిరక్షించా లంటున్నారు కొందరు. ఏ నూత్న ప్రయోగమైనా దేశసంప్రదాయంలోనుంచే ప్రభవిల్లి వికసించినప్పుడే మూలబలం చేకూరుతుందని విశ్వసిస్తున్నారు కొందరు. భారతీయ సంస్కృతి సర్వయుగధర్మాలను మేళవించుకొని విశ్వమానవకోటికి శ్రేయోమార్గాన్ని ప్రసాదించగలదనీ, ఆయాయుగధర్మాల కనుగుణంగా దానిని తీర్చిదిద్దుకోవటమే అభ్యుదయ మనీ భావిస్తున్నారు కొందరు. అభ్యుదయాన్ని అందరూ కోరుతున్నా ఏమార్గంలో దాన్ని సాధించా లన్న ఆలోచనలో విభిన్నసిద్ధాంతాలకోలాహలం నేడు వినపడుతున్నది.

సమకాలికులలో కొందరు విశ్వనాథ అభ్యుదయవాది కాదనీ, ఫ్యూడల్ వ్యవస్థను బలపరచేవా డనీ, సంప్రదాయవాది యనీ భావిస్తున్నారు. విశ్వనాథ రామాయణానికి కాలదోషం పట్టిం దనేవారు వీరు. విశ్వనాథ తన దృక్పథాన్ని ఇలా వివరించారు–'If People say that I have no sympathy for modernism I can only pity them. I am not enemy of science and technology, the train, the phone, the plane, the T.V., the spacecraft,These are all irreplaceable. If you go thrhough my writings carefully and dispassionately you are sure to attribute to me unqualified admiration for the sort of government that the Russians have in their country. My ideal briefly stated is socialism plus God plus Religion. I may be defender of lost causes. But I think, it is better to cling firmly to some thing

that ia better to cling firmly to some thing that is within our reach than chase desperately that shall never be ours.'[1] ఆయన దృష్టిలో పక్షి ఎంతదూరం ఎగిరినా చివరకు చేరేది తనగూడే అని. ఎంత అభ్యుదయాన్ని మనం సాధించినా మనకు మూలబలం మన సంస్కృతియే అని, అలా కాకపోతే మన పయనం లక్ష్యంలేని సాధనమౌతుంది. నేలవిడిచిన సాము అవుతుందని. విశ్వనాథ అభ్యుదయవిరోధి కాడు అభ్యుదయసౌధానికి కూడా పునాదు లుండా లనీ, అవి మననేలమీదనే కట్టా లనీ అనేవాడు. బురుజులు కట్టే యత్నం అభ్యుదయవాదులు చేస్తుంటే పునాదులు గట్టిచేసే యత్నం ఆయన చేశాడు. పైకెక్కేవాడు కోటకొమ్మలు చూచి కేక వేస్తుంటే పునాదులు కదిలితే పుట్టుగతులుండ వని విశ్వనాథ ప్రబోధించాడు. అందువల్ల అభ్యుదయభవనానికి గోడ లెంత ముఖ్యమో పునాదులూ అంతే ముఖ్యం. ఈ దృష్టితో చూస్తే 'మఱల నిదేల రామాయణ' మన్న ప్రశ్నం రాద్ధాంత ముండదు.

తెలుగుసాహిత్య చరిత్రలో 1933-34 సం॥లకాలం చాల ఉజ్జ్వలమైన దని చెప్పాలి. ఒకవైపు శ్రీశ్రీ మహాప్రస్థానరచనం ప్రారంభించాడు. మరియొకవైపు విశ్వనాథ రామాయణకల్పవృక్షరచనం మొదలుపెట్టాడు. ఇద్దరూ సంఘధర్మానికి బొమ్మాబొరుసగా ఉన్న చైతన్యాలను స్వీకరించారు. ఒకరు వర్గరహితమై సమాజాన్ని ఆర్థికమైన అసమానత్వాలను తొలగించి సమసమాజాన్ని నిర్మించా లని ప్రబోధించారు. ఆర్థికాభ్యుదయాన్ని సాధించినా జాతిజీవనం ఆధ్యాత్మికధర్మచైతన్యంతో ముందుకు నడిచినప్పుడే మానవవికాసం సంపూర్ణమౌతుం దనీ, అది భారతీయసంస్కృతిసముద్ధరణంవల్ల సాధింపబడుతుం దనీ మరొకరు ప్రబోధించారు. ఒకరు ఆర్థికధర్మానికి ప్రాధాన్య మిస్తే మరొకరు హార్దికధర్మానికి ప్రాణం పోశారు. ఒకరు రచ్చగెలువు మని జాతి వెన్ను తట్టితే, మరొకరు ముందు ఇంటగెలవా లని హితవు చెప్పారు. మహాప్రస్థానంతో మానవసమస్యలన్నీ పరిష్కారం కావు. ఆర్థికాభ్యున్నతిని సాధించిన సమాజాలు ఆత్మశాంతికై అలమటించటం ప్రపంచంలో చూస్తున్నాం. అభ్యుదయానికి అవధి ఆత్మశాంతి. అభ్యుదయం ఉత్తాలమైన తరంగం; సంప్రదాయం గభీరమైనసముద్రం. తరంగహేలను శ్రీరంగం శ్రీనివాసరావు గారు

1. త్రివేణి Oct. Dec. 1971 శ్రీ ఎ.యస్. రామన్ చేసిన ఇంటర్వ్యూ. (బ్రాహ్మీ మయూరి).

ప్రదర్శిస్తే, సముద్రఘోషను విశ్వనాథ సత్యనారాయణగారు ప్రపంచించినారు. సంఘర్షణంమూలంగా విప్లవంబీజంగా సాధింపబడేసమత రే పేమౌతుందో తెలియంది. వర్గరహితసమాజం ఆదర్శసమాజం. అది భౌతికంగా సాధింపబడినా మఱల క్రొత్తవర్గాలు పుట్ట వనీ సంఘర్షణం రాదనీ చెప్పలేము. మనిషిలో స్వార్థం ఉన్నంతవరకూ సంఘర్షణ తప్పదు. ఈ రోజున్న వర్గాలు రేపు మారు రూపాలతో అవతరింపవచ్చు. అప్పుడు నూత్నవ్యవస్థ పాతవ్యవస్థను పాతి పెటుతూ చరిత్రగతిని ముందుకు సాగదీయవలసివస్తుంది. ఇది ప్రకృతిధర్మ మని అంగీకరించినా మనిషిబ్రతుకుకు పరమార్థ మన్నది లేకుండా పోతుంది. బ్రతుకులో అర్థ మొకటే పరమార్థ మైతే పరపీడనం తప్పదు పరపీడనరాహిత్యం ప్రభుత్వశాసనంవల్ల రాదు. ప్రజలమనఃపరిణామంవల్ల వస్తుంది. ఈ పరిణామం ధర్మదృష్టి సాధిస్తుంది. ధర్మంచేత అర్థకామాలను శాసింపగలిగితే సమసమాజం శాంతియుతంగా సాధింపవచ్చు. అందుకే మహాత్మాగాంధీగా రంటారు- 'Socialism is as pure as crystal. Thereforre-e quires crystal like means to achieve it. Impure means result in an impure end.' ధర్మానికి పరమార్థశక్తి లేకపోతే దానికి అర్థకామాలు వశంకావు. మనిషి తనను తాను జయించలేడు. తనను జయించుకో లేనివాడు లోకాన్ని ఉద్ధరించలేడు. ఆర్థికాభ్యున్నతిని సాధించినా తనలో తాను మేలుకోకపోతే మనిషి తన అభ్యుదయానికి అర్థం తెలియక ఆవేదన పడతాడు. నేటివిశ్వసమాజంలో అభివృద్ధిచెందిన సమాజాల్లో అటువంటిఆర్తి వినపడుతోంది. అన్నీ ఉండికూడా ఆధునిక మానవుని ఆర్తికి అర్థం ఏమిటి? 'నిజంగానే నిఖిల లోకం నిండుహర్షం వహిస్తుందా?' అన్నప్రశ్నకు సమాధానం ఏది? అర్థం హర్షన్ని కలిగించవచ్చు. దానికి నిండుదనం కలిగించేది ధర్మమూలమైన పురుషార్థం.

'ఎందును నేను గాని వగు నింద్రియసంతతియందు నేను మే
ల్కాందును నిద్రపోవుదును గాలువపల్లవుతూము లట్లుగా
బిందువుగూడ నోడ్చెడిని బెట్టుగ న న్నివి యోగిరాజ! నా
యందున నేను మేలుకొను టన్నది యున్నె? అనుగ్రహింపవే'

అన్న శ్రీరామునిప్రశ్నను కథనుండి విడదీసి చూస్తే ఆధునిక విశ్వమానవుని ఆర్తికి ప్రతిధ్వని. ఈ ఆర్తి ఇప్పటిదే కాదు. అనాదినుండీ వస్తున్నది. ప్రతియుగంలోనూ పరిస్థితులు మారినా మానవుని ఆత్మధర్మం అవిచ్ఛిన్నంగా

అతనిలో స్పందిస్తూనే ఉంది. ఆ స్పందన విశ్వజనీన మైనది, శాశ్వత మైనది. దాన్ని సంప్రదాయ మని త్రోసివేస్తే మనం ఆత్మను విస్మరించినట్లే. ఆత్మ ఆవరణాలను మార వచ్చును గాని, తాను మారదు. ఆవరణం నశింపవచ్చును గాని ఆత్మ నశింపదు. అలాగే విశ్వజనీన మైన స్పందనం కూడాను. దానిలో నిన్నటి మెప్పు గుప్పున గుబాళించవచ్చు; నేటిలోని నిప్పు భగ్గున మండవచ్చు; రేపటిలోని ఒప్పు రెక్కలు విప్పుకొనవచ్చు. ఇందులోని నేటి ధర్మం అభ్యుదయమైతే రేపటిధర్మానికి సంప్రదాయం. నిన్నలోనుండి పుట్టిన నేడు రేపటిలో లీనంకావటం సృష్టిధర్మం. అలాగే విప్లవం విశ్వజనీనమైన చైతన్యంలో విలీనం కావటం ప్రకృతిధర్మం. ఈ ప్రకృతిధర్మంలో నిత్యంగా నిలిచే చైతన్యం శాశ్వతధర్మం. దాన్ని విశ్వనాథ రామాయణంద్వారా ఆధునికలోకానికి అందించారు. దీన్ని గమనింపక కొందరు విమర్శకులు విశ్వనాథ సమాజాన్ని వెయ్యేళ్ళ వెనక్కు తీసికొనిపోతున్నా డని అంటారు. నిజ మేమిటంటే-వెయ్యేళ్ళ ముందుచూపును సమాజాని కందిస్తున్నాడు విశ్వనాథ! అందువల్లనే 'సర్వ ధర్మమూలబీజంబుగ నవిచ్ఛిన్నసంప్రదాయార్థినై రామాయణకల్పవృక్షాన్ని రచిస్తున్నా నని విశ్వనాథ పేర్కొన్నాడు.

ఇక అభ్యుదయవాదులు కొందరు విశ్వనాథరచనలో మెచ్చుకోని కొన్ని అంశా లున్నవి. ఒకటి: ఆయనవచనకవిత్వం వ్రాయకపోవటం. పట్టిందల్లా బంగారం చేయగల సామర్థ్య మున్నా వచనకవిత్వప్రక్రియను స్వీకరించక పోవటానికి ఆయనకు ఛందస్సుమీద ఉన్నపరమాధికారమే ప్రథమకారణం. పద్యం వ్రాయటం సంప్రదాయమన్నారు కొన్నిరోజులు, చివరకు గేయం వ్రాయటంకూడా నేడు ఛాందస మంటున్నారు కొందరు. పద్యాన్ని కాదని గేయం, దాన్ని కాదని వచన ప్రక్రియ చేపట్టినకవుల్లో శ్రీశ్రీ తరానికి చెందిన వాళ్ళు కొందరు అన్నిట్లో శక్తిఉండే ఆధునికప్రయోగాలు చేపట్టారు. ఇప్పటి తరంలో ఆశక్తి ఉందంటే ఆశ్చర్యపడవలసిన విషయం. అట్లని పద్యం నిషిద్ధమా? అభ్యుదయకవితలోని ఆవేశాన్ని పద్యం మొయ్యలే దని వారి భావం. విశ్వనాథ ప్రవృత్తిలో, ప్రయోగంలో ఆవేశంకంటె ఆలోచనం, ఉద్వేగంకంటె ఉద్విగ్నత, ఆడంబరం కంటె అంతర్ముఖీనత, పరుగుకంటె పయనం, చమత్కారం కంటె ధ్వని ప్రాధాన్యం వహిస్తాయి. అందువల్ల ఆయన పద్య విద్యలో పరమోన్నత శిల్పశిఖరాల నందుకొన్నారు. అపూర్వఛందస్సులు సార్థకంగా కల్పవృక్షంలో ప్రయోగించారు. తెలుగుదేశంలో మంగళంపల్లి బాలమురళీ కృష్ణగారు అపూర్వరాగాలకు ప్రాణం పోస్తున్నట్లుగా విశ్వనాథవారు అపూర్వ

ఛందస్సులకు జీవచైతన్యాన్ని సంతరించారు. వచనానికి దగ్గరగా ఉన్న మధ్యాక్కర ఆయనరచనలో నవనీతమై వివిధరసభావాలకు వాహికగా అవతరించింది. కవి తీసుకొన్న వస్తువులో కాని, ఛందస్సులోగాని కవిప్రతిభ ఎంత భాసించిం దన్నది ప్రమాణం. ప్రతిభ ఉంటే ప్రక్రియాప్రయోగాలు ప్రకాశిస్తాయి. విశ్వనాథ రసవాది. ధ్వనిసిద్ధాంతానుయాయి. అనుభూతి కేంద్రంగా కవితావిష్కృతి చేసే శిల్పి. ఆయనరచనలో ఏఛందమైనా రసాభిముఖంగా వ్యంజకత్వాన్ని భజిస్తుంది. రససూత్రం, ధ్వనివాదం వచనకవిత్వానికి విరోధాలు కావు. అనుభూతి నారాధించే ఆధునికులు విశ్వజనీనమైన కావ్యలక్షణంగా దేన్ని గ్రహిస్తారు. అన్ని ప్రక్రియలకూ పరమార్థం రసమే. దాన్ని వదలితే సాహిత్యానికి జీవమే లేదు. కావ్యాత్మను-లేక-రసానుభూతిని కేంద్రంగా రచనం చేసే విశ్వనాథ పద్యం వ్రాసినంత మాత్రాన ఆధునికుడు కాడా? పద్యం ఆయన కవితకు తొడుగు-అనుభూతి ఆత్మ. వచనకవితాప్రక్రియకూడా అనుభూతికి ఆవరణం మాత్రమే.ఆకృతియే ఆత్మ అని భావిస్తే అదే ఆధునికత అని అంటే వారి కొక నమస్కారము.

విశ్వనాథ వ్యావహారిక భాషావాది కాదని భాషావాదులలో కొందరి విమర్శ. వ్యావహారికభాషలో నున్న పలుకుబడులకు, రసానుకూల వాక్య విన్యాసాలకు విశ్వనాథ కల్పవృక్షంలో విరివిగా చోటు కల్పించాడు. ఆయన కావ్య భాష కున్న శక్తిని వ్యావహారికభాష కున్నశక్తిని గుర్తించినవారు. మహాకావ్య రచనకు అనువైన కావ్యభాషను ఆయన నిర్మించుకున్నారు. భాష భావవాహిక. భావం అనుభూతికి ఉపకరణం. అనుభూతి నందించే భాషను కావ్యానుగుణంగా మలచుకున్న మనీషి ఆయన. భాషాసిద్ధాంతాలు భావుకుల కావ్యాస్వాదనకు అవరోధాలు కావటంలేదు. అందుచేత ఆయన ఏ భాషలో రచనచేసినా పరితలకు రసానుభూతి కలుగుతున్నది. కావ్యంలో భాష వాదటం కాదు ప్రధానం-దాని పలుకుబడికి ఉన్న శక్తిని సర్వతోముఖంగా ప్రదర్శించటం. నన్నయనుండి నేటి దాకా తెలుగుభాష పోయినపోకడలను జీర్ణించుకొని తన జీవితకాలంలో కాన వచ్చిన భాషాశక్తిని పుంజించుకొని కల్పవృక్షంలో తన భాషాశక్తి నంతా విశ్వరూపంగా ప్రదర్శించినాడు విశ్వనాథ. ఇది చిన్నపనిగా భావిస్తే ఆయన కృషిని చిన్నచూపుతో చూచినట్లే అవుతుంది. నన్నయ తిక్కన్నల తరువాత ఆంధ్ర భాషాశక్తిని గుర్తించి మహాకావ్యరచనలో పొందుపరచిన ప్రతిభామూర్తి. భాషాతపస్వి విశ్వనాథ!

విశ్వనాథ రచించిన రామాయణ కల్పవృక్షం ఆధునికాలంలో నవ్య సాహిత్య ప్రయోగ సిద్ధాంతాలలో వారు ప్రతిపాదించిన కులపాలికా ప్రణయ తత్వానికి కావించిన మహాకావ్యరచన. 1934 నాటికి భావకవిత్వయుగంలో రాయప్రోలువారి అమలిన శృంగార తత్వం, కృష్ణశాస్త్రిగారి ఆదర్శసౌందర్యాన్వేషణం, చలంగారి స్త్రీవ్యక్తిత్వవిప్లవచైతన్యం. త్రిపురనేని రామస్వామిచౌదరిగారు సంప్రదాయంపై తీసుకొని వస్తున్న వివేచనాత్మకమైన విమర్శ – మొదలైనవి నూత్నభావచైతన్యానికి తెలుగుసాహిత్యంలో మార్గాల నావిష్కరించాయి. స్వాతంత్ర్యోద్యమం, ప్రబోధకవిత్వం, హరిజనోద్యమం, బ్రహ్మసమాజాది మతవ్యాప్తి – ఇవన్నీ జాతిలో నూత్నజాగృతిని కల్పించాయి. ఆధునిక నాగరికత పాశ్చాత్యసంస్కారసంవిలతమై భారతీయమైన సంస్కృతిసమస్యలను పునఃపరిశీలనం కావిస్తున్నది. కాలానుగుణంగా విలువలు మారుతూ వస్తున్నవి. ఎన్నిమార్పులు వచ్చినా వాటికి ప్రాతిపదికగా నిలవగలిగింది భారతీయ గార్హస్థ్యజీవితం. స్త్రీపురుషులసంబంధంలో పరమార్థదృష్టి క్రమంగా లోపించటం, ధర్మం అర్థసాధనంగా మారటం, కామం సర్వప్రవృత్తులకు మూలం కావటం వంటి మార్పులు ఆవ్యవస్థను అర్థరహితంగా మార్చే ప్రమాదం వాటిల్లింది. విశ్వనాథ ఆధునికనాగరికత, నవ్యభావవిప్లవం భారతీయ గార్హస్థ్య జీవన వ్యవస్థను భగ్నం చేయరా దనే విశ్వాసం కలవారు. సర్వధర్మాలకు బీజభూతమైన ధర్మ మది. సీతారాములప్రణయం అద్వైతప్రేమకు చిహ్నం. భారతీయ జీవితపరమార్థాన్ని జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలలోకూడా శాసిస్తున్న తత్వమది. దాన్ని నవ్యకవితాప్రక్రియల్లో విశ్వనాథ కులపాలికాప్రణయతత్వంగా ప్రతిపాదించారు. దాన్ని మహాకావ్య ప్రక్రియలో రూపొందించటానికి రామాయణంకన్న మరోవస్తువు లేదు. ఆధునికులు తమ కాలాని కనుగుణమైన మహాకావ్య నిర్మాణంకోసం కలలు కంటున్నారు. దేశభక్తిభావానికీ, స్వాతంత్ర్యసమర భావానికీ మహాకావ్యప్రక్రియలో ప్రయోగాలు వెలిశాయి. విశ్వనాథ అద్వైతప్రణయానికి అనర్ఘకావ్యాన్ని సంతరించారు. ఈ మహాకావ్యాలు సమకాలీనసమస్యలకెంత పరిష్కారమార్గాలో, సార్వకాలీనప్రయోజనాలకూ – అంత ప్రామాణిక వ్యాఖ్యానాలు. జాతి భౌతిక మానసిక బౌద్ధికవికాసానికి అభ్యుదయమార్గాలను ఆధునికప్రక్రియలు ఆవిష్కరిస్తుంటే– జాతి నైతిక ధార్మికవైజ్ఞానికవికాసాలకు ఆధునికంగా విశ్వనాథ తమరచనల నందిస్తున్నారు. ఒకటి వర్ణచిత్రవిన్యాసం, మరొకటి భిత్తికాకల్పనం. భావకవిత్వయుగంలో రాయప్రోలు, కృష్ణశాస్త్రి,

